E LARGEST CIRCULATED
LUGU MONTHLY

# చతుర

మార్చి 1999 • రూ. 7/-



గంటి వెంకటరమణ

## ఈ జీవితం నాది

# చతురప్రపంచం

## ఆస్తమాకి దివ్యౌషధం

"ఉల్లిచేసిన మేలు తల్లి చెయ్యలేదు" అంటారు. ఆ ఉల్లి నీరుల్లి కాదు, వెల్లుల్లి అంటున్నారు వైద్యులు. వెల్లుల్లి ఆరోగ్యానికి మంచిదని చాలామందికి తెలిసినా అల పోషక విలువలు నశించిపోతాయని అంటున్నారు. వెల్లుల్లి నూరిన ముద్ద కొన్ని రకాల చర్మరోగాలను కూడా నివారిస్తుంది.

వెల్లుల్లి బ్లడ్‌లో కొలెస్ట్రాల్‌ను తగ్గిస్తుంది. స్థూలకాయుల పాలిట వెల్లుల్లి వరప్రసాదం. నూనెలో వేగిన వస్తువులను తినడం మానలేనివారు దానితోపాటుగా తరచు వెల్లుల్లిని కూడా తింటే నూని ప్రభావం అంతగాపడదు. వెల్లుల్లి తింటే




వాటు లేకనో, వాసన పడకనో తినని వారు కూడా చాలామందే వున్నారు.

కానీ దాన్ని నిత్యభోజనంలో అలవాటుగా తినడం ప్రారంభిస్తే ఎన్నో రోగాల్నుండి మనలను రక్షిస్తుంది. వెల్లుల్లిని కూర కిందకు దింపాకనే కలపాలనీ, అది పొయ్యి మీద కూరతోపాటు ఉడికితే అందులోని నోరు వాసన వేస్తుందనీ, అది చుట్టుపక్కల వాళ్ళు భరించలేనిదిగా వుంటుందనీ వాపోయేవారు వెల్లుల్లితోపాటు భోజనంలో పెరుగుని తింటే ఆ వాసననరికట్టవచ్చు లేదా భోజనమవగానే ఒక లవంగాన్నిగానీ, యాలకునుగానీ బుగ్గన పెట్టుకుంటే ఆ సమస్య వుండదు. వెల్లుల్లిలో ఎల్లిన్‌సల్ఫేడ్

కవర్ ఫొటోగ్రాఫర్: డా॥ సి. ప్రకాశరావు

అనే ఆయిల్ వుంది. ఇందులోనే వెల్లుల్లి యొక్క పౌష్టిక విలువలన్నీ వున్నాయంటున్నారు వైద్యులు. వెల్లుల్లిని వేయించినా, ఉడికించినా ఈ ఆయిలు ద్వారా మనకందే పోషక పదార్థాలు 80 శాతం పోతాయి. కొన్ని రోగాలకి వెల్లుల్లి ఔషధంలా ఉపయోగపడుతుంది. కొన్ని చికిత్సలలో ఉడికించిన వెల్లుల్లిని ఉపయోగిస్తారు. ఏది ఏమైనా వెల్లుల్లిని పచ్చిగాను, ముక్కలు చెయ్యకుండానే అంటే పాయలుగా ఒల్చి భుజిస్తేనే సత్ఫలితాలనిస్తుంది. వెల్లుల్లిని రెండుగా కట్ చేస్తే అందులోని ఆయిల్ పదార్థం ఇగిరిపోతుంది. వెల్లుల్లిలో కొవ్వు కేవలం ఒక శాతం మాత్రమే వుంది.

పూర్వకాలపు వైద్యులు వెల్లుల్లి యొక్క ఔషధలక్షణాలను ఇలా తెలియజేస్తున్నారు. ఉదర సంబంధ వ్యాధులకు ఇది దివ్యౌషధం. ఈజిప్ట్‌లో పిరమిడ్ల నిర్మాణం జరిగినప్పుడు పనివాళ్ళ భోజనంలో నిత్యం వెల్లుల్లి వుండేలా చూసేవారు. కారణం... వాళ్ళు ఆరోగ్యవంతంగా వుండి నిర్మాణ కార్యక్రమంలో చురుకుగా పాల్గొనేవారు. ఇప్పటి వైద్యులు కూడా పచ్చివెల్లుల్లి రోజూ తినవచ్చని సలహా ఇస్తున్నారు. ఇది శరీరంలోని కొవ్వుని కరిగించి, కొత్తగా కొవ్వు తయారవకుండా సంరక్షిస్తుంది.

100 గ్రా. వెల్లుల్లిలో 30 మి.గ్రా. కాల్షియం, 310 మి.గ్రా. ఫాస్ఫరస్, 1.3 మి.గ్రా. ఐరన్, 13 మి.గ్రా. విటమిన్ సి. వున్నాయి. ఇవికాక విటమిన్ బి. కూడా తగుమోతాదులో వుంది. చైనీయులు క్రీ.పూ. 3,000లోనే దీని యొక్క ఔషధతత్వాన్ని గుర్తించారు. రక్తశుద్ధికి, ఎర్రరక్తకణాల అభివృద్ధికి ఇది చక్కని మందు అని వారు అప్పుడే స్పష్టంచేశారు. వెల్లుల్లిలో వుండే నూనిపదార్థం సైనస్‌తో బాధపడే వారి ముక్కులలోని అడ్డును తొలగించి బాధోపశమనం కలిగిస్తుంది.

వెల్లుల్లి ముద్దతో మొటిమలను నివారించవచ్చునంటున్నారు. ఆర్థరైటిస్‌కి, బ్లడ్ ప్రెషర్‌కి కూడా వెల్లుల్లి ఔషధమే.

కొన్ని రకాల క్యాన్సర్లని రాకుండా ఆపే ఔషధ శక్తి వెల్లుల్లిలో వుంది. క్యాన్సర్‌కి సంబంధించిన కొన్ని మందుల తయారీలో వెల్లుల్లిని వాడతారు. రాత్రి పడుకోబోయే ముందు 4 వెల్లుల్లి రేకులను ఒలిచి ఒక కప్పుడు పాలలోవేసి ఉడికించి ఆ పాలు సేవిస్తే ఆస్తమాకి దివ్యౌషధంగా పనిచేస్తాయి.

---

## రక్షణకి, భక్షణకీ ఒకే ఆయుధం

విజ్ఞాన శాస్త్రాభివృద్ధి మనిషి దైనందిన జీవితంలో ఎన్నో క్లిష్టమయిన విషయాలను సరళంచేసి కాలాన్ని, కష్టాన్ని చాలా పొదుపు చేస్తోంది. కత్తితోకోసి, కుట్లు వేయవలసివచ్చే ఎన్నో శస్త్రచికిత్సలను, అవేవీలేకుండా లేజర్ పద్ధతిలో చేసి రోగికి బాధలేకుండా, తక్కువ సమయంలో వైద్యాన్ని అందిస్తోంది. ఈ లేజర్ ఒక్క వైద్యరంగంలోనే కాక పరిశ్రములు, కమ్యూనికేషన్స్, మిలిటరీ, ఎయిర్ అండ్ స్పేస్‌ట్రావెల్ మొదలైన ఎన్నో రంగాల్లో బహుళప్రయోజనకారిగా వుంది. అమెరికాలో సదరన్ కాలిఫోర్నియాలోని హగ్స్ ఎయిర్ క్రాఫ్ట్ కంపెనీలో రీసెర్చ్ సైంటిస్ట్‌గా పనిచేసే డాక్టర్ థియోడర్ హెచ్ మైమేన్ అనే శాస్త్రవేత్త ఈ లేజర్ బీమ్‌ని 1960, జూలై 7న కనుగొన్నాడు. దానిమీద మరింత పరిశోధన చేశాడు. లేజర్ అనేది కాంతి పుంజంనుంచి వెలువడే తీవ్రమైన బీమ్. లేజర్ పుల్‌ఫాం- లైట్ యాంప్లిఫికేషన్ బై స్టిమ్యులేటెడ్ ఎమిసన్ ఆఫ్ రేడియేషన్.

లేజర్ కాంతికిరణానికి, మామూలుగా





దీపం నుంచి వెలువడే కాంతికిరణానికి ఉన్న పెద్దతేడా ఏమిటంటే- మామూలు లైట్‌నుంచి కాంతికిరణాలు అనేక పరిమాణాల్లో అన్ని వైపులకీ వెలువడతాయి. అదే లేజర్ కాంతికిరణం ఒకే పరిమాణంలో ఒకే నిడివిలో వెలువడుతుంది. మామూలు దీపపుకాంతి కిరణాన్ని గునపంతో పోలిస్తే లేజర్ కాంతికిరణాన్ని సూది మొనతో పోల్చవచ్చు. ఇలా కుదింపుతో వెలువడే లేజర్ కిరణం లక్షల కొద్దీ డిగ్రీల వేడిని సృష్టిస్తుంది.




ఇది సూర్యగ్రహంలోని వేడికన్నా అధికంగా వుంటుంది.

లేజర్ కాంతికిరణాన్ని సెంటీమీటర్‌లో కోటవ వంతుకు కుదించి ఫోకస్ చేయవచ్చును. మొదట్లో దీన్ని ఇనుపరేకులను కోసే రంపంలా వాడేవారు. ఆ తరువాత దీన్నించి బహుళ ప్రయోజనాలున్నట్లు తెలుసుకున్నారు.

కంటి ఆపరేషన్లకి ఎక్కువగా లేజర్‌ని ఉపయోగిస్తున్నారు. రెటీనాలోని కొత్త రక్తనాళాల ఎదుగుదలని లేజర్‌తో నిర్మూలిస్తున్నారు. అలాగే మెదడు, వెన్నెముకల్లోని ట్యూమర్స్‌ని కూడా లేజర్ ద్వారా తొలగిస్తున్నారు.

మనిషి వెంట్రుకకన్న తక్కువ డయామీటర్‌గల పరిమాణంలో లేజర్ బీమ్‌ని టెలిఫోన్ కమ్యూనికేషన్‌లో ఉపయోగిస్తున్నారు. దాన్నే ఫైబర్ ఆప్టికల్ కేబిల్ అంటారు. ఈ కేబిల్ ద్వారా ఒకేసారి 700 టెలిఫోన్ సంభాషణలను ప్రసారం చేయవచ్చు. లేజర్‌తో చేసిన యంత్రాన్ని ఉపయోగించి శత్రుదేశ విమానాలని, మారణాయుధాల్ని మోసుకువచ్చే రాకెట్లనీ దారిలో కూల్చేయచ్చు. రాబోయే భూకంపాలని కనుక్కోడానికి కూడా లేజర్‌ని ఉపయోగిస్తున్నారు.

మనిషిని రక్షించడానికి, భక్షించడానికీ కూడా లేజర్‌ని సమానంగా ఉపయోగించుకోవచ్చు.

★

# చతుర

సంపుటి 22
సంచిక : 2
మార్చి 1999

అతడూ, ఆమె మంచి మిత్రులు. పేదకుటుంబంలో పెరిగిన కారణాన ఆ సౌందర్యవతి ఆశలూ, ఆశయాలూ, కలలూ... వాస్తవంలో అసంభవాలుగానే మిగిలిపోయాయి. తప్పని పరిస్థితుల్లో తెలిసిన వ్యక్తినే అయిష్టంగా వివాహమాడవలసివచ్చింది.

ఒక మంచి మిత్రునిగా అతనిలో ఆమెకు నచ్చిన లక్షణాలున్నా కూడా భర్తగా అతనిపట్ల ఆమె నిర్లిప్తతనే పెంచుకుంది. యవ్వనమంతరించిన నడివయస్సులో... యాంత్రిక సంసార జీవనఫలాలుగా పుట్టిన ముగ్గురు పిల్లలనీ, భర్తనీ, సమాజాన్ని ధిక్కరిస్తూ... ఆమె ఓ సరికొత్త మార్గాన్ని ఎన్నుకుని అడుగు ముందుకేసింది. అది ఆమె జీవనగతిని ఎలా మార్చింది? ఏటికి ఎదురీదగలిగిందా? ఏటివాలులోనే పయనించిందా?

మనసుకు హత్తుకునే మనోవిశ్లేషణతో, సజీవపాత్ర చిత్రణతో గంటి వెంకటరమణ రచించిన 'ఈ జీవితం నాది' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

# ఈ జీవితం నాది

-గంటి వెంకటరమణ

శ్రీమహాలక్ష్మి మంచమ్మీద వెల్లకిలా పడుకుని కలలు కంటోంది. కథల్లో, నవలల్లో రాసినట్లు తన కలల రాకుమారుడు ఆరడుగుల అందగాడు అయి వుండాలి. డాక్టరో, ఇంజనీరో అయితే బాగుంటుంది. బాగా సంపాదిస్తాడు కాబట్టి, ఉండేది మహానగరం హైద్రాబాదే కాబట్టి అందమైన పెద్ద ఇల్లు కట్టుకోవచ్చు. అందులో అమరేట్లు ఫర్నిచర్ వుండాలి. విశాలమైన కిటికీలకి ముఖమల్ తెరలు కడుతుంది తను.

రాకుమారుడికి మోటార్ సైకిల్ వుంటుంది. దాని మీద అతను హాస్పిటల్ నుంచో, ఫ్యాక్టరీ ఆఫీసు నుంచో రాగానే కాఫీ టిఫిన్లు అందించి 'ఛల్‌మోహనరంగా' అంటూ టాంక్‌బండ్ మీదికి షికారు వెడుతుంది.

"శ్రీమహాలక్ష్మీ! ఓ శ్రీమహాలక్ష్మీ'' తల్లి సుభద్రమ్మ కేకపెట్టేసరికి వులిక్కిపడింది. యదార్థంలోకి రాగానే నీరసం వచ్చేసింది. ఓసారి చుట్టూ చూసుకుంది. నవారు మంచం అది. అన్నీముళ్లే. వాటిని సరిచేసి అతికష్టంమీద పడుకోవాలి. లేకపోతే వీపు మీద గుచ్చుకుంటాయి.

"శ్రీమహాలక్ష్మీ''

"వస్తున్నానమ్మా!"

ఆరుబయట పప్పురుబ్బుతున్న సుభద్రమ్మ విసుక్కుంది. "దిక్కుమాలిన పుస్తకాలు చదువుతూ కూర్చోపోతే ఓసారి ఈ పప్పు రుబ్బకూడదూ''

"ఎందుకు రుబ్బాలి? నాకేమీ ఈ గారెలు తినాలని జిహ్వా ఏడవడంలేదు. నేను కాలు మీద కాలు వేసుకుని ఈజీ చైర్‌లో కూర్చుని సుఖంగా పుస్తకాలు చదువుకుంటానమ్మా'' శ్రీమహాలక్ష్మి మనసులో అనుకుంటోంది గానీ పెదవులు దాటి ఈ మాటలేవీ బయటికి రాలేదు.

"మాట్లాడవేం?"

శ్రీమహాలక్ష్మి చీరకుచ్చిళ్లు బొడ్లో దోపుకుని రుబ్బురోలు దగ్గర కూర్చుంది. సుభద్రమ్మ వీధివాకిలి వూడ్చి వచ్చింది. ఓ అరగంటలో ఈ పనులన్నీ అయిపోతే శ్రీరామనవమి పందిట్లోకెళ్లి కూర్చోవచ్చు. హరికథలూ, నాటకాల్తో తొమ్మిది రోజులూ ఇట్టే గడిచిపోతాయి.

శ్రీమహాలక్ష్మి పప్పు రుబ్బడం పూర్తయి గారెలు కూడా రెడీ అయాయి. చంద్రమౌళిగారు వాటిని ఆరగించి భుజంమీద కండువా వేసుకుని పందిరి వైపు బయలుదేరారు. ఆయన వెనుక సుభద్రమ్మ నడుస్తోంది.

శ్రీమహాలక్ష్మి ఆ ఇద్దర్నీ కన్నార్పకుండా చూస్తోంది. చీకూచింతాలేని జీవితం. ప్రొద్దున్నే సూర్యుడు ఉదయిస్తాడు. అంతకు ముందే ఆయనకి బెడ్‌కాఫీ ఇస్తుందావిడ. ఆయన దయానంద్ హోటల్ వరకూ వెళ్లి అక్కడే మొహం కడుక్కొని ఓ ప్లేటు ఇడ్లీ తిని వస్తారు. ఎనిమిది గంటలకి ఫ్యాక్టరీ సైరన్ వినిపించగానే కందిగింజంత నల్లమందు వేసుకుని వాలుకుర్చీలో పడుకుంటారు.

తొమ్మిది గంటలకి భోజనం. పుస్తకాలు బాగా చదువుతారు. నెపోలియన్‌బోనా పార్టీ, షేక్స్‌పియర్ బైబిల్ ఓల్డ్ టెస్ట్‌మెంట్.. ఇలా పుస్తకాల పురుగే ఆయన. జమీ అంతా పోయాక వర్తి చేతుల్తో తూర్పుగోదావరి నుంచి సికింద్రాబాద్‌కి వచ్చేశారు.

అయినా రాజసం కొంచెం కూడా తగ్గలేదు.

సంపాదించడం తెలీదు. కష్టపడడం ఎరగడు. అయితే ఏం, ఆకలి చెవి మెలేసి చేయిస్తుంది. సోప్ అండ్ ఆయిల్ వర్క్స్‌లో అకౌంటెంట్‌గా చేరి సంసారాన్ని ఈడ్చుకు వస్తున్నారు. అదృష్టవశాత్తు పిల్లలకి పెళ్లిళ్లు చేసి అత్తవారిళ్లకి పంపించేశారు. ఆ ఆడపిల్లలు ఎక్కడో ఉత్తర భారత దేశంలో వుంటున్నారు. ఎప్పుడో ఓసారి ఉత్తరం రాస్తారు.

అంధరికంటే చిన్నది నాలుగో ఆడపిల్ల శ్రీమహాలక్ష్మి అంటే ఆ తండ్రికి వల్లమాలిన





ప్రేమ. శ్రీమహాలక్ష్మి అని పూర్తి పేరుతోనే పిలుస్తారు.

వీధివాకిలి తలుపుకి ఆనుకుని నిల్చున్నదల్లా తల్లీతండ్రీ దూరంగా మలుపు తిరగగానే గుమ్మంలో చతికిలబడింది శ్రీమహాలక్ష్మి. నాలుగు గదుల పోర్షన్ అది. ఆ ఇంటిని ఆనుకుని వరుసగా ఏడు ఇళ్లు వున్నాయి. మొత్తం ఆ కాంపౌండ్‌లో నలభై అయిదు ఇళ్లు వున్నాయి. దూరంగా ప్రాగాటూల్స్ కనిపిస్తూంటుంది. కరెంట్ దీపాలులేవు. ఇలా శ్రీరామనవమికి మాత్రం అందరూ చందానేసుకుని ఆ పది రోజులూ వుత్సాహంగా గడిపేస్తారు.

శ్రీమహాలక్ష్మికి తలనిండా కందిరీగ తుట్టలు పరిగెడుతున్నట్లనిపించింది.

డబ్బు దాచడం తెలీదు తండ్రికి. పిట్టను కొట్టి పొయ్యిలో పెట్ట... అంతే! పాలకోవా, మిర్చిబజ్జీలు కొంచెం కొంచెం తినడం ఇష్టం. చుట్ట తాగడం ఇష్టం. అప్పుడప్పుడు జీవన్‌కేనా మన్ డోలే పాడతారు, అర్థం తెలీకున్నా!

డబ్బు దాచాలనే ఆలోచన లేదు. తన బిడ్డ త్రిపుర సుందరి అనీ ఎప్పుడో ఓ చల్లని సాయంకాలం పూట తెల్లని హంసలాంటి కార్లోంచి మన్మథుడు దిగేసి మెళ్లో వరమాల వేస్తాడనీ అంటూ వుంటారు.

"ఎవరైనా వింటే'' సుభద్రమ్మగారు విసుక్కుంటుంది. దానికాయన చిన్ననవ్వు విసిరేస్తారు.

"శ్రీమహాలక్ష్మి గుడి దగ్గర కూర్చుందాం రా'' పక్కింటి. సబిత వచ్చి పిలిచింది.

తలుపు దగ్గరకి వేసి అరుగుమీద కూర్చున్నారు. పాణిగ్రాహి ఐదో నంబరు ఇంట్లో వుంటాడు.

"ఇవాళ హరికథ అంటున్నారు. మనం కూడా వెడదామా'' అనడిగాడు పాణిగ్రాహి.

"మూడ్ బాగులేదు'' అంది శ్రీమహాలక్ష్మి.

సబిత సన్నగా నవ్వింది. "ఈ కాంపౌండ్‌లో వున్నవాళ్లందర్నీ ఏరికోరి ఇక్కడికి చేర్చినట్లున్నాడు ఆ భగవంతుడు. రేపటి గురించి ఆలోచించరు, యంత్రాల్లా బతికేస్తుంటారు. యడాపెడా పిల్లల్ని కనేస్తూ వుంటారు. ఇరవై ఏళ్ల ఆడపిల్ల ఆరు నెల్ల చెల్లినో, తంబిగాడ్నో ఎత్తుకుని తిప్పాలి. ఆ పిల్ల పెళ్లి చేయాలని తల్లితండ్రులు అనుకోరు. సంప్రదాయం, కులంగోత్రం గాడిదగుడ్డు, పిండాకూడూ అనుకుంటూ ఈ ఆడపిల్లలు అడుగుముందుకు వేయరు. ఈసురోమని మనుషులుంటే..."

రెండు చేతులూ ఎత్తి శబ్దం చేస్తూ నమస్కారం పెట్టాడు పాణిగ్రాహి. "సందు దొరికితే చాలు సమాజంమీదా, మనుషులమీదా విరుచుకుపడతావు. మీ నాన్నని రానీ అప్పుడు చెబుతాను''

సబిత మొహం ఉక్రోషంతో ఎర్రబడింది. "నాకేం భయంలేదు. మా నాన్నకాదుకదా ఆయన్ని పుట్టించిన జేజి వచ్చినా భయపడను. మనం అందరం స్కూల్‌ఫైనల్ పాసయ్యాంగదా ఏదైనా జాబ్ వెతుక్కుందాం"

"ఆ మాట అన్నావు బాగుంది. తప్పకుండా జాబ్ వెతుక్కుందాం. మనమొహాలకి పై చదువులు చదివే భాగ్యం ఎటూలేదు'' అన్నాడు పాణిగ్రాహి.

"నేను జాబ్‌చేయను'' శ్రీమహాలక్ష్మి ఖచ్చితంగా చెప్పింది.

సబిత మాట్లాడలేదు. ఆమె తండ్రికి పోలీసు డిపార్ట్‌మెంట్‌లో పని. ప్రతి వస్తువూ అతను పెదవి విప్పనవసరం లేకుండానే ఇంటికి చేరుకుంటుంది. మొదటి భార్య కూతురు సబిత. రెండో భార్య సబిత ఈడుదే. అతని పేరు ఆదినారాయణ.

సబిత పెళ్లికి/అతను బాంకులో డబ్బు దాచనవసరం లేదు. దానంతట అదే వస్తుంది. రెండో భార్య పిల్లలు నలుగురూ ఏడాది తేడాల్తో పుట్టారు. రెండు వారాల క్రితమే మరో ఆడపిల్లని కన్నది సబిత సవతి తల్లి సుకన్య.



సచిత్ర విచిత్రం

# అదృష్టవంతుడు

టెక్సాస్‌లోని శాన్ ఏన్‌టొనియోకి చెందిన రాబర్ట్ లూంట్‌లాండ్ అనే 43 ఏళ్ళ వయసుగల వ్యక్తి కొత్తగా ఓ ఉద్యోగంలో చేరాడు. అంతకుమునుపు ఆ పోస్ట్‌లో పనిచేసే అతను కారు ఏక్సిడెంట్‌లో మరణించాడు. ఉద్యోగంలో చేరాక తన టేబిల్ సొరుగును క్లీన్ చేసుకుంటూంటే అందులో పడివున్న ఓ లాటరీ టిక్కెట్ అతని కంటపడింది. ఆ లాటరీ కంపెనీకి ఫోనుచేస్తే వాటి ఫలితాలు 33 రోజుల క్రితం వెలువరించామని, 120 రోజుల్లోగా ఆ డబ్బు తీసుకోవచ్చునని, ఆ టిక్కెట్ డెబ్భై నాలుగు లక్షల అరవై ఆరువేల అయిదువందల పదకొండు డాలర్ల అరవై సెంట్లు కొట్టిందని చెప్పారు. ఆ లాటరీ టిక్కెట్ ఓనర్ మరణించాడని, పోనీ భార్యకి అందజేద్దామంటే విడాకులు తీసుకుందని తెలిసింది. కాబట్టి తనకి దొరికిన ఆ లాటరీ టిక్కెట్‌కి లీగల్ ఓనర్ తనే అని తెలిసిన అతని ఆనందానికి అవధులు లేవు.

ఆ నలుగుర్నీ తీసుకుని. నాయనమ్మ పందిట్లోకి వెళ్లింది. తండ్రి పొద్దుపోయేవరకూ రాడు.

"ఈ కాంపౌండ్‌లోని మనుషులంతా ఇక్కడే అతుక్కుపోతారో ఏమో... కూపస్థ మండూకాలు నయం. వీరికి పైకిరావాలనే ఆలోచనే వుండదు'' సబిత అందుకుంది.

"నీకేం నువ్వు వూ అనాలిగానీ కొండమీద కోతిని తీసుకు రాగలరు మీ నాన్న''

"అదే... అక్కడే కోపం వస్తుంది నాకు. ఈ ఇంట్లోంచి బయటికి వెళ్లడం మీరనుకున్నంత ఈజీకాదు. ఇప్పుడే పెళ్లి దేనికమ్మా మరో నాలుగేళ్లయితే పిల్లలు బడికి వెడతారు అంటాడు మానాన్న. నానమ్మ జోరీగలా ఈ విషయం అంటూనే వుంటుంది. 'పాపం చిన్న వెధవలు. వాళ్లని వదిలేయడం నాకూ బాధే అనుకో. వాళ్లమ్మ ఏటా బాలింత, చూలింత... నాకామ్మాయిని పిన్నీ అనాలన్నా, అమ్మా అనాలన్నా అనీజీగా వుంటుంది. అందరి పోర్షన్లలాగే మా పోర్షనూ వుంది. అయితేనేం. మా నాన్న రెండు రూములూ బాచ్‌లర్స్‌కి అద్దెకు ఇచ్చాడు. వంటింట్లో వాళ్లు పడుకుంటే నేనూ నానమ్మా ఇవతలిగదిలో పడుకోవాలి. ఒక్కోసారి ఎంత ఇబ్బందో చెప్పలేను''

"అర్థం అయింది'' శ్రీమహాలక్ష్మి అంది. "నాకు ఏ బాదరబందీలూ లేవు. నేను ఓ డాక్టర్నో, ఇంజనీర్నో పెళ్లి చేసుకుంటాను''

పాణిగ్రాహి నవ్వుతూ "శ్రీమహాలక్ష్మీ నీ కోరిక నెరవేరుగాక" అంటూండగానే పాల పిట్ట రెట్ట వేస్తూ వెళ్లిపోయింది. "కృష్ణ కృష్ణ!" అన్నాడు పాణిగ్రాహి.

"నక్షత్రం రాలితే కద కృష్ణకృష్ణ అంటారు'' సందేహంగా అడిగింది శ్రీమహాలక్ష్మి.

"వెన్నెల్లో పాలపిట్ట రెట్టవేస్తే నక్షత్రంలాగే కనిపిస్తుంది. సబిత చెప్పింది నిజమే! మనం జాబ్‌చేద్దాం శ్రీమహాలక్ష్మీ'' అన్నాడు అతను.

చీకటి పడి చాలాసేపు అయింది. దూరంగా మైకులో హరికథ చెప్పేశాస్త్రులు గారి గొంతు స్పష్టంగా వినిపిస్తోంది.

ముగ్గురి మధ్యా కొద్దిసేపు నిశ్శబ్దం చోటు చేసుకుంది.

మరి కొద్దిసేపట్లో 'పవమాన సుతుడు పట్టుపాదారవిందములకు... మంగళం' అంటూ వినిపించింది.

పాణిగ్రాహి అతని తల్లి రాజేశ్వరమ్మ పిలుస్తూంటే వస్తాను అని వెళ్లిపోయాడు.

శ్రీమహాలక్ష్మి ఇంట్లోకి వచ్చేసింది.

తల్లీతండ్రీ ప్రసాదం చేతిలో పెట్టారు. ఏళ్లనుంచి ఇదీ రొటీన్‌గా జరిగే కార్యక్రమమే. ధనుర్మాసంలో భజన ప్రసాదం, ఇప్పుడీ ప్రసాదం.

రాత్రి చీకట్లు ఆ కాంపౌండులో త్వరగా పరుచుకుంటాయి. కరెంటు దీపాలు లేకపోవడంవల్లే ఇలా అనిపిస్తుంది.

మర్నాడు లేచీలేవగానే గబగబా పనులు పూర్తిచేసుకుని పాణిగ్రాహి ఇంటికి వెళ్లింది శ్రీమహాలక్ష్మి. రాజేశ్వరమ్మ 'రామ్మా' అంది. పాణిగ్రాహి 'వెల్‌కమ్' అన్నాడు.

"వారపత్రిక ఈ వారంది తెచ్చిపెడుదూ?" అంది.

"ఏమిటో విశేషం"

"బోర్!"

"అవశ్యం" అతను గోడమీద మేకుకి వున్న చొక్కా వేసుకుని బయటపడ్డాడు.

"నేను వెడుతున్నాను అత్తా'' అంది రాజేశ్వరమ్మతో.

"కాఫీతాగి వెళ్లు''

"ఒద్దులే' అని వచ్చేసింది.

తండ్రి ఆఫీసుకి బయలుదేరాడు. సావిత్రమ్మ వచ్చింది. ఈ ఇద్దరూ కలిస్తే ఈ నెలకి సరిపోయే ఒత్తులు చేసుకుంటూంటారు. ఆపైన 'గీతార్థాసారమూ వినుమూ, నవనీతము చేకొను విధమూ' అని ప్రాక్టీసు చేస్తారు అరిగిపోయిన రికార్డులా. ఒకరు ఆరోహణలో

పాడుతుంటే మరొకరు అవరోహణలో పాడుతుంటారు. చెవుల్లో దూది పెట్టుకోవాలనిపిస్తుంది. మళ్లీ పాపం అనుకుంటోంది. ఎవరికి వాళ్లే గొప్పగా ఫీల్ అయిపోతూ తాదాత్మ్యంలో అపస్వరాలతో పాడేస్తూంటారు.

శ్రీమహాలక్ష్మి వుండీ వుండీ వాకిలివైపు చూస్తోంది పాణిగ్రాహి తెచ్చే పత్రికకోసం. అరగంట తరువాత అతను స్పీడుగా వచ్చేసి ఆమెకి ఇచ్చేసి అంతే స్పీడుగా వెళ్లిపోయాడు.

శ్రీమహాలక్ష్మి తనకి అత్యంత ప్రీతిపాత్రం అయిన నవారు మంచంమీదికి ఎక్కి బోర్లాపడుకుని పుస్తకం తిరగేసింది వారఫలాలు శీర్షిక కోసం. 'ఈ వారం మీరు కోరుకున్న కోరికలు నెరవేరుతాయి' అని చదివింది.

"హాయ్ రాజకుమారా" శ్రీమహాలక్ష్మి పెదవులు బిగించి తనలో లోపలే అరచింది.

"స్వల్ప అనారోగ్యం" ఓసారి బుర్రగోక్కుంది. ప్రొద్దున్న కంచం తీసి పరధ్యానంగా లేస్తూంటే కిటికీ రెక్క ఫెడేల్మని తగిలింది."బంధువుల రాక."సావిత్రమ్మగారు రానేవచ్చారు. "మీకు ఆప్తులు లభిస్తారు." అదేవిటో!

పేజీలు తిరగేస్తూ ఓ చోట ఆగిపోయింది. "ప్రియమైన కన్యలకి నా శుభాభివందనాలు. నేను చలపతిని. గ్లామర్ లేని పేరు. నా ఎత్తు ఆరు అడుగులకి కొద్దిగా అటూ ఇటూ. నలకూబరుడిని కానుకానీ కనుముక్కుతీరు తీర్చిదిద్దినట్లు వుంటాయని అంటారు నా స్నేహితులు.

స్నేహితులు అంటే సహచరుల్లో హితవు కోరేవాళ్లని నా అభిప్రాయం. భూతదయగల విశాల హృదయం నాది.

నేను బిఏ పాసై ఓ బాంక్‌లో పనిచేస్తున్నాను. నాతో అమ్మ వుంటుంది. వక్కతింటే పళ్లు నల్లగా అవుతాయనీ, కాఫీ తాగితే ఎసిడిటీ పెరుగుతుందనీ వాటిజోలికి వెళ్లను.

నేను పెళ్లి చేసుకోవాలని నిర్ణయించుకున్నాను.

నేను కోరుకునే ఆడపిల్ల కనీస చదువు చదివి ఇంటినీ అమ్మనీ కనిపెట్టుకుని వుండాలి. అలా అని నా ఇంటికి గృహలక్ష్మిలా రావాలేగానీ గృహంలో పనిపాటలు చేసే దాసి అవసరంలేదు. కాలమాన పరిస్థితులని బట్టి ఉద్యోగం చేసి వేణ్ణీళ్లకి చన్నీళ్ల సాయం చేస్తే ఓకే. ఆడుచుపాడుచు చందాన. పోతే ఒద్దికగా, ముద్దుగా, ముద్దబంతి పువ్వులా గోదావరి గలగల సవ్వడి స్ఫురించేలా వుంటే నా జన్మధన్యం అయినట్లే భావిస్తాను. నాకు కట్నకానుకలమీద ఆశలేదు. ఆకాశం అంత పందిరీ, భూదేవంత అరుగూతో అట్టహాసంగా ఆర్భాటంగా పెళ్లి చేసుకోవడం, వందలమందికి భోజనం పేరిట దుబారా ఖర్చు చేయడాన్ని నేను వ్యతిరేకిస్తాను. ఇన్ని రాస్తున్నందుకు నన్నో చవటాయ్ కింద భావించేవాళ్లు ఇది చదవడం అనవసరం.

ఇంటరెస్ట్ వున్న కన్నెల్లో ఎవరైనా నన్నర్థం చేసుకుని నా జీవిత గవాక్షపు తలుపు తట్టదలిస్తే వారికిదే నా హృదయ పూర్వక స్వాగతం.

-చలపతి"

శ్రీమహాలక్ష్మి అదంతా ముందు యథాలాపంగా తరువాత మామూలుగా ఆపైన బుర్ర కెక్కించుకుంటూ చదివింది. మనుషుల్లో చాలా మందిని చూసింది. ఓనమాలు మొదలు స్కూలు ఫైనల్ వరకూ... బజార్లో మనుషుల్ని, పచారీకొట్లో, కాంపౌండ్‌లో ఇలా ఎంతోమందిని. బాగా తెలిసిన సన్నిహితులు అని లెక్క పెడితే పాణిగ్రాహి... పాణిగ్రాహి ఓ.కే. ఫర్వాలేదు. మంచి,మర్యాద, సమస్తం తెలిసిన వ్యక్తి.

ఈ చలపతి ఎవరోగానీ సంస్కారాన్ని ఒలకపోసేశాడు. చప్పున మంచంమీంచి లేచింది. మూలగది కిటికీలోంచి పిలిస్తే వంటింట్లో వున్న సబితకి వినిపిస్తుంది. "సబితా!" రెండు సార్లు పిలిచేసరికి మూడో కేక రాకుండానే ఆమె శ్రీమహాలక్ష్మి ముందు

వాలింది.

ఏవిటబ్బా అంత అర్జంట్!

శ్రీమహాలక్ష్మి ఆమె చేతిని అందుకుని మంచంమీద కూర్చోబెట్టుకుని చలపతి రాసింది చూపించింది. ఆసక్తిగా చదివిన సబిత కళ్ళలో మెరుపులాంటి నవ్వు.

"ఎంత బాగా రాశాడో" శ్రీమహాలక్ష్మి కళ్ళు వెడల్పయాయి.

"అవునవును'' అంతలోనే సబితకి బోలెడు సందేహాలు వచ్చాయి.

"అవునుగానీ శ్రీమహాలక్ష్మీ... ఈరోజుల్లో కానీకట్నం ఆశించకుండా బంగారు బాతులాంటి బ్యాంక్ జాబ్ వున్న ఈ పెద్దమనిషి... నిజంగానే''

"అదేమోగానీ నాకిది నచ్చింది. జవాబు రాయాలనుకున్నాను. కానీ నా చిరకాల వాంఛ ఒకటి వుంది కద. నేను డాక్టర్నో, ఇంజనీర్నో చేసుకోవాలనుకుంటున్నాను సబితా''

"ఒకవేళ డాక్టరో, ఇంజనీరో దొరకలేదనుకో..." సబిత నవ్వి "పాపం శమించుగాక" అంది.

"ఇలాగే కన్యలాగే వుండిపోతాను''

"భీష్మ ప్రతిజ్ఞా''

"అంతే అనుకో"

"మరి నన్ను దేనికి పిలిచావు?"

"ఈ బాక్స్ ఐటమ్‌కి నీచేత రిప్లై రాయించాలని''

"మా నాన్నకి తెలిసిందంటే చీరి ఎండేస్తాడు''

"నువ్వు సరే అంటే ఆ ఏర్పాట్లు నేను, పాణిగ్రాహీ చూసుకుంటాం"

"నాకు పెళ్ళి అంత అవసరం లేదని మా నాన్న అంటున్నాడే''

"పెద్దవాళ్లని ఏదైనా అంటే కళ్ళుపోతాయి... లేకపోతే చింతని దులిపినట్టు దులిపేసేదాన్ని''

సబిత పుస్తకం తిరగేస్తూ "ఫొటో కూడా వేసి వుండాల్సింది'' అంది అసంతృప్తిగా.

"ముందైతే నీ పేర వుత్తరం వ్రాయనీ. ఆ పైన ఫొటో పంపించమందాం. లేదంటే పార్కులో కలుసుకునే ఏర్పాట్లు చేసుకుందాం."

సబిత ఆలోచనలో పడింది. కొంచెం ఆగి "భయంవేస్తోంది'' అంది.

"తప్పు చేసేవాళ్ళూ, అప్పుచేసేవాళ్ళేగానీ మనం భయపడకూడదు''

పక్కింట్లోంచి సబిత నాయనమ్మ గొంతు చించుకుని సబితని పిలుస్తూంటే సుభద్రమ్మ అక్కడికి వచ్చింది. "సబితా మీ నాయనమ్మ పిలుస్తోంది. వినిపించలేదామ్మా''

"వినిపిస్తోంది పిన్నిగారూ. నేను వెళ్ళొస్తానే శ్రీమహాలక్ష్మి'' అని పరిగెత్తింది.

సుభద్రమ్మ కూతురు మొహంలోకి చూసి దీర్ఘంగా నిట్టూర్చింది. శ్రీమహాలక్ష్మి ఆమెవైపోసారి చూసి "ఇదిగో! ఇలాంటి అఖర్లేని వేడి నిట్టూర్పులు విడుస్తూంటేనే నాకు ఒళ్ళు మండుతుంది. అసలు నాకు తెలియక అడుగుతానమ్మా నన్ను చూడగానే నీకు ఎందుకంత బాధేస్తుంది'' అని అడిగింది.

సుభద్రమ్మ చేతి వేళ్ళు లెక్కపెట్టుకుంటూ "నీకిప్పుడు ఇరవై ఏళ్ళు దాటాయి. నువ్వు ఇలాగే వుండిపోతే నా గుండె ఆగిపోయి చచ్చిపోతానంతే'' అంది. అప్పటికే ఆవిడ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ప్రపంచంలో ప్రతి వాళ్ళూ ఠంచనుగా వయసురాగానే పెళ్ళి చేసుకుంటున్నారు. నేను ఒక్కదాన్ని పెళ్ళాడకపోతే నష్టంలేదు'' అంది విసుగ్గా.

చంద్రమౌళిగారు అప్పటికే వెళ్ళిపోయారు.

మధ్యాహ్నం పాణిగ్రాహి వచ్చాడు. అప్పటికి సుభద్రమ్మ నేలమీద కొంగుపరుచుకుని పడుకుంది. అటువైపు గదిలో పడుకుని రేడియోలో పాటలు వింటోంది శ్రీమహా

లక్ష్మి. మెల్లగా పాడుతోంది. పాణిగ్రాహి పిలుపుకి ఇటు తిరిగి, "వచ్చావా! కూర్చో" అంది.

"నేను వస్తానని ఎలా తెలుసు?" అడిగాడు అతను.

"సబిత చెప్పి వుంటుందని"

"సబిత అన్ని విషయాలూ చెప్పింది. నాక్కూడా ఈ ప్రపోజల్ నచ్చింది. మనమే ఏదో చేయాలి"

శ్రీమహాలక్ష్మి లోపలికి వెళ్ళి మంచినీళ్ళు తీసుకు వచ్చి ఇచ్చింది. అతను అందుకున్నాడు. "ఓ పెద్ద పని ప్రారంభించేప్పుడు పథకం ప్రకారం చేయాలి. ముందు మంచిరోజు నక్షత్రం, తిథీ, అన్నీ చూడనీ"

"వ్వాట్" కెవ్వుమంది శ్రీమహాలక్ష్మి.

"చూడు శ్రీమహాలక్ష్మి చీమకుట్టినట్లు 'వ్వాట్' అని కేకపెట్టి గంతువేసేంత ఇంగ్లీషు నాకు రాదు. మనం సాలె పంతులు బళ్లో చదువుకున్నాం. మీ నాన్నగారి దయవల్ల నువ్వు ఇంగ్లీషు అనర్గళంగా మాట్లాడగలవు గానీ మాకు రాదు"

శ్రీమహాలక్ష్మి అతన్ని మంచంమీద కూర్చోమని చెప్పి తను కిటికీలో కూర్చుంది. ఇంట్లో కుర్చీలు, బల్లలు లాంటివేవీ లేవు మరి.

"చూడు పాణిగ్రాహి! మనం తిథి, వార, నక్షత్రాలు, మీనమేషాలూ లెక్కపెట్టద్దు. ఏది ఎప్పుడు మంచిదని తోస్తే ఆ పని వెంటనే చేసేయాలి. ఇంతకీ నువ్వు చలపతిగారు రాసింది చదివావా?"

పాణిగ్రాహి బుర్ర వూపాడు. "లైబ్రరీలోనే చదివాను. చాలా గొప్ప మనిషి. ఎంత ధైర్యం వుండాలి అలా రాయడానికి. ఓ ఆడపిల్లతో ఇలాంటి డెలికేట్ విషయం మాట్లాడాలంటే ఇబ్బందిగా అనిపిస్తుంది. అతగాడు కన్నెపిల్లలందరికీ తన విన్నపాన్ని ఎంత చక్కగా తెలిపాడో... నాకు చాలా నచ్చాడు"

"అందుకే సబితని వెంటనే 'వూ' అని బుర్రవూపమన్నాను"

పాణిగ్రాహి చుట్టూచూశాడు. కొద్దిగా గొంతు తగ్గించి "శ్రీమహాలక్ష్మి మనం చదివిన స్కూల్లోనే టీచర్ జాబ్ వుందిట. ఒకటి కాదు మన ముగ్గురికీ కూడా సాలె పంతులుగారు యిస్తామని చెప్పారు. నువ్వు 'వూ' అను జాబ్ చేద్దాం"

శ్రీమహాలక్ష్మి కళ్ళు కెంపులైపోయాయి. పాణిగ్రాహి కంగారుపడ్డాడు. "సారీ" అనేశాడు కూడా.

శ్రీమహాలక్ష్మి పచార్లు చేస్తూ "ఓ.కే... ఓకే" అని తననుతాను కంట్రోల్ చేసుకుంది. "పాణిగ్రహీ నాకు బీదతనం అంటే చాలా కోపం. ఒక్కోసారి నాన్నగారికి జీతం ఇవ్వరు. ఆ నెల అక్కడా ఇక్కడా అప్పుచేసి తీసుకువస్తారు. నెలలో పదిహేనురోజులు పచ్చడి మెతుకులే తింటాం. గడ్డపెరుగు, కూటు, వంకాయ కారం పెట్టిన కూరా ఇలాంటివి వూహించుకుంటూ తినేయడమే!

"ఒక్కోసారి కడుపులో మంట ఇంజన్లో మంటలా వేస్తుంది. నాన్నగారికి తెలియనీయం. ఆయనమటుక్కి ఓ బీరకాయ వున్నా చాలు.

"ఈ దరిద్రం అంటే నాకు భయం. ఈ లేమి అంటే నాకు అసహ్యం, అందుకే నేను బాగా చదివి డాక్టర్ని అవాలనుకునేదాన్ని. కానీ లేదు. చదువు చాలు అని చెప్పలేదు నాన్న. నేనే చదవను అని చెప్పేశాను. నాకు కావాల్సిన చదువు దొరకలేదు. కనీసం ఆ వచ్చే వ్యక్తి అయినా డాక్టరైతే... ఆ ఆశతో బతుకుతున్నాను. టీచర్ అంటే అసలు యిష్టం లేదు నాకు. నీకు గుర్తుందా పాణిగ్రాహీ" పచార్లు ఆపి అతని మొహంలోకి చూసింది.

"చెప్పు" అన్నాడు అతను. అతని కళ్ళు తడిసిన చేపల్లా వున్నాయి. శ్రీమహాలక్ష్మిని రెప్పవేయకుండా చూస్తున్నాడు. వుండబట్టలేనట్లు వేడి నిట్టూర్పు వచ్చేసింది.

శ్రీమహాలక్ష్మి మొహం ఎర్రబడింది. "అదిగో ఆ వేడి నిట్టూర్పులు అంటేనే నాకు





ఒళ్ళు మండుతుంది. అదో సానుభూతి అనుకుంటారో లేక భరించలేని భారం నెత్తిన పడినట్లు ఫీలౌతారో అర్థంకాదు. మా అమ్మా అంతే తీరిగ్గా వచ్చేసి ఓ నిట్టూర్పుని బయట పడేస్తుంది. ఆ వేడికి నా వొళ్ళేకాదు మనసు కూడా భగ్గుమంటుంది''

పాణిగ్రాహికి కోపం వచ్చింది "శ్రీమహాలక్ష్మీ నువ్వు నేలవిడిచి సాముచేస్తున్నావు. నీ చేతకానితనాన్ని ఎదుటి వ్యక్తిమీద రుద్దుతున్నావు. నీమేలు కోరేవాడిని. నువ్వు కలల్లో బతకడం మానేసేయి. వాస్తవంలోకి రా. నీవల్ల కాని దానికోసం ఆశపడకు. మనం ఏమిటి మన స్టేటస్ ఏమిటి అని ఓ క్షణం ఆలోచించు''

"పాణిగ్రాహీ!" నిస్సహాయంగా చూస్తూ నేలమీద చతికిలబడింది ఆమె. ఉక్రోషం, కోపం, కసి! పిడికిళ్ళు బిగుసుకుంటున్నాయి. ఆవిధంగా మరో పదినిమిషాలు వుంటే రక్తం బొట్లుబొట్లుగా రాలి కిందపడుతుందేమో

పాణిగ్రాహి చిన్నగా నవ్వాడు.

శ్రీమహాలక్ష్మి పిడికిళ్ళు నెమ్మదిగా విచ్చుకున్నాయి.

"మరి నేవెళ్ళివస్తాను'' అన్నాడు అతను.

"మంచిది'' అంది ఆమె లేవకుండానే.

సుభద్రమ్మ ఆరేసిన బట్టల్ని మడతలు పెడుతూ పాణిగ్రాహిని చూసింది. "అప్పుడే వెళ్ళిపోతున్నావేం పాణిగ్రాహీ!"

"పనుందమ్మా'' అన్నాడతను గుమ్మందాటుతూ.

అతను పక్కిల్లు దాటగానే సుభద్రమ్మ నెత్తి నోరూ బాదుకుంది. "శ్రీమహాలక్ష్మీ! నీకీజన్మకి పెళ్ళి అవుతుందో లేదో. ఎప్పుడో ఒకప్పుడు కాకపోతుందా అనే ధైర్యం వుండేది యిన్నాళ్ళూ. ఈ మగపిల్లలు ఇలా మనింటికి రావడం నలుగురూ చూస్తే యింక జన్మలో మన గుమ్మం ఎవరూ తొక్కరు''

శ్రీమహాలక్ష్మికి చిరాకు వేసింది.

తండ్రి వుంటే కొంచెం గట్టిగానే వాదించేది. అసలు యిప్పటికే అలసిపోయింది. పెదవి విప్పకపోవడమే మంచిది అనుకుంది.

కూతురు నోరు మూసుకోవడం సుభద్రమ్మకి ఆశ్చర్యం వేసింది.



ఆషాఢమాసం వస్తే కొంత రిలీఫ్. కొంచెం భయం. సబిత తమ్ముళ్ళు చదివే స్కూల్లో టీచర్‌గా చేరింది. వాళ్ళు కూడా 'వంశపారంపర్యం'లా ఆ బళ్ళోనే చదువుతున్నారు.

పాణిగ్రాహి కూడా అందులోనే చేరాడు.

శ్రీమహాలక్ష్మి పుస్తకాలన్నీ చదివేసింది. ఇంక లైబరీలో పుస్తకాలు అయిపోయాయి. గేటుకి అవతల ముత్యాల వాళ్ళ బంగ్లా వుంది. ఆ పక్కనే మెతుకు బాలయ్య మేడ వుంది. ముత్యాలవాళ్ళ బంగ్లాలో వుండే మీనాక్షి కర్నాటక సంగీతం నేర్పిస్తుంది. బాలయ్య మేడలో వుండే కమలాబాయి పై పరీక్షలు రాయడం ఎలా? చదవడం ఎలా? చదివించడం ఎలా? అనే అంశాలమీద పిల్లలకి తర్ఫీదు యిస్తుంది.

వీటికి డబ్బు కావాలి. తను చదువుకోవాలి. పాట నేర్చుకోవాలి ఎలా? శ్రీమహాలక్ష్మికి పగలు గడవడం దుర్భరంగా వుంది. ఆ మధ్యాహ్నం ముందుగదిలో కిటికీలో

కూర్చుని ఆలోచిస్తుండిపోయింది.

ఉన్నట్లుండి భూమి కమ్మని వాసన వెద జల్లుతోంది. చిటపట చినుకులు, 'టప,టపా' రాలుతున్నాయి. కొన్ని విసురుగా వచ్చి మొహంమీద పడ్డాయి. అప్రయత్నంగా నా లుక బయటికి చాపింది. ఐసుముక్కలాంటి చల్లని నీరు నోరు తడిపింది. అంతలోనే భూమీ ఆకాశం ఏకం అయిపోయింది. రెంటి మధ్యా వెండి జలతారు ఏర్పడినట్లు వర్షం కురుస్తూనేవుంది.

శ్రీమహాలక్ష్మి చప్పున లేచి వెళ్ళి కాగితా లు తీసుకుని పడవలుచేసి కిటికీలోంచి జార విడుస్తుండిపోయింది. గోడగడియారం నాలు గు గంటలు కొట్టింది. వంట యింట్లోంచి కాఫీ, పకోడీల వాసన వస్తోంది. అప్పుడు ఈ లోకంలోకి వచ్చింది ఆమె. తండ్రి రావడం కూడా తెలీదు.

దూరంగా 'డప్పు'ల శబ్దం వినిపిస్తోంది. బల్లెం డుల్లెం... అమ్మవారి గుడికి బోనాలు తీసుకు వస్తున్నారు భక్తులు.

'కోరికతోడ వచ్చినాను నీకు కోడీకూర తెచ్చినాను' పాటకి ఆర్యసమాజంవాళ్ళు అభ్యంతరం పెట్టారు. పోయిన వారం చాలా గొడవ జరిగింది. 'బలి' కోసం తీసుకువ చ్చిన మేకపోతుల్నీ, కోడిపుంజుల్నీ 'స్వే చ్ఛ'గా వదిలేయించారు.

కుస్తీపట్లు, సిగపట్లుతో చాలా పెద్ద ఎత్తునే బలపరాక్రమాలు తేల్చుకున్నారు. ఆర్యస మాజం వాళ్ళే నెగ్గారు. అప్పుడే ఈ పాటని తిరగరాశారు.

"కోరికతోడ వచ్చినామూ నీకు కొబ్బరికా యలు తెచ్చినామూ''గా మారింది.

అంతక్రితం అప్పుడప్పుడు చెదురు మదు రుగా కురిసే వర్షంలో జంతుబలులు జరిగేవి కనుక రక్తం ప్రవాహంలా కనిపించేది. ఇప్పు డు ఆ భయంలేదు.

'సాక' అని అమ్మవారి ప్రాంగణంలో చిన్న ఇత్తడి బిందెలో కొంచెం కల్లూనీళ్ళూ కలిపి వేపమండలు లేని ఆ బిందె నెత్తిన పెట్టుకుని వచ్చేవాళ్ళు. అందులో వున్న నీళ్ళు కలిపిన కల్లు చేతిని అడ్డుపెట్టుకుని గుమ్మం దగ్గర పోసేవారు. ఆ నీరే తీర్థంలా తీసుకు వెళ్ళేవారు.

నాగరకత నలువైపులా పరుచు కుంటోంది.

క్రమంగా భక్తులు ఇటువంటి మూఢన మ్మకాలకి దూరం జరగడం ప్రారంభించా రు.

శ్రీమహాలక్ష్మికి 'వెక్కిళ్ళ శబ్దం' విని పించింది. భయంతో కాళ్ళు పైకి పెట్టుకుని ముడుచుకు కూర్చుంది. ఎవరికో అమ్మవా రు శరీరం మీదకి వచ్చినట్లుంది. ఆ శబ్దం అంతకంతకు ఎక్కువ కాసాగింది.

ఇటువంటప్పుడే శ్రీమహాలక్ష్మికి ఈ కాంపౌండ్‌కి దూరంగా పారిపోవాలని పిస్తుంది. కరెంట్ లేకపోవడం ఈ బోనాల తంతూ ఆమెకి పల్లెటూర్లనీ, అడవుల్నీ గుర్తు చేస్తాయి.

తల్లీ తండ్రీ ఆమె కూర్చున్న గదిలోకి వచ్చి మంచంమీద కూర్చున్నారు.

"శ్రీమహాలక్ష్మీ నా దగ్గరకి రామ్మా'' అంది తల్లి. ఆవిడకి తెలుసు ఆ పిల్ల భయపడుతోందని. తల్లి పిలవగానే వెళ్ళి పక్కన కూర్చుంది. ఆమె పక్కన తండ్రి కూర్చున్నాడు.

తండ్రి చెప్పడం మొదలుపెట్టాడు. "ఇదో రకం సైకలాజికల్ ఎఫెక్ట్. నిజంగా అమ్మవా రు వొంటిమీదకి రాదు. అదో ఫీలింగ్. ట్రాన్స్‌లోకి వెళ్ళినట్లు

"ఇందులో భయపడాల్సింది ఏమీలేదు. సుపీరియారిటీ కాంప్లెక్స్. యింతమందిలో అమ్మవారు నా వొంటిమీదికే వస్తుందని నలుగురికీ చెప్పడం, వాళ్ళు భయభక్తుల్తో వొణికి పోతుంటే, అంతరాంత రాళాల్లో గొ ప్పగా భావించడం పరిపాటి

"అమ్మవారు ఇలా మనుషులమీదకి వచ్చేసి తనకేం కావాలో చెప్పించుకుని తీసుకోదు.





స్వయం పరమేశ్వరి ఆమెకేం కావాలి చెప్పమ్మా. నువ్వింత చిన్నవిషయాన్ని ఈ పాటికి అర్థంచేసుకోవాలి. చీకట్లో అయినా వదిలిన బాణంలా దూసుకుపోవాలి. ఆత్మ నిబ్బరం లేకపోతే అతిబలహీనుడయిపోతాడే మనిషి. అందుకే ప్రతి చర్యకీ ఓ రీజనింగ్ ఇచ్చుకుంటూపోతే ఈ భయభ్రాంతులు వుండవు''

తండ్రి భుజంమీద తలవాల్చింది శ్రీమహాలక్ష్మి. ఆయన ఆమె శిరసుని మృదువుగా నిమిరాడు.

"భయపడకమ్మా! బంగారు తల్లివిగా! భయం అనేది ఎక్కడో సూక్ష్మంగా బయలుదేరి పెనుభూతంలా వ్యాపించి మనల్నే ముంచేస్తుంది''

"ఆ వెక్కిళ్ళంటే భయం నాన్నా''

"భయంలేదు. నేనూ అమ్మా వున్నాం కదమ్మా''

"వూ'' అంది నీరసంగా.

వర్షం తగ్గుమొహం పట్టినట్లే భ్రమపడేట్లు చేసింది. వెంటనే ఆకాశం విరిగి కిందపడ్డట్లు పెద్ద శబ్దంతో నీళ్ళు పడుతున్నాయి. ఆకాశగంగ నేలమీదకి పరిగెడుతోంది.

"దీపంపెట్టి తీసుకువస్తాను వుండు శ్రీమహాలక్ష్మీ'' అంది తల్లి. కటిక చీకటి. నిశ్శబ్దంగా వుండిపోయిన శ్రీమహాలక్ష్మి గురించి చంద్రమౌళిగారికి ఒక్కక్షణం గుండె ఆగినట్లు అయింది.

"వున్నట్లుండి తను చచ్చిపోతే' ఆ ఆలోచన ఆయనకే మింగుడు పడలేదు. తన భార్య ఏం చేయగలదు? తను కూడా ఈ ప్రకృతి వైపరీత్యానికి భయపడుతున్నాడు? మనిషి పదిమందిలో ఏనుగు కంటే బలవంతుడు. ఒంటరిగా వున్నప్పుడు ఎందుకింత దుర్బలుడైపోతాడో.

"నాన్నా! ఒకసారి అక్కలని రమ్మని రాస్తే'' అంది శ్రీమహాలక్ష్మి. ఇంటినిండా మనుషులుంటే ఈ భయాలు ఏవీ వుండవు. పండగలా రోజులు చకచకా గడిచిపోతాయి. అప్పుడప్పుడు అక్కలు పురుడు పోసుకోవడానికి వచ్చినప్పుడు సందడే సందడిగా వుండేది.

చంద్రమౌళిగారన్నారు "మనిషి చాలా బిజీఅయిపోయాడు. కాలంతో పరిగెడుతున్నాడు. ప్రేమలూ, అటాచ్‌మెంట్స్ ఇప్పుడు కనిపించడం లేదు. ముందు ముందు మచ్చుకి కూడా కనిపించవేమో. మనం సదుద్దేశ్యంతో పిలిచినా ఈ మూలనుంచి ఆ మూలవరకూ వెళ్ళి చేసేదేముంది. డబ్బుఖర్చు తప్ప అనుకుంటున్నారు. పోనీమ్మా నీకు మేము లేమూ'' అన్నారాయన బుజ్జగిస్తున్నట్లు.

సుభద్రగారు లాంతరు తీసుకువచ్చి పెట్టింది.

వర్షం క్రమంగా తగ్గుముఖం పట్టింది. బోనాల సందడి కూడా తగ్గిపోయింది.

బలవంతంగా భోజనం అయిందనిపించుకున్నారు. కళ్ళు మూతలు పడుతూంటే విశ్రాంతిగా నడుం వాల్చారు.

★ ★ ★

పట్టపగలు నట్టనడివీధిలో హత్య జరిగినంత కంగారూ భయం... కాంపౌండ్‌లో వున్న ఇళ్ళల్లో వాళ్ళంతా బిలబిలమంటూ బయటికి వచ్చేశారు.

అప్పటికి పదకొండు గంటలైపోయింది. అంతమంది జనం అక్కడ ఎందుకు గుమిగూడారో అర్థంకాలేదు శ్రీమహాలక్ష్మికి. ఆమె వెనుకనుంచి వచ్చిన తల్లి గబగబా ముందుకి వెళ్ళిపోయింది. శ్రీమహాలక్ష్మి రెప్పవేయడం మరచిపోయింది. ఆవిడ గుంపుని చీల్చుకుని వెళ్ళిపోతోంది. అసలావిడయింత కుతూహలంగా వెళ్ళడం కూడా శ్రీమహాలక్ష్మికి అసలు నచ్చలేదు.

"అసలేం జరిగింది?" శ్రీమహాలక్ష్మి పదో నెంబరు యింటి యజమాని 'కరమ్‌సింగ్'ని అడిగింది. సిక్కుమతానికి చెందిన ఆ కుటుంబ పెద్ద కాంపౌండ్‌లో అందరికీపెద్ద

దిక్కులాంటివాడే. అందరూ ఆయన్ని వయసుని బట్టి వరుసల్తో పిలుస్తారు. అందరిలాగే శ్రీమహాలక్ష్మి ఆయన్ని పెదనాన్నా అంటుంది.

అతను వచ్చీరాని తెలుగు, హిందీ కలిపి చెప్పాడు.

"కొత్తగా ఆ యింట్లోకి మనోహరమ్మ వచ్చింది. ఆమెతో వచ్చినతను ఎవరోగానీ ఆ పిల్ల మెళ్లో మంగళసూత్రాలు కానీ, నల్లపూసలు కానీ లేవట"

శ్రీమహాలక్ష్మి ఆశ్చర్యంగా చూసింది. "అయితే ఏం? డబ్బు లేదేమో! ఇష్టపడి చేసుకున్నారో! ఏం తెలుసు మనకి? మనం వాళ్ళని తప్పు పట్టద్దు పెదనాన్నా. ఆదుకోండి ప్లీజ్"

"కాంపౌండ్‌లో వుండతగినవాళ్లు కారమ్మా వాళ్లు!"

శ్రీమహాలక్ష్మికి ఒంటినిండా కారం రాసుకున్నట్లు అనిపించింది. క్రమంగా తనలోనూ ఏదో మార్పు వస్తోంది. సబితలాగే తన ఆలోచనా సరళిలో కూడా తేడా కనపడుతోంది. ఇది మంచిదేనా. ఉహుఁ... కాదు మంచిదే. రెండు రకాల ఆలోచనల్తో క్షణం నిశ్శబ్దం అయిపోయింది.

కరమ్‌సింగ్ అందర్నీ దూరం జరిపేశాడు.

కాంపౌండ్‌లో అతనిమాట వేదవాక్కు.

అప్పుడెప్పుడో అల్లర్ల సమయంలో గూండాలు గేటుదాటి కాంపౌండ్‌లో ప్రవేసించబోతే, అప్పుడు తన కత్తితో తన ఆరుగురు మగపిల్లలని వెంట పెట్టుకుని ధీరోదాత్తంగా వాళ్ళ లాఠీలు విరగ్గొట్టి తరిమికొట్టిన వీరాధివీరుడు. కాంపౌండ్‌లోని నలభైఅయిదు ఇళ్ల కుటుంబీకుల ప్రాణాల్నీ, ఆస్తుల్నీ కాపాడాడు. అతను ఆపద్బాంధవుడు. ఆ ఇళ్లవాళ్ళకి దేవుడి తర్వాత దేవుడు, అందుకే కిక్కురు మనకుండా అందరూ ఇళ్ల




ల్లోకి వెళ్ళిపోయారు. సుభద్రమ్మ కూడా వెళ్ళిపోయింది. కరంసింగ్‌తోబాటు శ్రీమహాలక్ష్మి ఆ ఇంట్లోకి దారితీసింది.

మనోహరీ, ఆమెతోపాటు వచ్చిన యువకుడు యతి, ఓ పెట్టెమీద కూర్చున్నారు. కరంసింగ్, శ్రీమహాలక్ష్మి మరో పెట్టెమీద కూర్చున్నారు.

"ఏం చేస్తారమ్మా మీరు?" అని అడిగాడు కరంసింగ్.

"మేము ఇద్దరమూ టీచర్లమే'' మనోహరి చెప్పింది.

"మా పెళ్ళికి ఎవరూ ఒప్పుకోలేదు. మేము కులమూ, గోత్రమూ, మతమూ లెక్క జేయం. మా ఇద్దరికీ ఇష్టం అయింది. మేము కలిసి బతికేందుకు నిర్ణయించుకున్నాం."

శ్రీమహాలక్ష్మి నిశ్చలంగా చూస్తుండిపోయింది. కరంసింగ్ గొంతు సవరించుకుని "చూడమ్మా మన సంఘంలో కొన్ని కట్టుబాట్లు వుంటాయి. వాటిని మనం తోసేయలేం. మీరు గుళ్లో దండలు మార్చుకోండి. అప్పుడీ మనుషులు మిమ్మల్నేమీ అనరు''

మనోహరి నవ్వేసింది. "ఈ మనుషులు మారరు. మరొకరు మారే ప్రయత్నం చేసినా మార్చుకోరు. అయినా మాకు మామీద నమ్మకం, విశ్వాసం వున్నాయండి. బతికేందుకు అవి చాలు సర్!"

కరంసింగ్ ఏమీ మాట్లాడలేకపోయాడు.

శ్రీమహాలక్ష్మి లేచి "వెళ్ళొస్తాను'' అంది.

మనోహరీ, యతీ గుమ్మంవరకూ సాగనంపేందుకు వచ్చారు. యతి నెమ్మదిగా అన్నాడు. "మనకి వాళ్లూ, వాళ్ళకి మనమూ అలవాటుపడేందుకూ, సర్దుకుపోయేందుకూ కొంత సమయం పడుతుంది''

"నిజమే. ఎటువంటి పరిస్థితుల్లోనూ ధైర్యాన్ని పోగొట్టుకోకూడదు''

మనోహరికి కూడా ఏటికి ఎదురీదుతున్నామని తెలుసన్నమాట. అనుకున్నాడు యతి.

శ్రీమహాలక్ష్మి ఇంటికి చేరుకునేసరికి సబితా, పాణిగ్రాహి ముందుగదిలో కూర్చున్నారు.

"ఎప్పుడు వచ్చారు?" శ్రీమహాలక్ష్మి అడిగింది.

"మొత్తానికి కాలక్షేపం బాగానే అవుతోందన్నమాట" సబిత అంది.

జాబ్ చేయకుండా ఈమధ్య కాంపౌండ్ గొడవలో తలదూర్చడం బహుశా ఇద్దరికీ నచ్చడం లేదు కాబోలు.

"సూటిగా చెప్పచ్చుకదా! అందరూ చేరి ఆ మనోహరినీ, యతినీ వెళ్ళగొడుతుంటే చూస్తూ వూరుకోలేం. మనిషి పుట్టుక పుట్టాక ఆమాత్రం చొరవ తీసుకోవచ్చు''

చప్పట్లు కొట్టింది సబిత. "భేష్! ఇదీ మంచి విషయమే. కానీ మగపిల్లవాడైతే జులాయి గాడిదలా తిరుగుతున్నాడు పనీపాటా లేక అంటారు. మరీ ఆడపిల్లకి అంత మాట అనకూడదేమో పాణిగ్రాహీ'' అంది ఎగతాళిగా.

శ్రీమహాలక్ష్మికి కోపం వచ్చింది. వెంటనే తయాయించుకుంది. తల్లి లోపల పని చేసుకుంటోంది.

తండ్రి బహుశా ట్యూషన్ చెప్పేందుకు వెళ్ళి అటునుంచి షైర్‌కి వెళ్లినట్టున్నాడు. ఇప్పుడే రాడాయన.

కుర్చీ లాక్కుని వాళ్ళకి కొద్దిదూరంలో కూర్చుంది.

"మీ ఉద్యోగాలు మీకు సంతృప్తిని ఇచ్చినట్లు మీ మొహాలు చూస్తుంటేనే తెలుస్తోంది. యామ్ ఐ కరెక్ట్'

పాణిగ్రాహి నచ్చజెపుతున్నట్లు అన్నాడు. "అసలు విషయానికి వద్దాం శ్రీమహాలక్ష్మి. కొద్దో గొప్పో చదువుకున్న తరువాత మన భారం మరొకళ్లమీద వేయకూడదు''

"అంటే'' చివ్వున తలెత్తింది "కన్నవాళ్ళకి భారం అవడం అంటే వింతగా వుంది''

"వింతేమీ లేదు. నువ్వు జాబ్ చేయాల్సిందే''

ఫక్కున నవ్వింది శ్రీమహాలక్ష్మి! "చూడు మిష్టర్ పాణిగ్రాహీ. లోకంలో ఏ ఒక్కరూ నాలా వుండరు, వుండలేరు. డబ్బు లేకపోయినా, జాబ్ లేకపోయినా నేను మహారాణినే. నా విలువ నాకు తెలుసు. ఈ ప్రపంచంలో ఎంతమంది తమ గురించి తాము చెప్పగలరు? సో, నేను అర్ధణా, కానీ ఉద్యోగాలు చేయను''

"కలెక్టర్‌వి అవుతావు అవునా?" సబితకి ఒళ్ళు మండింది.

"చెప్పానుగా. మహారాణిని అని. కలెక్టర్ గిరీ నాకెందుకు? ఇంతకీ చలపతి విషయం ఏం చేశావూ?"

సబిత మొహం విప్పారింది. "అతను రేపు వస్తున్నాడు''

శ్రీమహాలక్ష్మి నివ్వెరపోయింది. నోట్లోంచి మాట రాలేదు.

పాణిగ్రాహి చెప్పాడు. "రేపు మన పోచమ్మ గుళ్ళో పెళ్ళి''

శ్రీమహాలక్ష్మికి సన్నని నొప్పి శరీరం అంతా పాకుతున్నట్లనిపించింది. అప్పటికప్పుడు జరిగేపనులు కావు ఇవి. ఈమధ్య స్నేహితులు ముగ్గురి మధ్యా రాకపోకలు తగ్గాయి. తననెవరో దూరంగా జరిపేసినట్లు, ఒంటరిగా అయినట్లూ అప్పటికప్పుడు ఎన్నో ఫీలింగ్స్ ఆమె మెదడులో చేరి జోరీగల చప్పుడు చేస్తున్నాయి.

"చలపతి స్కూలుకి వచ్చి అన్ని విషయాలూ తెలుసుకున్నాడు. నిన్ను అడిగినట్లు కూడా చెప్పమన్నాడు'' అంది సబిత.

"ఓ" తేరుకుంది శ్రీమహాలక్ష్మి. క్షణంలో సగంసేపు పట్టలేదు ఆమె మామూలుగా అయిపోయేందుకు.

"మీ నాన్నగారికి తెలుసా?"

"తెలీదు''

"నీకు భయం వేయడం లేదూ''

"భయం దేనికి? నచ్చిన పని చేస్తున్నప్పుడు''

"మరీ విషయం ముందే ఎందుకు చెప్పలేదు''

"అదంత అవసరం అనుకోలేదు శ్రీమహాలక్ష్మి. రేపు ప్రమాదమో, ప్రమోదమో వూహించుకుంటూ ఇక్కడే చిక్కిశల్యం అయిపోవడమో, బెలూన్‌లా ఉబ్బిపోవడమో దేనికి?"

"పాణిగ్రాహీ ఇక నువ్వు మిగిలావు'' అంది శ్రీమహాలక్ష్మి.

"అంటే నువ్వా గట్టెక్కావా ఏవిటి?"

శ్రీమహాలక్ష్మి తాపీగా అంది. "అదే నిజం అయితే ఈపాటికి వూరు, వాడా టాంటాం చేసేదాన్ని కాదూ. చూడబ్బాయ్! నాకు మనసులో మాటలు మురిగిపోయేవరకూ దాచే అలవాటు లేదు''

సబితా, పాణిగ్రాహీ గ్రహించారు ఆమె కావాలనే అంటోందని. సుభద్రమ్మ టీతోబాటు దోసెలు వేసి తెచ్చింది. ముగ్గురూ తీసుకున్నారు.

"రేపు తొమ్మిదిగంటల ఇరవైఆరు నిమిషాలకి పెళ్ళి. నువ్వు ముందే వచ్చేయి'' అంది సబిత లేస్తూ.

పాణిగ్రాహి తలతిప్పి ఆమెవైపు జాలిగా చూశాడు. శ్రీమహాలక్ష్మి నవ్వేసింది.

★ ★ ★

కాంపౌండ్‌లో పోచమ్మ గుడిచుట్టూ వున్న స్థలంలో రెండు మూడు వందలమంది హాయిగా కూర్చోవచ్చు. గుడిముందు పందిరి వేసినట్లు ఆ ప్రాంగణాన్ని కట్టించారు. గర్భగుడిలో అమ్మవారు ఏడు ఫర్లాంగుల వరకూ స్పష్టంగా కనిపిస్తుంది.

గుడి చుట్టూ వేప, రావిచెట్లు వున్నాయి. అమ్మవారి పక్కనే పెద్ద పుట్ట వుంది. ఆ పక్కనే రావిచెట్టు మర్రిచెట్టు కలిసివున్న అరుగు వుంది. అమ్మవారికి ఎడమవైపు చిన్నగుడి వుంది. అందులో మరో అమ్మవారుంది.

గుడిముందు చలపతీ, పాణిగ్రాహీ ఓవైపూ సబితా, శ్రీమహాలక్ష్మి మరోవైపూ నిలుచున్నారు.

సరిగా తొమ్మిదిగంటల ఇరవై ఆరు నిమిషాలకి పాణిగ్రాహి, శ్రీమహాలక్ష్మి అందించిన దండలు పరస్పరం వేసుకుని చలపతీ, సబితా దంపతులయ్యారు. అక్కడ కూర్చున్న యాభై అరవైమంది కళ్ళూ తిరిగినట్లయ్యాయి.

ఆదినారాయణ రంకెలు వేశాడు. "ఎవడివిరా నువ్వు? నాతో ఒక్కమాట చెప్పకుండా ఇంత పకడ్బందీగా నా కూతుర్ని పెళ్ళాడుతావురా? కులం గోత్రం..." అతనికి రోషం వచ్చింది. ఎండాకాలపు వేడి ఎడాపెడా వాయించేస్తోంది. ఆపైన తనకేదో తీరని అవమానం జరిగినట్లూ, ఎవరో అగాధంలోకి త్రోసేస్తున్నట్లు అనిపించసాగింది. రెండు అడుగుల్లో అల్లుడిని చేరుకుని అతని గొంతు పట్టుకున్నాడు.

పాణిగ్రాహి విసురుగా ఆ చేతిని తోసేశాడు "మీకు మతిపోయింది''

"నాన్నా'' సబిత గొంతు పెంచింది. "నేను ఇప్పుడు ఈ చలపతిగారితో వెళ్ళిపోతున్నాను'' అని చెప్పి అక్కడ చేరిన కరంసింగ్ మొదలైన పెద్దలందరికీ నమస్కారం చేసి "మీరు దయతో ఇక్కడికి వచ్చి మమ్మల్ని ఆశీర్వదించినందుకు కృతజ్ఞతలు. మీరు తప్పకుండా దయానంద్ హోటల్‌కి రండి. అక్కడ భోజన ఏర్పాట్లన్నీ జరుగుతున్నాయి'' అంది.

సుభద్రమ్మ చటుక్కున కూతురు చేయి పట్టుకుని ఇంట్లోకి బరబరా లాక్కెళ్ళిపోయింది.

చంద్రమౌళిగారు ఆ చేతిని విడిపించి "నువ్వు వెళ్లమ్మా'' అని కూతురుతో చెప్పారు.

సుభద్రమ్మ నిస్సహాయంగా ఏడుస్తూ భర్తవైపు తిరస్కారంగా చూస్తూ నోరు తెరిచింది. "మీరు దీన్ని మరీ ఇంత స్వతంత్రంగా పెంచకూడదు. రేపు దాని భవిష్యత్ ఏమవుతుందో ఆలోచించారా?

"ఎంత చిన్నప్పటి స్నేహితుడైనా పాణి





గ్రాహి రాత్రీ పగలూ సబితను కూడా వెంటే సుకు రావడం, శ్రీమహాలక్ష్మి వాళ్లతో చేరి కబుర్లు చెప్పడం ఇవన్నీ సంప్రదాయాలు కావండి. ఆడపిల్ల అంటే ఒద్దికగా వుండాలి. ప్రతిదానికీ నోరు పెంచేసుకుని మాట్లాడుతూ ఏటికి ఎదురీదకూడదండీ''

"సుభద్రా'' చంద్రమౌళికి కోపం వచ్చింది. "మీ ఆడవాళ్ళు మీకు మీరే శత్రువులు. ఆడపిల్ల... అసలు అది పుట్టడమే ఏడు మల్లెపూల ఎత్తులా పుడుతుంది. ఆ పిల్లచేత మోటుపనులు చేయనీయకుండా మానసికంగా బలహీనురాల్ని చేస్తారు. ఆపైన పెరుగుతున్నకొద్దీ భయపడుతూ భద్రతలు నేర్పిస్తారు. మగవాళ్ళమధ్యకి వెళ్ళడం భయం. నలుగుర్లో మాట్లాడడం భయం. ఎందుకిలా చేస్తారు? ఇప్పుడు శ్రీమహాలక్ష్మిని పందిట్లోంచి ఎందుకు లాక్కువచ్చావు సుభద్రా?''

"అది సబితకి స్నేహితురాలు. రేపు పెళ్ళి కావలసిన పిల్ల. సబితని బరితెగించిందని అంటున్నారు. దీన్నీ అలాగే అంటే పెళ్ళి చేసుకుందుకు ఎవరూ ముందుకు రారు''

శ్రీమహాలక్ష్మి మెల్లగా జారుకుంది.

పాణిగ్రాహి అక్కడ వున్నవాళ్ళందరికీ కృతజ్ఞతలు చెబుతున్నాడు. అందరూ చేరి ఆదినారాయణని శాంతపరచారు.

"బంగారంలాంటి అల్లుడు కానీ ఖర్చు లేకుండా వచ్చాడు. దీనికి సంతోషించాల్సింది పోయి ఆ పిల్లవాడిమీద ఎగుర్తావేమిటయ్యా. నువ్వసలు అదృష్టజాతకుడివి. ఏదీ అడగకుండానే అమరుస్తాడా దేవుడు''

"ఆదినారాయణా! నీ అల్లుడిలాంటి వాడిని కంచుకాగడాలు వేసి వెతికినా తీసుకురాగలవా? అంతా ఆ పిల్ల జాతకం!"

అందరూ ఇదే మాట అంటూంటే ఆదినారాయణ మరి నోరు ఎత్తలేదు. సబిత భర్త వెనుకే వెళ్ళిపోతూ శ్రీమహాలక్ష్మిని కౌగలించుకుంది. శ్రీమహాలక్ష్మి తన చేతికి ఎంతోకాలంగా వున్న ఒకేఒక్క ఉంగరం తీసి సబిత వేలికి తొడిగి ఆ చేతిని ముద్దాడి "బి హాపీ... గాడ్ బ్లెస్‌యూ బోత్' అంది.

సబిత కళ్లు తడికాగా నవ్వి "ఇదేనండి మా శ్రీమహాలక్ష్మి'' అంది చలపతికి చూపిస్తూ.

చలపతి రెండు చేతులూ జోడించి "థాంక్‌యూ! సబిత లాంటి భార్య దొరకడం నా సుకృతం" అన్నాడు.

శ్రీమహాలక్ష్మి గొంతు మూగవోయింది.

★ ★ ★

శ్రావణమాసం వచ్చింది. ఉరుములు, మెరుపుల్తో ప్రారంభం అయిన వర్షం ఎడతెరిపి లేకుండా కురుస్తూనే వుంది. పాతబడిన ఇల్లు. పైనుంచి వర్షం చుక్కలు చుక్కలుగా మరోచోట ధారగా పడుతోంది. ఆ నీటికింద చిన్న చిన్న గిన్నెలు పెడుతోంది సుభద్రమ్మ.

చంద్రమౌళి మంచి నిద్రలో వున్నట్లున్నాడు. "రాత్రంతా నిద్రపోవడానికి వీలు లేకుండా ఈ వర్షం ఒకటి'' విసుక్కుంది ఆవిడ. గిన్నెలు నిండగానే 'మోరీ'లో పోసిరావడం తిరిగి గిన్నెలు పెట్టడం, గోనెసంచులు వేయడం నానాహైరానా పడిపోతోంది.

శ్రీమహాలక్ష్మికి అర్ధరాత్రి మెలుకువచ్చింది. తల్లి చేస్తున్నపనికి జాలేసింది. రేపొద్దున్న తను పెళ్ళి చేసుకుని తల్లినీ, తండ్రినీ పాష్‌లొకాలిటీలో అందమైన ఇంటికి తీసుకు వెడుతుంది. అప్పుడీ నిద్రలేకపోవడాలూ, ఈ వెట్టిచాకిరీలూ వుండవు.

ఓసారి మసక వెలుతుర్లో తండ్రివైపు చూసింది. ఆయన వెల్లకిలా పడుకునున్నాడు. గుండెలమీద చేతులు వున్నాయి.

శ్రీమహాలక్ష్మి కళ్లు నులుముకుని చూసింది. ఆయన నిద్రపోతున్నాడు. గాఢంగా, నిశ్శబ్దంగా, చల్లగా, హాయిగా, శాశ్వతంగా. "అమ్మా'' కెవ్వుమని కేకపెట్టింది.

సుభద్రమ్మ రెండడుగుల్లో పిల్ల మంచం దగ్గరకి వచ్చింది. శ్రీమహాలక్ష్మి చూపుడువేలు తండ్రి పొట్టమీదకి గురిచేసింది. అక్కడ

శ్వాస ఆడుతున్న దాఖలాలు లేవు.

నిశ్శబ్దంలో నిద్రలో సుఖంగా పరలోకాని కి వెళ్ళిపోయేందుకు ప్రత్యేక కారణాలు అవసరం లేదు.

సుభద్రమ్మ నెత్తి మొత్తుకుంది, గుండెలు బాదుకుంది. భోరుమని విలపిస్తూంటే ఒక్కో ఇంటి తలుపులూ తెరుచుకున్నాయి. వర్షాన్ని లెక్కచేయకుండా, చలిని పట్టించుకో కుండా కాంపౌండ్‌లో వాళ్లు ఆ ఇంట్లోకి వచ్చారు.

సుభద్రమ్మని పొదివి పట్టుకుని ఓదార్చా రు. కరంసింగ్ శ్రీమహాలక్ష్మిని దగ్గరకి తీసు కుని "ఏడవకు బేటీ, మేమంతా లేమా..." అన్నాడు.

పాణిగ్రాహి తల్లి వచ్చింది. ఈమధ్య అతను కనిపించడంలేదు. "వాడు వూళ్ళో లేడమ్మా'' అంది సంజాయిషీ ఇస్తున్నట్లు.

శ్రీమహాలక్ష్మికి ఏం చేయాలో పాలు పోవడంలేదు. కరంసింగ్ ఆ ఇంటి పెద్దగా అడిగాడు. "ముందు కార్యక్రమంకానీ తల్లీ. మేమంతా వున్నాం. నువ్వేమీ బెంగపెట్టు కోకు''

శ్రీమహాలక్ష్మి కళ్లు బొమ్మరాళ్ళ య్యాయి. చుక్క నీరు లేదు. బాధ అనిపించ డంలేదు.

పెద్దాయన. కాలం చెల్లింది. వెళ్ళిపోయా డు.

ముందు ముందు ఎలా?

కాలమే పరిష్కారం చూపిస్తుంది.

దుఃఖం రావడంలేదేం భగవంతుడా?

గాయం చిన్నదైతే వెంటనే తెలుస్తుంది. పెద్దదైతే నెమ్మదిగా బయలుదేరి ఉధృతంతో ముగుస్తుంది.

శ్రీమహాలక్ష్మి లేచి గదిలో నీళ్లు పారబో స్తూంటే రాజేశ్వరమ్మ సాయపడుతోంది. అప్పుడప్పుడు కరంసింగ్ ఇల్లాలు లక్ష్మిబా యమ్మ ఆ నీళ్లని తుడిచేస్తోంది.

"పెద్దమ్మా నీకు శ్రమెందుకు?" శ్రీమహా లక్ష్మి వారించింది.

తెల్లవారింది. ఎనిమిది గంటలకి పక్కింట్లో వున్న ఆదినారాయణా అతని తల్లి శశిరేఖమ్మా వచ్చి తొంగిచూసి పలకరించి వెళ్ళిపోయారు.

నలభై అయిదు ఇళ్లల్లో వాళ్ళంతా ఒకటి అయినప్పుడు అందులో ఈ రెండో నంబరు ఇంట్లో మనుషులే ఫైలు ఎక్కడ అంటు కుంటుందో అన్నట్లుంటారు. ఆ సంగతి అందరికీ తెలుసు. అందుకే వాళ్ళని పట్టించుకోరు.

కరంసింగ్ మాట వేదవాక్కు.

అతనే కర్మకాండలు పూర్తి చేయించాడు.

కులం, మతం ఏవీలేవు. ఇక్కడ మానవ త్వం తప్ప. బతికివున్న ఈ శరీరానికో పేరు, రంగు, వివరణ, కులం వగైరాలు ఎన్నో... మరెన్నో.

కానీ ఆ పంజరంలో చిలక ఎగిరిపోయాక అంతా మిథ్య, శూన్యం.

శ్మశానవాటికలో చంద్రమౌళి భౌతిక కాయం అగ్నిహోత్రుడికి అర్పితం అయిపో యింది. తీర్థప్రజలే.

ఆ సాయంత్రం ఎక్కడివాళ్లు అక్కడ సర్దుకున్నారు. చీకటి ఎన్నోసార్లు శ్రీమహాల క్ష్మిని భయపెట్టింది. కానీ ఇప్పుడు భయపె ట్టినట్లు మరెప్పుడూ భయపెట్టలేదు. తండ్రి ఎప్పుడూ తెల్లని గ్లాస్కో పంచె, చొక్కా, బుజంమీద తువ్వాలు వేసుకునేవాడు.

ఆ నీడలు కనిపిస్తున్నాయి.

ఆయన దయ్యం అయ్యాడా?

భ్రమ... ఆయన దయ్యం అవడం ఏమిటి?

పోనీ ఆయన ఆత్మా... భయంతో ముడు చుకుపోయింది. సుభద్రమ్మ నేలమీద కొంగు పరుచుకుని పడుకుంది. రాత్రంతా నిద్రలేక పోవడం, యాభైఏళ్ల సహచరుడు చెప్పా పెట్టకుండా వెళ్ళిపోవడం ఆవిడకి గొడ్డలి పెట్టే. మధ్య మధ్య వెక్కిళ్లు వినిపిస్తు న్నాయి.





శ్రీమహాలక్ష్మికి ఆవైపు చూసేందుకు సాహసం లేదు. నుదుట నయాపైస అంత కుంకుమబొట్టు చెరిగిపోయింది. వెలితిగా వుంది. ఆ వెలితి కూడా భయపెడుతోంది. ఈ బొట్టూ, గాజులు ఇవన్నీ ఎవరు తీసెయ్యమన్నారు. శ్రీమహాలక్ష్మి కళ్లు గట్టిగా మూసుకుంది. తండ్రి నలుపుగా కనిపిస్తున్నాడు.

ఆత్మలు నిజంగా వున్నాయా? అవి క్షోభిస్తాయా? క్షోభిస్తున్న అంతరాత్మ చుట్టూ తిరుగుతోందా? శ్రీమహాలక్ష్మి కొంగు మొహంమీదకి వేసుకుంది. అయినా తండ్రి ఛాయలు దూరం అవడం లేదు. ఏడుపు వస్తోంది. భయపడితే తండ్రి రెండు చేతులూ వుక్కు ద్వారాలై భయాన్ని దూరంగా నెట్టేసేవి. శ్రీమహాలక్ష్మి మనసు మూలిగితే వృద్ధుడైన ఆ తండ్రి ప్రాణం విలవిల్లాడిపోయేది.

ప్రపంచంలో తండ్రికీ, కూతురుకీ వున్న అనుబంధాలు కొన్నిచోట్ల ఓ గీత దగ్గర ఆగిపోతాయేమోగాని చంద్రమౌళిగారు శ్రీమహాలక్ష్మికి తల్లి, తండ్రి, గురువు, దైవం, నేస్తం... సమస్తం ఆయనే. మార్గ దర్శకుడాయన.

ఆ పిల్లని అల్లారు ముద్దుగా కంటిపాపలా చూసుకున్నాడు. ఏటికి ఎదురీదే ధైర్యాన్ని నూరిపోశాడు.

ఆడది అబలకాదని జీర్ణించుకునేట్లు చేశాడు.

అటువంటి వ్యక్తికి ఇంకా ఈ భూమ్మీద తను చేయలేని, అర్థాంతరంగా వదిలి వచ్చేసిన గిల్టీ ఫీలింగ్ వుందా? ఓ ప్రాజ్ఞుడి చేతిలో పెట్టాలనుకోలేదు. అతడే తన బిడ్డ దగ్గరకి వస్తాడని కలలుకన్నాడు.

అసలు కారణం లేమి.

ప్రయత్నం చేసే సాహసంచేయలేదాయన.

తన దగ్గరున్న డబ్బుకి ఆ వచ్చే మనిషి ఎలా వుంటాడో వూహించగలడు. ఆ వూహకే దడుసుకునే ఆ ప్రయత్నం మానుకున్నాడు.

పాణిగ్రాహి అప్పుడే వూరినుంచి వచ్చాడు. విషయం అతనికి ముందే తెలిసింది. చలపతి ట్రంకాల్ చేసి చెప్పాడు. రెండు చెంబులు నీళ్లు నెత్తిన పోసుకున్నాననిపించుకున్నాడు. తల్లి ఇచ్చిన కాఫీ తాగేసి బయటపడ్డాడు.

పాణిగ్రాహి ఇంట్లోకి రాగానే సుభద్రమ్మ పెద్దగా ఏడ్చింది. శ్రీమహాలక్ష్మి అతనికి కుర్చీ చూపించి తల్లి పక్కనే మోకాళ్లచుట్టూ చేతులు వేసుకుని కూర్చుంది.

పాణిగ్రాహికి కొంచెం ఇబ్బందిగా తోచింది. ఇటువంటి సమయాల్లో ఎలా మాట్లాడాలో తెలీదు. ఏడ్చేవాళ్లని ఏడవద్దు అంటే ఆ దుఃఖం ఇంకా ఎక్కువ అవుతుంది. పోనీ కరువుతీరా ఏడవనిద్దామా అంటే ఎదుటివాడు జాలీ, పేగూ లేనివాడు అనుకుంటారేమో అనే మొహమాటం. సబిత వుంటే బాగుండేది అనుకున్నాడు. పెళ్లయ్యాక తండ్రి చండశాసనుడు కావడంవల్ల ఈవైపు రాలేదు ఆ పిల్ల. స్కూల్లో చదువుకునే పిల్లాడితో ఓ ఉత్తరం రాసి శ్రీమహాలక్ష్మికి పంపించింది. ఆ ఉత్తరంతో బాటు రెండు వందలు కూడా.

శ్రీమహాలక్ష్మి అక్కలు ఉత్తరాలు రాశారు. సబిత అంతకంటే ఎక్కువే చేసింది.

సుభద్రమ్మ దుఃఖం తగ్గుమొహం పట్టింది. శ్రీమహాలక్ష్మి అతనివైపు చూసి నెమ్మదిగా అడిగింది. నాన్న పోయాక ఇల్లు గడవడం లేదు పాణిగ్రాహీ. పంతులుగారితో చెప్పి నాకూ జాబ్ ఇప్పించు.

పాణిగ్రాహి మొహం మీద నల్లని మేఘాలు పరుచుకున్నాయి. నువ్వు టీచర్ జాబ్ చేస్తావా? అనలేదు అతను. మామూలు సమయాల్లోనే అవతలి వ్యక్తి మనసు ఎక్కడ దెబ్బతింటుందో అని ఆచితూచి మాట్లాడే పాణిగ్రాహి గొంతులోంచి మాటరాలేదు కానీ బుర్ర మాత్రం వూపాడు.

"నువ్వు వూరెందుకు వెళ్లావు?"



అతను చిన్నగా నవ్వాడు "అమ్మ ఎప్పటినుంచో అమ్మమ్మ వాళ్లవూరు వెళ్లమని చెబుతోంది. ఈ ఇంట్లోంచి వెళ్లిపోతానని బెదిరించింది కూడా. అందుకే అక్కడికి వెళ్లి మావయ్య కూతురు భువనేశ్వరిని చూసివచ్చాను.

సుభద్రమ్మ పక్కగదిలోకి తప్పుకుంది.

శ్రీమహాలక్ష్మికి సంతోషం వేసింది. "బావుందా'' అని అడిగింది వుత్సాహం పట్టలేనట్లు.

"బావుంది''

"అయితే త్వరలోనే ఓ ఇంటివాడివి అయిపోతున్నావన్నమాట"

"ఇల్లు వుంది. మళ్లీ ఇంటి వాడవడం పాత జోక్''

"పోనీ ఇంతకీ చదువుకుందా''

"స్కూల్‌ఫైనల్ పాసైంది''

"ఎవరిలా వుంటుంది పాణిగ్రాహి''

అతనికి జాలేసింది. బొత్తిగా చిన్న పిల్లల మనస్తత్వంగా ఎలా నెగ్గుకు వస్తుందో. తండ్రి కూడా లేడు ఇప్పుడు. టీచరు ఉద్యోగమే చేయనని అసహ్యించుకునే ఈ పిల్లకి తిండి పెట్టేదారి అదే అవుతోంది.

"ఏమిటీ ఆలోచిస్తున్నావు?"

"నువ్వు రేపు నాతో స్కూలుకి వస్తే అక్కడే చెబుతాను. పంతులుగారు మన తండ్రిలాంటివారు. ఆయన కాదనరు''

"అలాగే''

రెండడుగులు ముందుకు వేసి ఆగాడు అతను.

"శ్రీమహాలక్ష్మీ! నా దగ్గర ఓ రెండు వందలు వున్నాయి. ఇప్పుడు నాకు అవసరం లేదు. ఈ డబ్బు నీ దగ్గర వుంచు''

శ్రీమహాలక్ష్మి మొహం ఎర్రబడింది. వెంటనే కళ్లల్లో నీళ్లు గిర్రున తిరిగాయి.

"నువ్వు ఇలా చీటికీ మాటికీ అధైర్యపడి ఏడవకు. శ్రీమహాలక్ష్మి అంటే పిడికిళ్లు బిగించి అసాధ్యాన్ని సాధ్యం చేయగల్గే వీర నారి. అంతేగానీ అసలు సిసలైన ఆడపిల్లలా ఏడ్చి మొత్తుకుని నిస్సహాయపు చూపుల్తో ఎవరైనా సహాయం చేస్తారా అని ఎదురుచూసే బేల కాదు'' అన్నాడు.

శ్రీమహాలక్ష్మి మనసునీ, మేధస్సునీ అతని మాటలు వుతికి ఆరేశాయి. ఆమె నిటారుగా అయింది. అతని చేతిలోవున్న రెండు నోట్లనీ చొరవగా లాక్కుంది.

"భేష్... శ్రీమహాలక్ష్మి చేయి కిందపెట్టి అడుక్కోదు''

"మైగాడ్... పాణిగ్రాహీ నువ్వేనా'' అంది సంభ్రమాశ్చర్యాల్తో.

"నేనే. మీ నాన్న పోయినంత మాత్రంలో నువ్వు నీరుకారి పోనవసరంలేదు. పెద్దలు బాటలు వేస్తారు. పిల్లలు వాటిమీద సునాయాసంగా ప్రయాణం చేస్తారు''

"నువ్వు కూర్చో పాణిగ్రాహీ''

"ఒద్దులే! ఈ రోజుకీ టాబ్లెట్ చాలు. అవసరం అయినప్పుడు మళ్లీ టానిక్‌లా ఉపయోగించేందుకు మీ నాన్నగార్ని జ్ఞాపకం చేస్తూంటాన్లే''

"థాంక్యూ పాణిగ్రాహి, నేను బతకగలను''

"గుడ్. దటీజ్ శ్రీమహాలక్ష్మి''

అతను గుమ్మందాటాడు.

శ్రీమహాలక్ష్మి కళ్లు క్షణం మూసుకుని తెరిచాయి.

అతి నాజూకు మనస్తత్వంతో అతి దృఢమైన శరీర సౌష్టవంతో ఎక్కడ పాణిగ్రాహి వుంటాడో అక్కడ కొండంత అండ వున్నట్లు... అతని ప్రతి కదలిక ఎదుటివ్యక్తిని అబ్బురపడేట్లు చేస్తూ అతని వునికికి ఓ ప్రత్యేకతని ఆపాదిస్తూ విశిష్ట వ్యక్తిత్వాన్ని గుప్పిట్లో పెట్టుకున్న ఆ వ్యక్తి పేరే పాణిగ్రాహి. అతను తప్ప మరెవరూ కారు. అదీ ఎక్కువ సేపు అనుకోలేకపోయింది.

అతను వెళ్లిపోయాక వంటపని ప్రా





రంభించింది. తండ్రిపోయాక తల్లి వంటలో రుచిపోయింది.

"పొయ్యి కూడా వెలిగించడంరాదు. ఖర్మ'' సుభద్రమ్మ నెత్తిమొత్తుకుంది.

శ్రీమహాలక్ష్మి జవాబు చెప్పలేదు.

బొగ్గులు అయిపోయాయి.

కట్టెలు సరిగా మండడంలేదు.

గొట్టంతో వూదుతూ, విసనకర్రతో విసురుతూ వంట చేస్తుంటే కళ్లల్లోకీ ముక్కులోకీ పొగవెళ్లి వుక్కిరి బిక్కిరి చేస్తోంది.

"భోజనం రెడీ'' అంది అరగంట తర్వాత. అంతలోనే నవ్వు వచ్చింది. తల్లి పాపం దుఃఖంలో వుంటే తను అలా అనకూడదో ఏమో.

"అమ్మా అన్నం తిందాం"

"నేను తినకూడదు''

"గాడ్ ఎందుకు?"

"మీ నాన్న పోయారు. రాత్రిళ్లు తినకూడదు''

"నాన్సెన్స్... ఇటువంటి పనికిరాని మాటలు నాతో చెప్పద్దమ్మా. ఈ శరీరం మనది. దీన్ని జాగ్రత్తగా కాపాడుకోవలసిన బాధ్యత మనమీద వుంది''

"శ్రీమహాలక్ష్మి నన్నిలా బతకనీ. నువ్వూ మీ నాన్నా మీ ఇష్టప్రకారం బతికారు. నేను మీతో వాదించలేకపోయేదాన్ని. నాకు బెంగతో వూపిరిపోతోంది. నన్ను విసిగించకు''

"నువ్వు బతకాలమ్మా''

"ఒక పూట తినకపోతే చచ్చిపోరు ఎవరూ''

"ఓ పూటకి కావలసిన కాలరీలు శరీరానికి అందకపోతే క్రమంగా జీర్ణవ్యవస్థ దెబ్బతిని ఆపైన చచ్చిపోయే పరిస్థితి వస్తుంది''

ఆమెను మార్చలేకపోయింది శ్రీమహాలక్ష్మి. ఆఖరికి తను కూడా తినకుండా పడుకుంది.

  

శ్రీమహాలక్ష్మి పంతులుగారి బళ్లో చేరింది. ఎక్కువగా సంతోషించింది పాణిగ్రాహే. సబిత స్వామిని చూడాలని మొక్కుకుంది. కడుపుతో వున్నవాళ్ల కోర్కెలు తీర్చాలనే నమ్మకం చలపతికి కూడా వుండడంతో ఆమెని తీసుకుని పుట్టపర్తి వెళ్లాడు.

స్కూలుకు వచ్చేవరకూ ఈ విషయం తెలీదు ఇద్దరికీ. పిల్లల మధ్య సరదాగా, సంతోషంగా గడిచిపోయింది ఆరోజు. పాణిగ్రాహి మోటర్ సైకిలు కొన్నాడు.

"నిన్ను కూడా తీసుకు వెడతాను'' అన్నాడు.

శ్రీమహాలక్ష్మి బుర్రవూపింది. "అడ్డంగా వాదించడం నాకు తెలుసు. భయపడడం తెలీదు. భువనేశ్వరి నొచ్చుకుంటుంది''

పాణిగ్రాహి "జాగ్రత్త' అని వెళ్లిపోయాడు.

బస్తీదాటి పాత బిల్డింగ్‌లకి అవతల తాళ్లల్లోంచి వచ్చేసరికి అరగంట పట్టింది శ్రీమహాలక్ష్మికి. చిన్నప్పుడైతే భుజంమీద వేలాడే సంచీని ఇటూ అటూ వూపుకుంటూ కొంత దూరం ఒంటికాలిమీదా మరికొంత దూరం రెండు కాళ్లమీదా పరిగెత్తే సీను గుర్తువచ్చింది. ముగ్గురూ కలిసి వెళ్లే వాళ్లు. కలిసి వచ్చేవాళ్లు.

శ్రీమహాలక్ష్మి ఇల్లు చేరుకుంది. తల్లి కాఫీ తీసుకువచ్చి ఇచ్చింది. స్నానం చేసి బట్టలు మార్చుకుని త్వరత్వరగా కొన్ని పనులు చేసి వెళ్లి ఓ మంచి నవల చేతిలోకి తీసుకుని మంచంమీద వెల్లకిలా పడుకుంది.

మొదటి పేజీ తెరవకుండానే పక్కన పెట్టేసింది.

"శ్రీమహాలక్ష్మి! ప్రాక్టికల్‌గా ఆలోచించు. నువ్వేమీ రాజకుమారివి కావు, నీ కోసం రాకుమారుడూ రాడు. అంతా వట్టిదే. మీ నాన్న నిన్ను ముద్దుచేసి నీకు లేనిపోని అర్హతలు అంటగట్టాడు అవునా''

శ్రీమహాలక్ష్మి లేచి కూర్చుంది. చుట్టూ

చూసింది. ఎవరూ లేరు. సినిమాల్లోలాగ అద్దంలో తన ప్రతిబింబం తనతో చెప్పడం లేదు. ఎదురుగా తన ఆత్మ నిలువుగా తనలాగే నిలుచుని అదే భంగిమలో బోధించడంలేదు. మరి?

"నువ్వూ అందరిలాంటి ఆడపిల్లవే. ఎర్ర గా, అందంగా, సన్నగా, పొడుగ్గా, పెద్ద కళ్లతో తిన్నగా వున్న ముక్కూ, ఇవన్నీ ఓ చోటచే ర్చి దానికి శ్రీమహాలక్ష్మి అని పేరు పెట్టిన ప్పుడే నువ్వు ఆడపిల్లవని తెలుసుకోలేదా మ్మా''

"నేను ఆడపిల్లనే".. భయపడింది శ్రీమ హాలక్ష్మి. "నిక్కరు, షర్టు, క్రాపు, వేసుకోకపో తే ఆ రూపాన్ని మగాడని ఎలా అంటారను కున్నావు?"

"నాన్నే... నాన్నే అనేవారు. పదిమంది ఆడవాళ్ల మధ్యకన్నా ఒక మగవాడి పక్కన కూర్చుంటే మంచి పర్సనాలిటీ డెవలప్ అవుతుందని. ఆడవాళ్లు ఒకళ్లకి ఇద్దరు చేరితే వాళ్లమీద వీళ్లూ వీళ్లమీద వాళ్లూ చెప్పుకుంటా రని."

"పిచ్చిదానా! కుత్సితాలకీ, కుతంత్రాలకీ జెండర్ వుండదు. ఆ మనస్తత్వం ఎవరికైనా వుంటుంది. సంస్కారాన్ని బట్టి మనిషి పెరు గుతాడు. నిన్ను నాన్న వూహల్లో బతి కేందుకు ఆజ్యం పోశాడు. నువ్వేదో మహా ద్భుతమైన తెలివితేటలున్న బృహస్పతి కూతురనీ, అందంలో రతీదేవివని, ఐశ్వ ర్యంలో... హు ఆయన ఏకంగా 'శ్రీమహాల క్ష్మి' అని పేరే పెట్టేశాడు. వుగ్గుపాలతో నీకు పనికిరాని పరిజ్ఞానాన్ని నేర్పి చివరికి నిన్ను ఎందుకూ కొరగాని దానిలా చేశాడు''

"స్టాప్''

"ఆవేశపడకు. ఇప్పుడు చూడు, అటు వంటావార్పూ తెలీదు. ఇటు చేతిలో చిల్లి గవ్వలేదు. అందమైన మొహంమీద సన్నని ముడతలు నీ వయసుని దాచడం మానేస్తు





న్నాయి. రేపు అమ్మ కూడా గుటుక్కు మంటుంది. అప్పుడు నీకు తోడు ఎవరు?"

శ్రీమహాలక్ష్మి రెండుచేతుల్లోనూ మొహం దాచుకుంది. పదినిమిషాల తరువాత మా మూలు మనిషి అయింది. లేచి బయటికి వచ్చింది. సబిత వెళ్లిపోయాక ఓ పార్శ్వం చచ్చుబడిపోయిన ఫీలింగ్. మనోహరి నల్లా దగ్గర నీళ్లు పడుతోంది. నిండుగా వుంది. సన్నటి దరహాసరేఖ క్షణం శ్రీమహాలక్ష్మి మొహంలో నాట్యం చేసింది. సీజన్... ఇదీ పెళ్లిళ్ల సీజన్‌లాంటిదేనేమో. అక్కడ సబిత, ఇక్కడ మనోహరీ ఇద్దరూ నీళ్లు పోసుకున్నా రు.

ఆ బిందె తనే అందుకుంది శ్రీమహాల క్ష్మి.

అక్కడవున్న వాళ్ల మొహాలు రంగులు మారాయి.

బాబుగారున్నప్పుడు శ్రీమహాలక్ష్మి ఇలా ఎవరికైనా చేయి అందించేదా?

"నువ్వు ఎవరికీ నౌకరువి కాదు తల్లీ. అందరూ నీ కనుసన్నల్లో మెలగాలి'' అని అందరూ వినేట్లే అనేవాడు ఆయన.

"నేను తీసుకు వెడతానులే శ్రీమహాల క్ష్మి''

"ఫరవాలేదు, రా!" అంది తను ముందు దారితీస్తూ.

యతి గిన్నెలు కడిగి వరుసగా పేరుస్తు న్నాడు. ఓ స్టౌమీద అన్నం, మరో స్టౌమీద కూరా వుడుకుతున్నాయి.

"ఇదిగో టీ'' అని ఇటు తిరిగి చప్పున ఆగిపోయాడు. గాజుల చప్పుడు విని మనో హరి అనుకున్నాడు అతను. తీరా చూస్తే శ్రీమహాలక్ష్మి ముందూ ఆ వెనుక మనోహరీ కనిపించారు.

"ఆ టీ రెండు కప్పుల్లో సర్ది ఇవ్వండి'' అంది మనోహరి.

క్రింద పరచివున్న చాపమీద కూర్చున్నా రు ముగ్గురూ. "కూర్చుండ మా ఇంట కురిసీలులేవు'' నవ్వింది మనోహరి. శ్రీమ

హాలక్ష్మికి కూడా ఈ పద్యం ఇష్టమే.

"ఈ కాంపౌండ్‌లో చాలామందికి లేవు'' శ్రీమహాలక్ష్మి అంది.

మనోహరి నవ్వింది.

"రేపు ఇంతకంటే బాగుంటుందని ఆశ'' యతి అభిప్రాయం అది.

మనోహరి మెడలో ఆఖరికి పూసల దండ కూడా లేదు. పెళ్లిఅయిన రోజు ఎలా వచ్చారో ఈ రోజూ అలాగే వున్నారు.

శ్రీమహాలక్ష్మి కళ్లు చుట్టూ వెదుకుతున్నాయి. అప్పుడు ఆవేశంలో మనోహరిని వెనకేసుకు వచ్చింది. కానీ ఇప్పుడిప్పుడే అర్థం అవుతోంది.

సమాజంలో బతికేప్పుడు ఎన్నో ఎదుర్కోవలసి వస్తుందని.

మనసుకి నచ్చింది చేయాలంటే సమాజాన్ని ఎదిరించాలి. పోనీ రాజీపడాలంటే మనసుని చంపుకోవాలి. ఒకటి వ్యక్తిని బాధించేది. రెండోది సమాజాన్ని బాధించేది. ప్రేమలేని పెళ్లీ, పెళ్లిలేని ప్రేమాలాంటిదే ఇది కూడా.

"ఏమీ అనుకోకపోతే ఓ మాట అడగనా? మనూ''

"అడుగు''

"మీ అమ్మా వాళ్లూ రాలేదా?"

"పట్టుదల మనకేకాదు. మనల్ని కన్నందుకు వాళ్లకి రెట్టింపు వుంటుంది. ఇదంతే. కలసి వస్తే కాలం నిశ్చయిస్తుంది. లేకపోతే ఇలాగే సాగిపోతుంది''

"భయంగాలేదా?"

"భయం దేనికి? పిరికివాడు క్షణక్షణం చస్తాడనీ ధైర్యవంతుడు ఒకసారే పోతాడనే సామెత వుండనేవుంది''

యతి ఇంటి పనుల్లో చాలా సాయపడుతున్నాడు. మేడ్‌ఫర్ యీచ్ అదర్.

పెళ్లి తంతు, గుర్తులు ఇవన్నీ ఓ వైపు; మనసు, నమ్మకం ఇవి మరోవైపు. అన్నిటికీ మించి ఆత్మవిశ్వాసం, దాంతోపోటే మనసు పంచుకునీ, శరీరాన్ని ఒకటి చేసుకునీ కలసి ప్రయాణం చేయాలనే ధ్యేయం. నమ్మకాన్ని మించిన పెళ్లిమంత్రాలేవీ లేవు. మనోహరిని చూస్తుంటే స్పష్టంగా తెలుస్తోంది.

"మనూ నీకు ఏ అవసరం వచ్చినా నన్ను పిలు. నీకు కాన్పు అయ్యేవరకూ నేను వుంటాను. మిష్టర్ యతీ! అర్ధరాత్రీ అపరాత్రీ అంటూ ఆలోచించకండి. మనోహరి పక్కన మరో స్త్రీ వుంటే ఆ ధైర్యం వేరు''

"థాంక్సండీ''

"ఎప్పుడైనా మా ఇంటికి రండి''

"ఎక్కడా? వద్దాం అనుకుంటూండగానే ఇలా రోజులు గడిచిపోయాయి. ఇప్పుడు రాలేదు తను. నేను లేకుండా అసలే రాదు''

శ్రీమహాలక్ష్మి "వెళ్లొస్తా'' అని మెట్లు దిగింది.



**తం**డ్రి వున్నప్పుడు పుస్తకాల మధ్యలో ఇరుక్కుపోయేది శ్రీమహాలక్ష్మి. ఇప్పుడు ఒక పేజీ చదివితే మళ్లీమళ్లీ చదవాల్సి వస్తోంది. అర్థం కావడంలేదు. సమస్యలు జోరీగల్లా చుట్టుముడుతున్నాయి.

సబితని కూడా చూసివస్తోంది. ఏదో వెలితి, ఒంటరితనం. మోయలేని భారం నెత్తిన

మోస్తున్నట్లు భుజాలూ, మెడా, నడుమూ కృంగిపోయి ఐదడుగుల ఆరంగుళాల తను కుంచించుకుపోయి ఐదడుగుల అంగుళం దగ్గర ఆగిపోయినట్లుంది.

పొడుగ్గా, తగిన శరీర సౌష్టవంతో చేతులు చాపితే అటూ ఇటూ సేదదీరేందుకు హాయి గా అనిపించే ఆమె ఇప్పుడు కృంగిన మొక్క లా అయిపోయింది.

పుస్తకాలు చుట్టూ అలంకార ప్రాయాల య్యాయి. అప్పటికి ఏడుగంటలు దాటింది. కిరోసిన్ దీపాలు వెలిగించి నాలుగు గదుల్లో నూ పెట్టింది సుభద్రమ్మ.

శ్రీమహాలక్ష్మి ఉద్యోగంలో చేరాక ఆవిడే వంట పని చూస్తోంది.

"భోజనం చేద్దువుగాని రామ్మా'' ఆవిడ గుమ్మం దగ్గరే నిలబడి కూతురువైపు చూ సింది.

శ్రీమహాలక్ష్మి లేచి పదమ్మా అంది. భోజనం పూర్తి చేసేసరికి సుడిగాలిలా వచ్చేశా డు పాణిగ్రాహి. ఇంచుమించు పరుగెత్తి వచ్చినట్లే రొప్పుతున్నాడు.

"ఏమిటి హడావుడి?"

పాణిగ్రాహి స్టూల్ జరుపుకుని కూర్చున్నా డు. "నన్ను కొంచెం స్థిమితపడనీ''

"సరే... నీయిష్టం..." శ్రీమహాలక్ష్మి అతని ఎదురుగా కూర్చుంది. అతనేం చెబు తాడో వినాలని ఆత్రంగా ఎదురుచూస్తోంది.

"సబితకి కొడుకు. మనోహరికి కూడా కొడుకే. యిద్దరూ కె.ఇ.ఎమ్. హాస్పిటల్లోనే పురుడుపోసుకున్నారు. నేను వెళ్ళి చూసివ స్తున్నాను.

"అరె నాకు కబురు చేయలేదే''

"ఎలా చేస్తారు? అనుకోకుండా సబితని చూసేందుకు వెళ్ళాను. అప్పుడే లేబర్ పె యిన్స్ స్టార్ట్ అయాయి. చలపతీ నేనూ టాంగా మాట్లాడుకుని గుర్రాలవెంట పరుగో పరుగు. తీరా అక్కడికి వెళ్ళాక యతి కనిపించాడు

"చాలా వుత్సాహంగా వున్నావు. నాక్కూ డా ఆనందంగా వుంది. రేపు ప్రొద్దున్నే నేను వెళ్ళొచ్చా''

"రానిస్తారో లేదో... కాఫీ తీసుకువెళ్ళు''

"నీకు కాఫీ తీసుకురానా''

"ఒద్దు... ఇప్పుడేం చేస్తావు?"

శ్రీమహాలక్ష్మి లోపలికి వెళ్ళింది. సుభద్ర మ్మ తలుపు పక్కగా నిల్చుని అతన్ని ప్రాధేయపడుతున్నట్లు మనసులో మాట చె ప్పింది. "దీనికి కొండమీది కోతి కావాలి పాణిగ్రాహీ... మనం ఎంత, మన అంతస్తు ఎంత? ఒక్కసారి కూడా ఆలోచించదు. హిరణ్యాక్ష వరాలు. మనలాంటి మధ్యతర గతి వాళ్ళకి అందుతాయా చెప్పు? చిన్నప్ప టినుంచీ మీరందరూ కలిసిమెలిసి తల్లీ తోడూలా పెరిగారు. దానికో మంచి సంబంధం చూడు పాణిగ్రాహి''

పాణిగ్రాహి నిశ్శబ్దంగా వుండిపోయాడు. ఆమె తనతో ఎప్పుడూ ఏమీ చెప్పలేదు. ఇప్పుడు తన వల్ల ఏదో ఉపకారం తప్పక జరుగుతుందనే గట్టి నమ్మకంతో అర్థిస్తోంది.

తెప్పరిల్లి గొంతు పెగల్చుకున్నాడు. "అ లాగేనమ్మా''

శ్రీమహాలక్ష్మి కాఫీ తెచ్చి యిచ్చింది.

అతను ఆ పని పూర్తిచేసి ఇంటికి వెళ్ళా డు.

తల్లి అతనికోసమే ఎదురు చూస్తోంది. మెట్లు ఎక్కి లోపలికి రాగానే "భోజనం అయిందా'' అని అడిగింది.

పాణిగ్రాహి వులిక్కిపడ్డాడు. తనకి ఇప్పు డు ఇరవైమూడో, యిరవైనాలుగోఏళ్ళు. తల్లితో తప్ప తను ఎక్కడా భోజనం చేయ డు. ఆ సంగతి ఆవిడకి కూడా తెలుసు.

"లేదే, నేను భోజనం ఎక్కడ చేస్తాన మ్మా''

"కాంపౌండ్‌లో నలభై అయిదు ఇళ్లు న్నాయి. ఎక్కడైనా చేస్తే తప్పేంవుంది?"





"అమ్మా" అతను నిశ్చేష్టుడై తల్లివైపు చూశాడు. "నువ్వేనామ్మా మాట్లాడేది. ఎప్పుడూ... ఎప్పుడైనా యిలా..."

ఆవిడ గోడకి చేరగిలబడి కూర్చుంది. ఆమె కళ్ళల్లో నీళ్ళు చెంపలమీద పడ్డాయి "నువ్వు పెళ్ళిగురించి ఏం చేశావో చెప్పలేదని మావయ్య కబురు పెట్టాడు. రాత్రీ పగలూ అని లేకుండా ఎక్కేగుమ్మం దిగే గుమ్మం. ఇంటింటికీ వెళ్ళి గబ్బిలంలా అతుక్కుపోవడమే! ఒక్కరోజైనా నాతో మాట్లాడావురా"

పాణిగ్రాహి రెప్పవేయడం మరిచిపోయాడు.

"ఆ పెద్దాయన వుండగా ఆ ఇంటిమీద కాకి ఏ యింటిమీదా వాలేది కాదు. నిన్నూ, సబితనీ తప్ప ఎవర్నైనా రానిచ్చేవాడా ఆయన. ఆయన పోయాక వొంటరిపక్షులైపోయారు. నిన్ను వల్లో వేసుకోవాలని చూస్తున్నారేమో? అదేం కుదరదని చెప్పు"

"అమ్మా" పాణిగ్రాహి అరుపుకి గోడలు కదిలాయి. మాట పూర్తిచేసిన రాజేశ్వరమ్మ హడిలిపోయింది.

"నువ్వో వున్నతమైన వ్యక్తిత్వం వున్న పెద్దమనిషివి అనుకున్నానమ్మా. ప్రపంచంలో యింత అవగాహన, అంతెత్తు హృదయ ఔన్నత్యం వున్న తల్లి ఎంతమందికి దొరుకుతుంది అనుకునే వాడిని. 'నాన్న' అంటే తెలీని నన్ను అన్నీ నువ్వే అయి పెంచినపుడు నువ్వు నా కంటికి హిమాలయాలంత ఎత్తున వుండేదానివి. ఈ ఒక్క మాటతో, నువ్వు కొండమీది బండరాయిలా అగాథంలోకి పడిపోయావమ్మా.

"నిన్ను అసహ్యించుకుంటున్నాననే మాట చెప్పడానికి సిగ్గుపడను నేను. నువ్వు పెంచిన నేను నాకో అభిప్రాయం, పద్ధతులూ లేకుండానే పెరిగాననుకోవద్దు. తప్పు చేయడం జరిగితే అది చెప్పే ధైర్యం నాకుంది. అదీగాక పెళ్ళి విషయంలో ఏ వ్యక్తీ మరో వ్యక్తి గుప్పిట్లో వుండక్కర్లేదు. ప్రపంచంలో అన్ని స్వేచ్ఛలకన్నా ఈ స్వేచ్ఛ గొప్పది. కనుక నువ్వు బెదిరించినా మరేం చేసినా నాకంటూ చేయాలనిపిస్తే జడిసిపోనమ్మా!"

రాజేశ్వరమ్మ బొమ్మలా గోడకి అతుక్కుపోయింది. అతను చాపా తలగడా తీసుకుని డాబామీదికి వెళ్ళిపోయాడు. ఎందుకలా మాట్లాడింది? వాడు కడుపులో వుండగానే వాడి తండ్రి బస్సుకింద పడి చచ్చిపోతే ఎన్నెన్ని బాధలు భరించింది. వాడు కడుపులో కదులుతూంటే ఈ విషయం ఆనందంగా పంచుకుందుకు వాడి తండ్రి లేకపోతే 'ఈశ్వరా' అని కదూ మొరపెట్టుకుంది.

అటు పుట్టింటివాళ్ళు కానీ, యిటు మెట్టినింటి వాళ్ళు కానీ తనని తీసుకువెళ్ళలేదు. ఆయన పించనుతో ఇదే ఇంట్లో ఇన్నేళ్ళూ గౌరవంగా గడిపేసింది.

ఇవాళ తనని ఏ భూతం ఆవహించి అంత మాట అనేట్లు చేసింది? రాజేశ్వరమ్మ కళ్లల్లో నీళ్ళు ధారాపాతంగా చెంపలమీదకి జారుతున్నాయి.

'అలుగుటయే ఎరుంగని', వూపిరి గట్టిగా పీలుస్తే వినిపిస్తుందేమో అన్నంత సుకుమారంగా వుండే పాణిగ్రాహి వున్నట్లుండి రుద్రభూమిలో శంకరుడిలా ప్రచండంగా అలా అనేశాడేమిటి?

రాజేశ్వరమ్మ కొంగుతో కళ్ళు తుడుచుకుంది. నిశ్శబ్దంగా చెంపలు వేసుకుంది. వూసుపోని కబుర్లు చెప్పుకుంటూ పొద్దుని చాడీలతో కొలుస్తూ, గుంపులు గుంపులుగా కూర్చుని ఎల్లిమీద పిల్లికీ, పిల్లిమీద ఎల్లికీ చెప్పుకుని మురిసిపోయే ఓ బృందం దగ్గర ఈ మధ్యకాలంలో కూర్చోవడమే తన నాలుకని కలుషితం చేసింది.

"ఛ! ఛ!" రాజేశ్వరమ్మ తననుతాను విపరీతంగా తిట్టుకుంది. మానవనైజాన్ని చెరిగి పారేసుకుంది. అప్పటికిగాని మనసు శాంతపడలేదు. తేలికైన మనసుతో కొంగు పరుచుకుని ప్రశాంతంగా నిద్రపోయింది.

హంసతూలికాతల్పం ఎందుకూ పనికిరాదు ఆత్మప్రక్షాళన అయిపోయాక.

పైన డాబామీద పడుకున్న పాణిగ్రాహిని ఆలోచనలు చుట్టుముట్టాయి. వెన్నెల నంది వర్ధనం పూలా తెల్లగా మెరుస్తోంది. సన్నని గాలితెమ్మెర శరీరాన్నిలా తాకి అలా అలవోక గా వెళ్ళిపోతోంది. దానికో రూపం యిస్తే అది గోదారిగట్టుమీద ముద్దబంతిపూవులాంటి అమ్మాయే అయిపోతుంది.

పాణిగ్రాహి వెల్లకిలా పడుకున్నాడు. వెలుగు నీడల్లా పడుగూ- పేకాలా, కొబ్బరి ఆకుల నీడలు వెన్నెలని కప్పుతున్నాయి.

ఈ అందమైన రాత్రి చుక్కలాంటి చక్కనిది పాణిగ్రాహి చెంపమీద వాలుజడతో యిలా చిన్న 'చరుపు' వేసింది. ఉలిక్కిపడ్డ పాణిగ్రాహి కంటిముందు, ఆ 'చుక్క' వూహా రూపం 'శ్రీమహాలక్ష్మి'లా తోచింది.

అతని శరీరం ఝల్లుమంది, రక్తం జివ్ మని మొహంమీదకి వచ్చేయగానే నరాలు వుబ్బి అతనిలో వున్న పురుష పుంగవుడిని లేపి కూర్చోబెట్టాయి.

అయిదు నిమిషాలకి అతను మేలుకున్నాడు. మామూలు మనిషి అయ్యాడు.

ఓ వస్తువుమీద శ్రద్ధ చూపిస్తే అది తమదే అవుతుందని జనవాక్యం.

రాజేశ్వరమ్మ 'శ్రీమహాలక్ష్మి'ని గూర్చి అన్న మాటలు పాణిగ్రాహి చెవుల్లోంచి నాసికాగ్రాల్లోంచీ పెదవుల్లోంచీ ఆపైన మెదడు తడిమి గుండెలమీదకి చేరుకున్నాయి. అతను నిటారుగా అయ్యాడు.

అపరంజి బొమ్మలాంటి శ్రీమహాలక్ష్మి తన ఆశలకీ ఆశయాలకీ భిన్నంగా పాణిగ్రాహిని చేసుకుంటుందా?

ఏ...మో?

అతను రెండుచేతుల్నీ తలకిందపెట్టుకున్నాడు. వెన్నెల పిండి వర్షం కురిపిస్తోంది. యిప్పుడు కొబ్బరి ఆకుల నీడలు లేవు. తననుతాను బేరీజు వేసుకుంటున్నాడు. అసలు ఈ ఆలోచనే లేకుండా గడిపేశాడు ఇన్నాళ్ళూ. ఇప్పుడు 'అమ్మ', అన్న మాటకి తనలో అంతరాంతరాల్లో దాక్కుని కాపుకాస్తున్న కోర్కె బయటపడిందా? అట్టడుగు పొరల్లో నిక్షిప్తం అయిన ఆ 'ఇష్టం' ఒక్కసారి తోసుకుని ఎలా వచ్చేయగల్గింది? అంటే నిజంగానే శ్రీమహాలక్ష్మిమీద తనకి ప్రేమవుంది. ఆ విషయం తనకి కూడా తెలియనీయకుండా మనసు గుప్పిట్లో దాచుకుంది. అతని సన్నని పెదవులమీద దరహాసరేఖ తళుక్కుమంది. అతను నిద్రకి దూరం అయ్యాడు. పడుకుంటే పండంటి ఆలోచనలు 'స్థబ్ధం'గా వుండిపోతాయి. ఒద్దు... సాగిపోవాలీ ఆలోచనలు.

శ్రీమహాలక్ష్మి ఓ విచిత్రమైన వ్యక్తి గమ్మత్తయిన వ్యక్తిత్వం.

ఈగో, దర్పం, భేషజం, తలపొగరు, విసురు, నిర్లక్ష్యం యిన్ని కలబోసి ఓ వైపు అమాయకత్వం, భోళాస్వభావం కడుపులో రహస్యం ఇముడ్చుకోలేని తత్వం, పరోపకారం అంటే నా భుజమ్మీద అంటూ, పసిపిల్లలా ప్రవర్తిస్తూ, వున్నట్టుండి నిశ్శబ్దం అయిపోతూ, అంతలోనే మాట్లాడేస్తూ అయోమయ పరబ్రహ్మానికి ఓ మంచి పేరు యిస్తే అది 'శ్రీమహాలక్ష్మి' అవుతుంది.

ఏళ్ళు ముందుకు తోస్తూ శరీరంలో మార్పులు తెస్తున్నాయి.

మనసు పద్ధెనిమిదేళ్ళ ప్రాయంలో ఆగిపోయింది.

ఆ మనసు వాస్తవాన్ని మార్చుకోదు.

తాపట్టిన కుందేటికి మూడే కాళ్ళు.

అతను నిద్రనీ, ఆలోచనల్నీ ఆపాలని ప్రయత్నం చేశాడు. కొంతసేపటికి సన్నని గురక ఆ నిశ్శబ్దంలో ప్రయాణం చేయడం మొదలుపెట్టింది.

  

సబిత పిల్లవాడినీ, మనోహరి పిల్లవాడినీ ఒకేరోజు 'తొట్టి'లో వేశారు. రెండు తిరస్కరించబడిన కుటుంబాల పిల్లలు ఇప్పుడు




ఒకటి అయ్యారు.

సబితా, మనోహరీ ఈ వేడుకని ఒకచోట చేయాలనుకున్నారు. వచ్చినవాళ్ళు వస్తారు. రాని వాళ్ళు రాకపోనీ అనే నిర్ణయానికి వచ్చారు.

పాణిగ్రాహీ, శ్రీమహాలక్ష్మి కూడా అక్కడే వున్నారు.

ఎవరెవర్ని పిలవాలో 'లిస్టు' రాసుకున్నారు.

'డోలారోహణ' పత్రికలు చాలా బావున్నాయి. ఒకే తొట్టిలో యిద్దరు పిల్లలు 'ఆహ్వాన పత్రిక మోడల్‌లో వున్నాయి. వాటికి కుదురుగా నాలుగు వైపుల్లోనూ పసుపు అంటిస్తున్నాడు యతి. చలపతి పిల్లల మధ్య కూర్చుని 'వూం ఖుం', 'ఉంగా', భాష మాట్లాడుతున్నాడు. మనోహరి కాఫీ ఫలహారాలు సిద్ధం చేసేందుకు వెళ్ళింది.

శ్రీమహాలక్ష్మి వాళ్ళనే చూస్తోంది.

మనోహరి, సబితా తన యీడువాళ్ళే.

తల్లితండ్రుల్ని వదిలి వచ్చేశారు.

యిట్టే పెళ్ళిచేసుకుని అట్టే తల్లులయ్యారు.

ఇద్దరి మొహాల్లో ప్రపంచాన్ని జయించిన తృప్తి స్పష్టంగా కనిపిస్తోంది. అద్దంలో అయితే చూసుకోలేదు కానీ శ్రీమహాలక్ష్మికి తన మొహం ఎలా వుంటుందో తెలుసు. నీరసంగా పీక్కుపోయి... భూభారాన్నంతా మోస్తూన్నట్లు భుజాలూ, మెడా వొంగిపోయి. కళ్ళ చుట్టూ నల్లటి వలయాలతో... నవ్వితే ఎవరో బలవంతంగా బుగ్గల్ని సాగదీసినట్లుందేగానీ సహజత్వం మచ్చుకి కూడా కనిపించలేదు.

అసంతృప్తి, కసి, తీరని కోర్కెల మంటల్లో చిక్కుకుపోయిన అలజడి రాజీపడేందుకు కించిత్ రాజసం, అహంభావం అడ్డంవస్తున్నాయి.

ఆకలివేస్తే సింహం గడ్డితినదు.

ఒంటరిగా వుంటున్నానన్న భ్రమ వల్లో వుండలేని కారణంవల్లో 'అల్లాటప్పా', గాడిని పెళ్ళిచేసుకోలేదు. తన శిరస్సు డాక్టరు ముందో, ఇంజనీరు ముందో నమ్రతగా వొంచుతుందే తప్ప మిగిలిన మరెవరైనా తన దృష్టిలో కాణీకి పనికిరానివాడే. అటువంటి వాడిముందు తను తల వంచి 'సూత్రధారణ' చేయించుకోవడమా! నెవ్వర్. ఇంపాజిబుల్.

సబిత కూనిరాగాలు తీస్తూ ఆపేసింది. "ఏవండీ ముందు మా నాన్నకి యిచ్చివద్దామా''

చలపతి ఆడీపాడీ అలసిపోయాడు. చూసేందుకు కుర్రకుంకలేగానీ శబ్దం ఆపేస్తే 'కీ' మంటూ అతని సహనానికి పరీక్షపెట్టారు. 'హా' అని ఆయాసాన్ని తీర్చుకున్నాడు. సబిత మళ్ళీ అదేమాట అడిగింది.

"నీ యిష్టం నువ్వెలా చెబితే అలా''

"మీరూ చెప్పండి, యిద్దామా, వద్దా''

"సబితా! నాకంటే నీకే ఎక్కువ తెలివితేటలున్నాయి. నువ్వే ఆలోచించి నీ యిష్టప్రకారం చేయి. దానికి నేను 'యస్' అంటాను''

"ఖర్మ'' సబిత నెత్తిమొత్తుకుంది.

"ఏమైంది... నేనేమైనా తప్పుగా మాట్లాడానా సబీ''

"సబీ, సిబ్బీ... అనద్దండి. ఎప్పుడూ నేనే బుర్రబద్దలుకొట్టుకుని ఆలోచించి చెబుతూండడమేగానీ మీరూ ఎందుకు ఆలోచించరు చెప్పండి. నేను అలసిపోతున్నాను''

"సరే, నువ్వేమీ ఆలోచించద్దు. మనోహరీ, యతీ, శ్రీమహాలక్ష్మి, పాణిగ్రాహీ చూసుకుంటారు''

మనోహరి గడుసుగా నవ్వింది. 'సబితా' చలపతిగార్ని ఇబ్బంది పెట్టద్దు. మనం జంటలు జంటలుగా వెళ్ళి పిలిచి వద్దాం. ఈలోగా పిల్లల్ని చూసుకుంటూ పాణిగ్రాహీ,

శ్రీమహాలక్ష్మి వుంటారు''

పాణిగ్రాహీ శ్రీమహాలక్ష్మి మొహమొహాలు చూసుకున్నారు. ముందుగా శ్రీమహాలక్ష్మి తేరుకుంది.

"వాళ్ళు ఏడిస్తే?"

"సీసాల్లో పాలుపట్టి భుజంమీద వేసుకుని ఇటూ అటూ తిప్పితే నిద్రపోతారు'' యతి చెప్పాడు.

పదినిమిషాల్లో తయారై రెండు జంటలూ ఝామ్మని స్కూటర్లమీద వెళ్ళిపోయారు.

శ్రీమహాలక్ష్మి మోకాళ్ళచుట్టూ చేతులు వేసుకుని ఆడుకుంటున్న పిల్లలవైపు చూస్తుండిపోయింది. పాణిగ్రాహి నోటి చివర మాటని మింగేశాడు. కొద్దిసేపటికి 'కావ్, కావ్' అంటూ రాగం అందుకున్నారు పిల్లలు. శ్రీమహాలక్ష్మి వంటింట్లోకి పరిగెత్తింది. ఆ తర్వాత భుజంమీద వేసుకున్నారు ఇద్దరూ. అటూ ఇటూ ఎటూ లొంగడంలేదు వాళ్ళు.

వుక్రోషంతో శ్రీమహాలక్ష్మికి కళ్ళనీళ్ళు కూడా వచ్చాయి. "అనవసరంగా చిక్కుకుపోయాను పాణిగ్రాహీ! నావల్ల కాదు. నీరసం వస్తోంది'' అంది బేలగా.

"కొంచెం వోపికపట్టు తల్లీ'' అన్నాడు అతను.

శ్రీమహాలక్ష్మి భుజంమీద పిల్లవాడిని జోగొడుతోందేగానీ ముళ్ళమీద వున్నట్లుంది. ఆకాశంలో విహంగంలా ఎగిరే తనకీ జంజాటం ఏమిటి?

గంట గడిచాకగానీ సబితా, మనోహరీ రాలేకపోయారు కొంత ప్రసన్నంగా కొంత అప్రసన్నంగా పెట్టిన మొహాల్తో. యతీ, చలపతీ హుషారుగానే వున్నారు.

పిల్లల్ని తల్లులు తీసుకున్నారు.

"ఇక నేను వెడతాను'' అంది శ్రీమహాలక్ష్మి లేస్తూ. ఆమె చేతిని అందుకుని తన పక్కనే కూర్చోబెట్టుకుంది సబిత.

"నేను వెళ్ళాలి సబితా'' శ్రీమహాలక్ష్మికి ఓపిక నశించిపోతోంది.

చలపతీ, యతీ తమతో పాణిగ్రాహిని డాబామీదకి తీసుకువెళ్ళారు. పిల్లవాడు పడుకున్నాక మనోహరి బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది. తిరిగి తిరిగి వచ్చినందుకు 'స్నానం' చేస్తే సుఖంగా వుంటుందని.

"చెప్పు" అంది శ్రీమహాలక్ష్మి.

సబిత మొదలుపెట్టింది. "మానాన్న మంచీ మర్యాదా లేకుండా వెళ్ళగొట్టాడు. కొట్టడం ఒకటే తరువాయి. పిన్ని కూడా అంతే. తను ఏటా బాలింత, చూలింత. చాకిరీ చేయించుకుంది నాచేత. ఇంటికి వచ్చిన కూతుర్ని రిసీవ్ చేసుకునే పద్ధతి ఇదేనా? ఆయన బోదురు కప్పలా 'బెకబెక' మంటూంటే ఈవిడ సన్నాయి నొక్కులు నొక్కింది.

'తల్లి చస్తే తండ్రి పినతండ్రితో సమానం' అనేది అమ్మమ్మ. పాపం నానమ్మే వాళ్ళిద్దరి కళ్ళూ కప్పేసి నా గుప్పిట్లో 'వందనోటు' పెట్టింది. అసలుకంటే వడ్డీ ముద్దుట. పెద్దావిడ ఆవిడకి వున్నంత ప్రేమ కూడా లేకపోయింది ఆయనకి''

"మా అమ్మ ఏమంది?" అడిగింది శ్రీమహాలక్ష్మి.

"ఏమంటుంది? ఆవిడ బాధ ఆవిడది. కాఫీ ఇచ్చింది. పకోడీలు చేస్తానంది. వొద్దని చెప్పాం. చలపతిలాంటి వాడెవరైనా వుంటే చూడమంది'' మధ్యలో నిట్టూర్చింది.

"మేము అంటే నేనూ, మనోహరీ బంధువర్గంచేతా పుట్టింటిచేతా తిరస్కరించబడిన వాళ్ళం. ఓ విధంగా సోషల్లీ బాయ్‌కాటెడ్. నథింగ్ టు వర్రీ... చలపతిని నువ్వే నాకు చూసి పెట్టావు. నేనుగానీ, మనోహరిగానీ మా భర్తల్లాంటి వాళ్ళని తీసుకురాలేం. ఎలా తెలుస్తుంది ఓ వ్యక్తి పూర్వాపరాలు, స్వభావాలు. అందుకే పెద్దలు కుదిర్చిన పెళ్ళిళ్ళల్లో సక్సెస్ వుంది''

"నువ్వు బాధపడుతున్నావా''

"వుహుం"

"మరి అలా చెబుతున్నావేం?"





# ఏరిన ముత్యాలు

★ అలవాటును ఆదిలో అరికట్టకపోతే ఆ తరువాత అది అవసరంగా మారుతుంది.

–సెంట్ అగస్టిన్

★ హృదయం తాలూకు జ్ఞాపకశక్తి కృతజ్ఞత.

–జె.బి. మరియం

★ లోకంలో చీకటి అంతా ఏకమయినా ఒక చిన్న కొవ్వొత్తి ముందు నిలబడలేవు.

–విన్‌రోడ్

★ ఉపకారం పొందినవారు మరిచిపోకూడదు. చేసినవారు గుర్తుంచుకోకూడదు.

–భారన్

★ సామ్రాజ్యాలు, నాగరికతలు బయటి శత్రువులవల్ల కాదు, తమలోని హింసా ప్రవృత్తివల్లనే పతనమౌతాయి.

–నెహ్రూ

★ కృతజ్ఞత ప్రదర్శించవలసిందే కానీ దాన్ని డిమాండ్ చేసే హక్కు ఎవరికీ లేదు.

–రూసో

★ శ్రద్ధగా వినడం నేర్చుకుంటే నిష్టూరాలాడేవారినుంచి కూడా లాభం పొందవచ్చు.

–ప్లూటార్క్

★ రాజకీయవాది పాదరసంలాంటివాడు. అతనిమీద వేలు వుంచితే ఆ వేలు కింద ఏమీ వుండదు.

–ఆస్టిన్‌ఓమాలి

★ మూఢనమ్మకంతో విజ్ఞాని కూడా అవివేకిని అనుసరిస్తాడు.

–ఫ్రాన్సిస్ బేకన్

★ యాచించేదానికి సిగ్గుపడనప్పుడు దానిని చెప్పడానికి సిగ్గుపడవద్దు.

–ఐకేల్‌డిమాంటైన్

★ 'జీవితం' అర్థం తెలుసుకోవడం మనల్ని మనం తెలుసుకోవడం. విద్యకు మొదలూ తుదీ అదే.

–జిడ్డు కృష్ణమూర్తి

★ జీవితగానానికి కన్నీరు పల్లవి, చిరునవ్వు అనుపల్లవి.

–ఎస్. రాధాకృష్ణన్

సేకరణ: **మాడుగుల రాము**

# చతుర సమీక్ష




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కా/గితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

మార్చి చతుర నవల 'ఈ జీవితం నాది'

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా ..............................

..............................

..............................

"కమింగ్‌టు ద పాయింట్. విస్తృతమైన పరిధి లేకపోవడంవల్ల మేము వాకబు చేయలేం. నిన్ను నరకంలో పడేయలేం శ్రీమహాలక్ష్మి! డాక్టర్‌నీ, ఇంజనీర్‌నీ, డబ్బుపోసి కొనే స్థితిలో మనం లేము''

శ్రీమహాలక్ష్మి మనసు పిండినట్లు మూల్గింది.

"మీ అమ్మ కూడా బెంగవల్లా, మీనాన్న పోవడంవల్లా, మధ్యతరగతి చిక్కులవల్లా పదేళ్ళు ఎక్కువగా కనిపిస్తున్నారు. ఈ జీవితం శాశ్వతం కాదు. ఎవరు ఎప్పుడు గుటుక్కుమంటామో తెలీదు. నా మాటవిను. నీ ప్రాణస్నేహితురాల్ని నేను''

శ్రీమహాలక్ష్మి రెప్పవేయకుండా ఆమెనే చూస్తోంది.

"నువ్వు మన పాణిగ్రాహిని పెళ్ళిచేసుకుంటే''

"స్టాప్ దేర్' శ్రీమహాలక్ష్మి జువ్వలా లేచి బయటికి వెళ్ళిపోయింది. సబిత వూహించినట్లే జరిగింది. అందుకే వులిక్కిపడడంగానీ, భయపడ్డంగానీ చేయలేదు. నిదానంగా పిల్లవాడి బాగ్‌నీ తన పర్స్‌నీ భుజాన తగిలించుకుని లేచేందుకు సిద్ధం అయింది.

మెట్లు దిగి వచ్చిన యతీ, చలపతీ ఆమెని అడిగారు. "కాయా, పండా''

సబిత చెప్పింది. "కాయే మూర్ఖురాలు. చెబితే వినదు గిల్లితే ఏడుస్తుంది."

మనోహరి బొట్టు పెట్టింది. పాణిగ్రాహికి తెలిసిపోయింది. ఈ విషయం దార్లో 'ప్లాన్' వేసుకునే వచ్చారు. అందుకే ఇంతసేపు తనతో మాట్లాడారు.

"రేపు త్వరగా వచ్చేయండి''

"అలాగే' చలపతి భార్యని తీసుకుని వెళ్ళిపోయాడు.

పాణిగ్రాహి బయలుదేరుతుంటే అతని భుజంమీద యతి చేయి వేశాడు. "ఒక్కసారిగా తన ఆశలు పునాదుల్తోసహా పెకిలిపోతుంటే చూడలేకపోయింది శ్రీమహాలక్ష్మి. జరగబోయేది ఇదే. కానీ 'షైమ్' పడుతుంది. ఈ చేదునిజం మింగుడు పడడం మాటలు కాదు మరి''

పాణిగ్రాహి చిన్నగా నవ్వాడు.

ఇంటికి వెళ్ళాడు పాణిగ్రాహి. తల్లి తనకి ఇష్టం అని మైసూర్‌పాక్ చేస్తోంది.

అలికిడి విని బయటికి వచ్చి అతని నోట్లో చిన్నముక్క పెట్టింది. ఆమెవైపే చూసి "ఏవిటి విశేషం" అని అన్నాడు.

"శ్రీమహాలక్ష్మి వచ్చింది."

అతను ఆ చిన్నముక్కని నమలకుండా మింగేశాడు. అది గొంతుకి అడ్డంపడి 'కొర బోయింది.

ఆమె కొడుకు చేతిని తన చేతుల్లోకి తీసుకుంది ఆప్యాయంగా. "నువ్వు అదృష్టవంతుడివిరా'' అంది.

అతనామె కాళ్ల దగ్గర కూలబడ్డాడు.

"'అత్తా నీ కొడుకుని పెళ్ళాడుతున్నాను' అందిరా శ్రీమహాలక్ష్మి''

పాణిగ్రాహి గుక్కతిప్పుకునేందుకు ఐదు నిమిషాలు పట్టింది. ఆ తర్వాత ఆమె ఒళ్లో తలపెట్టుకుని తన ఇష్టాన్ని నిశ్శబ్దంగా ప్రకటించాడు.

అసలేం జరిగిందంటే...

దారి పొడుగునా శ్రీమహాలక్ష్మి ఆలోచిస్తూ వచ్చింది. సబిత తన ప్రాణస్నేహితురాలు. తన భవిష్యత్‌నీ, మేలునీ కోరే మనిషి. తనే అదృష్టవంతురాలైతే తన తండ్రి డబ్బు దాచి తన కోర్కె తీర్చేవాడు. పరీక్ష హాల్లో కూర్చుని పరీక్ష రాస్తూంటే 'యువర్‌టైమ్ ఈజ్ అప్' అంటున్నట్లు కాలం దూసుకువెడుతూ 'నీ పెళ్లి టైమ్ అప్' అంటుందేమో అనే భయం పీడిస్తోంది.

ఏదో వెలితి. ఆడుతూపాడుతూ గడిచిపోయిన బాల్యం, స్కూల్ ఫైనల్‌వరకూ ఆలోచించేందుకు తీరికలేని చదువూ ఉత్సాహంగా రోజుల్ని దొర్లించేశాయి. పద్ధెనిమిది



తర్వాత కాలం నత్తనడక ప్రారంభించింది. చదువూ, ఉద్యోగం, సద్యోగం, వ్యాపకం, నిర్వాకం ఏమీ లేకపోవడంవల్ల కదలని కాలాన్ని కదిలించడం దుర్లభం అయిపోయింది.

ఏ టైమ్‌లో ఆ కార్యక్రమం జరిగిపోవాలి.

తప్పదు. రొటీన్ లైఫ్ ఇది. తన కోసం ఏ రాజకుమారుడూ రాడు సరిగదా రాజకుమారుడి బాడీగార్డు కూడా రాడు. తన కలలు, కల్లలు, పగటికలలు అవి.

చీకట్లో ఏడుస్తోందామె. తనివితీరా, నిశ్శబ్దంగా ఏడుస్తోంది.

తనకి అక్కలున్నారుగానీ, వాళ్ళెలా వుంటారో కూడా తెలీదు.

సబిత చెప్పినట్లు అమ్మ చచ్చిపోతే నాన్న లేని, అమ్మలేని ఆ ఇంట్లో కాలం గడపడం నరకంలాంటిదే.

పాణిగ్రాహిని పెళ్లిచేసుకోవడమా?

వెర్రిగా నవ్వుకుంది.

కలిసి పెరగడంవల్ల ప్రత్యేకత ఏమీ కనిపించడంలేదు. ఆకలివేస్తే అన్నం తినడంలాంటిది. పెళ్లి జరగాలంటే జరుగుబాటుకి పాణిగ్రాహి చాలు.

శ్రీమహాలక్ష్మి క్షణం కూడా ఆలోచించలేదు. గబగబా కళ్లు తుడుచుకుని పాణిగ్రాహి ఇల్లు రాగానే మెట్లెక్కి లోపలికి వెళ్లి 'అత్తా' అని పిలిచింది.

రాజేశ్వరమ్మ వంటింట్లో చేస్తున్న పని ఆపి ఆమెవైపు చూసింది.

"అత్తా నీ కొడుకుని పెళ్ళాడుతున్నాను'' అంది.

రాజేశ్వరమ్మకి తేరుకునేందుకు క్షణం పట్టింది. ఆ తర్వాత ఆమె చేతులు కడుక్కొని శ్రీమహాలక్ష్మిని దగ్గరకి తీసుకుంది.

ఆ తర్వాత నిమిషం కూడా ఆగకుండా "ఈ సంగతి అమ్మకి కూడా చెప్పాలి అత్తా'' అని ఇంటివైపు గబగబా వెళ్ళిపోయింది.

సుభద్రమ్మకి ఈమాట వినగానే మూర్ఛ వచ్చినంతపనైంది. ఈ పిల్ల స్పృహ వుండే మాట్లాడుతోందా? తెల్లబోయిన తల్లి భుజంమీద చేయివేసి ఈ లోకంలోకి తీసుకువచ్చింది.

"నా మొహానికి పాణిగ్రాహి కూడా ఎక్కువే. చింత చచ్చినా పులుపు చావనట్లు నా కంటూ ప్రత్యేకతలు ఏవీ లేకపోయినా పాణిగ్రాహిని ఓ ఆఫ్టరాల్‌గాడు అన్నట్లు తీసిపడేశాను. పంతులుగార్ని పిలిపించి మంచిరోజు చూడమని చెప్పు" అంది.

సుభద్రమ్మ గుండె చెరువైంది. కళ్లు వాగులయ్యాయి. గొంతు పెగల్చుకుని "మీ అక్కలకీ సంగతి రాస్తాను'' అంది.

శ్రీమహాలక్ష్మి వెర్రినవ్వు నవ్వింది.

"నాన్న పోతేనే రాలేదు. పోనీమ్మా ఎవరు వచ్చి ఏంచేస్తారు? పట్టుమని పదిమందికి భోజనం పెట్టలేనివాళ్ళం"

"నీకు అన్నం వడ్డించనా'' తేరుకుని అడిగింది సుభద్రమ్మ.

"ఆకలిగా లేదమ్మా'' అనేసి వెళ్ళి మంచంమీద పడుకుంది.

ఈ మంచంమీదే వూహలపల్లకీలో ప్రయాణం చేసేది.

ఈ మంచంమీదే నవరత్నఖచిత సింహాసనంలో కూర్చున్న రాకుమార్తెలా వున్న నాకు సాటివారు ఎవరూ అన్నట్లు ప్రవర్తించేది. చివరికి... చివరికి విధిచేతిలో చిత్తుగా ఓడిపోయింది. ఆకాశహర్మ్యాలూ లేవు. రెక్కలు చాపుకున్న కార్లూ లేవు. నెలలో ఓ జాకెట్టు ముక్క కొనేందుకు లక్షాతొంభైసార్లు ఆలోచించాల్సిన పరిస్థితి ఏర్పడింది.

శ్రీమహాలక్ష్మి ఒద్దికగా ముడుచుకుని సుఖంగా నిద్రపోయింది. వాస్తవాన్ని జీర్ణించుకోవడం ప్రారంభించాక రాజీబాటలో కూడా నిద్ర బాగానే వస్తుంది.

★ ★ ★

ఏ ఆర్భాటం, పటాటోపం లేకుండా పాణిగ్రాహి, శ్రీమహాలక్ష్మి దంపతులయ్యారు.





కాంపౌండ్‌లో అందరూ చదివింపుల పేరిట ఓ చిన్న సంసారానికి కావలసి సామాగ్రినీ రెండు నెలలు తిరిగి చూసుకుందుకు అవసరం లేకుండా డబ్బునీ ఇచ్చారు.

సుభద్రమ్మ కూతురిని అత్తవారింటికి పంపించి నిట్టూర్చింది. ఆరు ఇళ్లు మధ్యలో వున్నాయి. అయినా వెళ్ళలేనంత దూరం పంపించినట్లే బాధపడింది. ఈ గడపదాటి ఆ గడపలో అడుగుపెట్టాక ఆ పిల్ల అక్కడిదే.

రాజేశ్వరమ్మ తన అన్నకూతుర్ని పాణిగ్రాహి చేసుకోలేదన్న సంగతే మరచిపోయింది. తన ప్రాణంలో ప్రాణం వాడు. వాడు ఏం చేసినా ఆమెకు సమ్మతమే. అయినా శ్రీమహాలక్ష్మికేం తక్కువ?

శ్రీమహాలక్ష్మి స్కూలుకు వెళ్ళడం మానలేదు.

బడిమానేసి ఇంట్లో కూర్చోమని అటు అత్తగారుకానీ ఇటు పాణిగ్రాహికానీ చెప్పలేదు. అన్నిటికీమించి తల్లిని పోషించాల్సిన బాధ్యత ఇంకా ఆమెకు వుంది.

మొదటిరాత్రి రాజేశ్వరమ్మ చప్పుడు చేయకుండా సుభద్రమ్మ ఇంటికి వెళ్ళిపోయింది.

ఇరుకు గదులు కాకపోయినా బాహాటంగా గాలీ వెలుతురూ ఆడవు. ఓ తలుపు రెక్క తెరిచివుంచితే మైకులో మాట్లాడినట్లే. ఆ ఇళ్లల్లో గుసగుసలుండవు. ఎంత నెమ్మదిగా మాట్లాడినా 'రీ సౌండ్'లో వినిపిస్తాయి. అందుకే రాజేశ్వరమ్మ పక్క సర్దుకుంది.

తెల్లని పంఘిరిమంచం, దుప్పటి, పువ్వులు, పాలు, పళ్లు ఇవి సంప్రదాయం. గ్లాసులో వున్న బియ్యంలో అగరువత్తులు వెలుగుతున్నాయి.

శ్రీమహాలక్ష్మి పాలగ్లాసు తీసుకురాలేదు. అన్నీ అక్కడే వున్నాయి. కలిసి తిందాం, కలిసి తాగుదాం అన్నట్లు.

శ్రీమహాలక్ష్మి చేతినిండా గాజులున్నాయి. వాటిని సవరిస్తూ అతను నిశ్శబ్దంగా వుండిపోయాడు.

అసలు ఏ ముఖపరిచయమూ లేనివాళ్ళు, అప్పుడే వివాహబంధంతో ముడిపడి ఒకటైనవాళ్ళు ఏవిధంగా వుంటారో తెలీదుగానీ, శ్రీమహాలక్ష్మి, పాణిగ్రాణి ఇద్దరూ తమ పరిధిలోంచి బయటికి రాలేకపోతున్నారు.

పాణిగ్రాహి ఓసారి తలవిదిల్చి బెరుకుపోగొట్టుకున్నాడు. శ్రీమహాలక్ష్మిని తను ముద్దు చేశాడు. ప్రేమించాడు. ఆమెకి మంచీ చెడూ చెప్పాడు. మగపిల్లాడి మనస్తత్వంలోంచి బయటికి వచ్చేట్లు చేశాడు. ఇన్ని చేసినా ఆ పిల్లని కాంపౌండ్‌లో పక్కింటి అమ్మాయిగానే చూశాడుగానీ ఈ పిల్ల నాది అనుకోలేకపోయాడు.

శ్రీమహాలక్ష్మి తండ్రి దుర్భేద్యమైన కోటలా ఆమెకీ తనకీ మధ్య వుండడంవల్లనో ఏమో తన అంతరంగం మూగబోయి వుండి వుండాలి.

"శ్రీమహాలక్ష్మీ! మన ఇంట్లో నీకు కావలసినవి అందుబాటులో వుంటాయో లేదో. నీకు ఏది కావాలన్నా నన్ను నిర్భయంగా అడుగు. తెచ్చి ఇస్తాను'' అన్నాడు.

శ్రీమహాలక్ష్మి తలెత్తి, అతనివైపు చూసింది. అతని మొహంలో సిన్సియారిటీ వుంది.

స్వచ్ఛమైన ప్రేమ వుంది.

పెళ్ళి ముడికి ముందూ, తర్వాతా ఒకేరకంగా ఒకే ధోరణిలో అరచేతిలో నిమ్మపండును చూసుకుంటున్నట్లు ఎక్కువ కేర్ తీసుకుంటూ అతనామె మొహాన్ని దోసిళ్ళ మధ్యలోకి తీసుకుని సుతారంగా నుదుటిమీద ముద్దాడాడు.

శ్రీమహాలక్ష్మి అప్రయత్నంగానే కళ్లు మూసుకుంది.

★ ★ ★

ఘొల్లున నవ్విన శబ్దం విని వులిక్కిపడింది.

అప్పటికే అతను నిద్రపోతున్నాడు.

"హలో! శ్రీమహాలక్ష్మి వాట్ హాపెండ్



టు యువర్ డిజైర్స్... పూర్ శ్రీమహాలక్ష్మి నీవి గొంతెమ్మ కోరికలు. ఉట్టికెగర లేనమ్మ స్వర్గానికి ఎగిరిందిట. ఎన్నెన్ని ఆశలూ, ఎన్నెన్ని ఆశయాలూ రియల్లీ... ఐ పిటీ యూ..."

మరోసారి తృళ్లిపడింది. ఒంటినిండా బొద్దింకలు పాకుతున్నట్లు స్నానం చేయాల నిపించింది. క్షణం ఆలస్యం చేయకుండా బాత్‌రూమ్‌లోకి పరిగెత్తింది. రెండు బకెట్ల నిండా చన్నీళ్లు తీసుకుని సబ్బు, కుంకుడు కాయ పొడి, సున్నిపిండి, పసుపూ అన్నిటితో తలారా స్నానంచేసి మరోచీర కట్టుకుని బయటికి వచ్చింది.

అతను గాఢనిద్రలో వున్నాడు.

ఇరుకులో వున్నట్లూ, వూపిరి ఆడనట్లూ అలజడిగా వుంది ఆమెకి. ఇంతసేపూ తనని ఎత్తిపొడిచిందీ, తనని చూసి నవ్విందీ మరె వరో కాదు తన అంతరాత్మే.

మంచం దగ్గరే నిలుచుని కాసేపు తటపటా యించింది. అతను నిద్రలేస్తే తనని చూసి బాధపడతాడు. చప్పున మంచంమీద వాలి పోయింది. అసలు ఏమీ జరగనట్లే.



తెల్లవారకుండా లేచింది శ్రీమహాలక్ష్మి. అప్రయత్నంగా బయటికి తొంగిచూసింది. అమ్మ వాకిలి తుడవడం లేదేమిటి? ఒంట్లో గానీ బాగోలేదా? తనకీ ఒంట్లో బాగులేనట్లే వుంది. బద్ధకంగా వుంది. లేవాలని లేదు. పొద్దెక్కిపోతోంది. లేచి వాకిలి సంగతి చూ డాలి. కాఫీ కాచాలి. అబ్బ! ఎవరైనా ఈ పనులన్నీ చకచకా చేసిపెడితే దండం పెడు తుంది.

తలుపు దగ్గర అత్తగారు.

వాస్తవంలోకి రాగానే కొరడాతో కొట్టినట్ల యింది.

ఏళ్లతరబడి ఆ ఇంట్లో గడిపింది. ఒక్క సారి తను వేరేచోట వున్నట్లు ఎలా అను కుంటుంది? మెడతిప్పి ఇటుచూస్తే పాణి గ్రాహి పక్కబట్టలన్నీ శుభ్రంగా మడతలుపె ట్టి ఎక్కడ సామాను అక్కడ సర్దేసి అద్దంలా పెట్టేశాడు.

"శ్రీమహాలక్ష్మి కాఫీ రెడీ"

రాజేశ్వరమ్మ కొడుకు చేతుల్లో రెండు గ్లాసులు చూసింది.

"నీకూ దానికీ" అన్నాడు అతను.

శ్రీమహాలక్ష్మి కెవ్వుమనబోయి నోరు మూసుకుంది.

దానికి, అది, ఏమే, ఒసేయ్... లాంటివి వ్యక్తిత్వానికి విలువ ఇవ్వని పదజాలం. మర్యాద ఇచ్చిపుచ్చుకోవడంలో వుంటుంది.

ఏమండీ, మీరూ, దొర, వారు, స్వామి ఎన్ని పదాలు? ఎందుకీ వ్యత్యాసం? మగవా డు. మగడు. సో వాట్ భౌతికంగా భిన్నంగా వుండవచ్చుగాక, ఆలోచనలూ, అలవాట్లు ఒకలా వుండవా?

పోనీ అతని బయలాజికల్ ఫంక్షన్స్ విడి గా వుంటాయా? అతను గుండ్రాళ్లని జీర్ణం చేసుకుంటే ఆడవాళ్ళు సుతారంగా వుండి కనీసం నీళ్లు కూడా తాగలేరా?

"ఏమిటి ఆలోచిస్తున్నావు? మీ అమ్మగా ర్ని చూడాలని వుందా? వెళ్ళిరా. ఒక్కపరు గు తీశావంటే ఆ ఇంట్లో వుంటావు. కాఫీ తాగి వెళ్ళిరా."





శ్రీమహాలక్ష్మికి నీరసం వచ్చేసింది. 'దానికి' అన్నందుకు బుసకొట్టిన అహంకారం అతని ఆప్యాయతకి తలదించేసుకుంది. పాణిగ్రాహీ! నిన్ను నేను అర్థం చేసుకోలేను అనుకుంది మనసులో.

రాజేశ్వరమ్మ కూడా చెప్పింది. "శ్రీమహాలక్ష్మీ వెళ్ళి మీ అమ్మని ఓసారి చూసిరామ్మా''

శ్రీమహాలక్ష్మి కాఫీ రెండు గుక్కల్లో తాగేసి బయటపడింది. తను వర్థి ఫూల్. ఆ తల్లీకొడుకులు ఇద్దరూ గొప్పవాళ్లు. తనో బ్రూట్. ఓ నిర్ణయానికి రాలేదు. ఓ నిర్దిష్టమైన అభిప్రాయాన్ని స్పష్టంగా ఏర్పరచుకోలేదు. గాలిపటంలా ఏ గాలెటు వీస్తే అటే. అసలు ఈ మనసే మంచిది కాదు. శ్రీమహాలక్ష్మి మంచిదే. తనను తనే విశ్లేషించుకునేలోగా తల్లి రెండు చేతులూ చాపడం అందులో ఇమిడిపోవడం జరిగిపోయింది.

ఆవిడ గబగబా పొయ్యి అంటించి కాఫీ కాచి ఇచ్చింది.

తీపి మరీ ఎక్కువైంది, అమ్మకి కూడా ప్రేమ ఎక్కువైనట్లుంది.

"పాణిగ్రాహి బంగారు తండ్రి. ఒక్క కాణీ అప్పు చేయనీయలేదు. ఖర్చు పెట్టనీయలేదు. రాజేశ్వరమ్మ కూడా మహా గొప్ప మనిషి. కష్టసుఖాలు తెలిసిన ఇల్లాలు."

ఒళ్లు మండిపోయింది శ్రీమహాలక్ష్మికి. కాఫీ గ్లాసు విసురుగా పెట్టేసింది. సుభద్రమ్మ తెల్లబోయి చూసింది.

"పాణిగ్రాహి బంగారు తండ్రి'' వెక్కిరిస్తున్నట్లే అంది. "నువ్వు పుట్టక ముందునుంచీ ఈ దిక్కుమాలిన వరకట్నం ఏడుస్తోంది. అందుకే మగాడు అనగానే త్రాసులో కూర్చోబెట్టి వాడికెంత ధర పోయాలి అనే ఆలోచన మన నరనరాల్లోనూ జీర్ణించుకుపోయింది.

పెళ్లి అనగానే డబ్బు ఎందుకు జ్ఞాపకం రావాలి? ఆడదే డబ్బు ఎందుకు ఇవ్వాలమ్మా. తనని జీవితం అంతా పోషిస్తాడనా? ఏం ఎందుకు పోషించకూడదూ? తనకీ, తన ఇంటి వాళ్ళకీ అందరికీ వండి, వడ్డించీ వార్చిపెడుతుంది. తనవాళ్ళ బట్టలు ఉతుకుతుంది. వూడిగం చేస్తుంది. అడుగులకి మడుగులు ఒత్తుతుంది. తన సంతానాన్ని వృద్ధిలోకి తీసుకువస్తుంది. తన వంశవృక్షాన్ని పెంచుతుంది. ఆఖరికి పక్కలో చేరి సకలసౌఖ్యాలూ అందిస్తుంది. ఇన్ని చేసింది చాలక వీటికి ముందే సుంకం చెల్లించడం అన్యాయం ఈ మగజాతికి''

సుభద్రమ్మ చెంపలు వేసుకుంది. "నేరకపోయి అన్నాన్రా దేవుడా'' అని.

శ్రీమహాలక్ష్మి కళ్లమ్మట నీళ్లు వచ్చాయి. ఉక్రోషం, చేతకానితనం. సబ్‌కాన్షస్‌లో నిస్సహాయత. ఓడిపోయామనే బెంగ. డాక్టర్నిగానీ, ఇంజనీర్నిగానీ చేసుకోలేదన్న నిరాశ... అన్నీ కలిపి అనవసరంగా, అసందర్భంగా మాట్లాడేట్లు చేశాయి.తల్లి నోరెత్తకపోవడంతో ఆమెవైపు చూసింది.

తెల్లచీర ముసుగు వేసుకుని గుడ్లనీరు గుడ్లల్లోనే దాచుకునే ప్రయత్నం చేస్తోంది ఆవిడ.

శ్రీమహాలక్ష్మి ఆమె ముడుచుకున్న ఒళ్లో దూరిపోయి "క్షమించు అమ్మా'' అంది. ఆవిడేం మాట్లాడుతుంది? ఆవిడకీ తెలుసు కూతురి ఆశలూ, ఆశయాలూ! ఎర్రని ఏగానీ లేని తను డాక్టర్ని తీసుకురావడమే?

ఆవిడ గుండె ఝల్లుమంది. ఈ అసంతృప్తి ముందు ముందు శ్రీమహాలక్ష్మి జీవితంలో ఏ ప్రళయం సృష్టిస్తుందో అని. ఆవిడ కనిపించిన దేవుడికి నమస్కారం చేస్తూ ఓసారి చెంపలు వేసుకుంటూ మరోసారి కూతురి వీపు ప్రేమగా నిమురుతూ వుండిపోయింది.

శ్రీమహాలక్ష్మి లేచింది. "వెళ్ళొస్తానమ్మా'' అంటూ. గుమ్మంలో నిలుచుని వెళ్ళే కూతురువైపు చూస్తూ సుభద్రమ్మ అనుకుంది. "ఓ నలుసు పుడితే అన్నీ అవే

సర్దుకుంటాయి''



చలపతి ఆఫీసర్ అయ్యాడు. బ్యాంక్ ఉద్యోగి కనుక అతనికి వున్న సౌకర్యాలవల్ల ఇంటికి కావలసిన వస్తువులన్నీ అమర్చుకోగలిగాడు. సబిత అతని ఇష్టానికి గౌరవం ఇస్తుంది. అతనూ అంతే. ఆమె చెప్పిందే వేదం అనుకుంటాడు.

భార్యాభర్తల మధ్య ఎక్కువ తక్కువలు వుండకూడదు. ఎంత మమేకం చెందినా ఒకరి ఇష్టాల్ని మరొకరు గౌరవిస్తూ ఒకరి ఆశయాల్ని మరొకరు అర్థం చేసుకుంటూ గడపడంలో వుండే సౌఖ్యాన్ని ఆ ఇద్దరూ గ్రహించారు.

స్త్రీ వంటింటి కుందేలు కాదని చలపతికి కూడా తెలుసు. అయినా శారీరకంగా మానసికంగా స్త్రీకీ పురుషుడికీ వున్న బేధాన్ని అతను తన కోణంలోంచి ఆలోచిస్తాడు.

"నువ్వు పిల్లల్ని చూసుకో సబితా! ఇంట గెలిచి రచ్చ గెలవమన్నారు. మనం పిల్లల్ని చక్కదిద్దుకుంటే భావిపౌరుల్ని తయారు చేయడంలో మనవంతు కృషిచేస్తే దేశసౌభాగ్యానికి వేసిన మెట్లల్లో మనమూ ఒకళ్లం అవుతాం

"స్కూల్లో పొద్దున్నుంచీ సాయంత్రంవరకూ పిల్లలతో అరచి, గీపెట్టి వాళ్లని ఓ త్రోవలోకి తీసుకువచ్చేందుకు హైరాన పడిపోతూ, కాలాన్ని పట్టుకోవాలని పరిగెడుతూ ఎందుకు వచ్చిన శ్రమ. మానేసేయ్'' అన్నాడు.

సబిత నవ్వింది "మీరు మరీ అతిగా ఆలోచిస్తున్నారేమో. నేను ఆరోగ్యంగానే వున్నాను. వేణ్ణీళ్లకి చన్నీళ్లు. ఆరోగ్యంగా వయసులో వున్నప్పుడే ఏ పనైనా చేసి నాలుగురాళ్లు వెనకేయడం"

"ఇన్నాళ్లూ నువ్వు కష్టపడ్డావంటే అర్థం వుంది. జీతం సరిపోక ఇబ్బంది పడిపోతామేమో అని. 'ఆన్ ఆల్‌జాబ్స్ బ్యాంక్ జాబ్ యీజె గోల్డెన్ జాబ్ అని' మా నాన్నగారి ఫ్రెండ్ అనేవారు. అది అక్షరాలా నిజం. జాగ్రత్తగా చేసుకుంటే ఇట్టే ఇల్లు కట్టి, అట్టే పెళ్ళిళ్లూ చేసేయచ్చు''

"ఇంట్లో కూర్చుంటే బోర్ కొట్టదా చెప్పండి''

"నో, బోర్ కొట్టదు. తెల్లవారేసరికి అన్నిపనులూ ముగించి ఇటు నన్నూ, అటు పిల్లల్నీ పంపేసి ఆపైన ఛోటా, మోటా పనులు కానిచ్చేయ్. ఇంకా చదివేందుకు బోల్డు సదుపాయాలున్నాయి. ఎక్స్‌టర్నల్స్, ప్రైవేట్ పరీక్షలూ ఇలా ఎన్నో వున్నాయి. చదివేసేయ్. చదువుకున్న భార్య, చదువుకున్న తల్లీ వుంటే సరస్వతీ నిలయమే ఆ ఇల్లు''

"అతిశయోక్తేమో''

"లేదు సబితా! నువ్వు అలసిపోతే పిల్లలు సరిగా పెరగలేరు. వాళ్లపట్ల నిర్లక్ష్యం ఏర్పడుతుంది. సైకలాజికల్‌గా పిల్లలు ఇబ్బందులకి గురి అవుతారు''

"మీ ఇష్టం"

అతనామె చేతిని తన చేతిలోకి తీసుకుని తన పక్కనే సోఫాలో కూర్చోబెట్టుకున్నాడు. అతని స్పర్శ, అతని మాటలు ఆమెకి కొండంత అండ. తల్లీ తండ్రీ తనవాళ్ళూ ఎవరూ గుర్తుకు రారు ఆమెకి. అతను మర్రిచెట్టులాంటివాడు. తన శాఖోపశాఖలతో ఎంత దూరం విస్తృతం అయి నీడని ఇవ్వాలని తాపత్రయపడుతుందో చలపతీ అంతే. తనవాళ్ళు, తన స్నేహితులు, తన బంధువర్గం ఇలా అందర్నీ తన మంచితనం, సహకారంలాంటి వూడలూ కొమ్మల్తో ఆశ్రయం ఇస్తాడు. అతను ఎక్కడుంటే అక్కడ సుఖసంతోషాల ఘుబాళింపు వుంటుంది. సబిత అతనికి తలలో నాలుకే ఒకేమాట, ఒకే ఆలోచనా సరళి. ఒకళ్లకోసం మరొకళ్లు జన్మనెత్తారేమో అనిపిస్తుంది.

సబిత హాయిగా వుంది ఇప్పుడు. ఆవిధంగా ఉద్యోగానికి స్వస్తి చెప్పింది. రేపో మాపో కారు కొనే ఆలోచనలో వున్నాడు





చలపతి. మొదటే చెప్పినట్లు అతని తల్లి కుసుమాంబ చాలాకాలం అతని దగ్గర వుండలేకపోయింది. సబితకి పురుడూ, పుణ్యం అయ్యేవరకూ వుండి వెళ్ళిపోయింది. ఆమెకి కొద్దిగా పొలం, ఓ ఇల్లు, పాడీపంటా వుండేవి. పుట్టింటివారు ఇచ్చారన్న అభిమానంతో అమ్మేందుకు ఇష్టపడేది కాదు. కొడుకోచోట, తనోచోట. కన్నపేగు కరకరమంటూంటే ఓ శుభముహూర్తాన వాటిని అమ్మేసి కొడుకూ కోడలి దగ్గరికి వచ్చేసింది.

చలపతిది ఇప్పుడు కడుపులో చల్ల కదలని సంసారం. కాలం గడుస్తుంటే చలపతీ సబితా మళ్ళీ యౌవ్వనంలోకి అడుగుపెడుతున్నట్లు తయారు అవుతున్నారు. చీకూ చింతా లేని సంసారం.

సబిత అత్తగారికి కథలు చదివి వినిపిస్తోంది. ఆవిడ వుయ్యాల బల్లమీద సుఖంగా పడుకుని వింటోంది.

★ ★ ★

యతి, మనోహరి స్కూల్లో పనిచేసిన అనుభవంతో స్వయం ఉపాధిపథకంలాంటి ఉద్దేశ్యంతో చిన్న స్కూలు ప్రారంభించారు.

కాంపౌండ్‌లోనే వుంటూ మరో రెండు ఇళ్ళు అద్దెకు తీసుకున్నారు. ఆ చుట్టుపక్కల దగ్గర్లో అందుబాటులో వున్న ఫీజుతో ఇంగ్లీషు స్కూలు లేకపోవడంతో కాంపౌండ్‌లో వాళ్ళకీ మనోహరి, యతికీ మధ్య చదువుల తల్లి వారధి అయింది.

"యతీ..." మనోహరి అతన్ని పిలిచింది. చేస్తున్న పని ఆపేసి పరిగెత్తి వచ్చి వాలాడు అతను. "స్కూలుకి కావలసిన మొత్తం ఫర్నిచర్ వచ్చేసింది. పేపర్లో టీచర్లకోసం ప్రకటన వేయించాను'' అంది ఆటో దిగుతూ.

ఆమె వెనుకే రిక్షాల్లో బోలెడు ఫర్నిచర్.

యతి స్కూల్లో పనిచేసే అటెండర్లతో వాటిని రూముల్లోకి సర్దిస్తున్నాడు. మనోహరి కొడుకు తల్లితండ్రులు చెప్పే పనులు చేస్తున్నాడు.

"నాన్నగారూ! నేను కూడా మన స్కూల్లోనే చదువుతానండి'' అన్నాడు ద్వారక.

"ష్'' యతి నోటిమీద వేలు వుంచాడు.

మనోహరి పనివాళ్ళని పంపించేసి రసీదులు యతి చేతిలో పెట్టింది.

మనోహరి స్నానంచేసి వచ్చేసరికి యతి వంటచేసి వుంచాడు. యతికి 'బేరం' ఆడడంరాదు. ఒక్కో సందర్భంలో వందలు వదులుకోవడం కూడా జరిగింది. అందుకే మనోహరి ఆ బాధ్యతను తీసుకుంది.

భోజనాలు చేస్తున్నప్పుడు ద్వారక తండ్రితో మళ్ళీ అన్నాడు. "నేను కూడా మన స్కూల్లోనే చదువుతాను నాన్నగారూ''

భోజనం చేయడం ఆపేసి "ఒద్దు ద్వారకా నువ్వు నీ స్కూల్లోనే చదవాలి. అది చాలా రిచ్ స్కూలు. నువ్వు చూడు ఇంగ్లీషు ఎంత బాగా మాట్లాడతావో అదే మనస్కూల్లో అయితే కష్టం"

"కష్టం ఎందుకు నాన్నగారూ''

"మన స్కూలుకి వచ్చే పిల్లలు పేదవాళ్ళు. వాళ్ళు సరిగా తినలేరు. వాళ్ళకి ఈ తిండిలోపంవల్ల ఆరోగ్యం కూడా బావుండదు. ఐక్యూ, తక్కువగా వుంటుంది. అందుకే వాళ్ళు బాగా చదువుకోలేరు''

"పాపం"

"పాపమే! ఏం చేస్తాం? వాళ్ళదృష్టం అది''

వాడికి పూర్తిగా అర్థంకాలేదు. ప్రతి వ్యక్తీ బిజినెస్ మైండ్‌తోనే ఆలోచించడం జరుగుతోంది. అన్నిటికంటే అతి లాభకరం అయింది, కేవలం విద్యావ్యాపారం మాత్రమే.

ఈ సూక్ష్మమైన సత్యాన్ని మనోహరీ, యతీ ఆకళింపు చేసుకున్నారు. క్రమంగా బాంక్ బాలన్స్ పెరుగుతుంటే మనోహరీ, యతీ ఇల్లు పెళ్ళివారిల్లులా వుంది.

మనోహరి బడ్జెట్ బుక్‌ని ఓసారి చూసి "దీపం వుండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి. డబ్బు విషయంలో చాలా ఖచ్చితంగా వుండాలి. రాళ్ళు కరిగే కష్టాల్ని ఏకరువుపెట్టినా రాయిలా వుంటే తప్ప మనం చేరుకోవలసిన గమ్యాన్ని చేరుకోలేం" అంది.

యతి చిన్నగా నవ్వాడు "పక్కా బిజినెస్ మైండ్"

మనోహరి అతని భుజంమీద తలవాల్చింది. "డబ్బు లేక భోజనం చేయని రోజులు నన్నీజీవితం అంతా వెంటాడుతూనే వుంటాయి. కష్టపడి పనిచేసే వాళ్ళకి ఓటమి వుండదు"

"ఇవాళ మధ్యాహ్నం పాణిగ్రాహి వచ్చాడు"

మనోహరి చప్పున భర్త మొహంలోకి చూసింది.

"వందరూపాయలు అడిగాడు. యాభై ఇచ్చాను"

"అదిగో... అక్కడే నాకు కోపం వస్తుంది. ఎన్నిసార్లు ఇలా. ఎప్పుడూ తీసుకోవడమే గానీ తిరిగి ఇవ్వడం వుంటుందా"

"మనూ! ఈ కాంపౌండ్‌లోకి వచ్చిన కొత్తలో మనల్ని ఆదుకున్నది వాళ్ళే. ఆ సంగతి మరిచిపోకు, వాళ్ళే లేకపోతే మన సిద్ధాంతాల్నీ జనం వక్రీకరించి 'లేచి వచ్చేశాం' అని చెప్పి తన్ని తగలేసేవాళ్ళు. శ్రీమహాలక్ష్మికి ఇప్పుడు నెలలు నిండుతున్నాయి. ఏ అర్ధరాత్రో, అపరాత్రో పురుడువస్తే చేతిలో నయాపైసలేకుండా అతను ఏంచేయగలడు"

"అందుకే అంటాను దీపంవుండగా ఇల్లు చక్కదిద్దుకోవాలని. మొదటి ఇద్దరు పిల్లల పుట్టిన రోజులకీ కాంపౌండ్ ప్రజలందర్నీ భోజనాలకి పిలవకపోతేనేం? ఆర్భాటాలకి పోవడం దేనికి? జీతం వచ్చినరోజున ఎప్పుడైనా ఇంట్లో వున్నారా? హొటళ్ళూ, సినిమాలు"

యతి కోపంగా చూశాడు. "వాళ్ళు చేసింది కరెక్ట్ అవునో కాదో నాకు తెలీదు మనూ. మధ్యతరగతిలోంచి వచ్చినవాళ్ళమే మనం అందరం. ప్రతి మనిషికీ కోరికలు వుంటాయి. ఆకాశాన్నందుకునేవాటినెలాగూ అనుభవించలేం. ఓ సినిమా, ఓ హొటలూ యివేవీ తీరని కోరికలు కావు. మనిషి నిరంతరం ఈ ఆర్థిక వలయంలో చిక్కుకుపోయి 'శ్లేష్మంలో ఈగ'లా తన్నుకుచావక్కర్లేదు. నెలకోసారి కొంచెం రిలీఫ్ కోసం ఓ యాభై ఖర్చుపెట్టడాన్ని పెద్ద నేరంగా చిత్రీకరించఖర్లేదు. ఆ విషయంమీద మనం పెద్దగా విమర్శ చేయనవసరంలేదు"

"మధ్యలో మీకు బాగా కోపం వస్తోందే?"

"డబ్బుని గుప్పిట్లో పెట్టుకుని గతం మరిచిపోతే బాధేస్తుంది"

"ప్లీజ్ యతీ! నన్నర్థంచేసుకోండి. మనం దెబ్బలాడుకోవద్దు. ఆలుమగలు అంటే అరమరికలు లేకుండా కాపురం చేస్తూ స్వర్గాన్ని సంసారంలోనే చూసేవాళ్లూ, అనుభవించేవాళ్లూ. మీరు ఎలా చెబితే అలాగే చేస్తాను. పాణిగ్రాహిమీద నాకు కోపం లేదు. శ్రీమహాలక్ష్మి, పాణిగ్రాహీ మనకి ప్రాణస్నేహితులు. వాళ్ళేం పరాయివాళ్ళు కాదు. ఇటు చూడండి" అంది చిన్న నోట్‌బుక్ చూపిస్తూ. యతి ఆవైపు కుతూహలంగా చూశాడు. అందులో ఐదు పదీ పైసలు దగ్గర్నుంచి విశదంగా రాసి వుంది. ఆ నెల్లో వచ్చిన చుట్టాలు, తమదగ్గర బదులుగా తీసుకున్న వాళ్ళు, ఖర్చుకోసం అనిచెప్పి తీసుకున్న మనోహరి తమ్ముడు, యతి చెల్లెలు, తల్లి తండ్రులకి పంపిన డబ్బు... మొత్తం కూడేసరికి యతి కళ్ళు బైర్లుకమ్మాయి.

అతను ఆమె చేతిని అందుకుని తన పక్కనే కూర్చోబెట్టుకున్నాడు. "సారీ డియర్. ఈ లెక్కా పత్రాలు నేను రాశానేగానీ అంత డీప్‌గా తీసుకోలేదు. చాలా ఖర్చుపెట్టాం. అందులో మనకంటూ ప్రత్యేకం అయిన ఖర్చులేదు"





ద్వారక హెూంవర్క్ పూర్తిచేసి ఆవలించి ఒళ్ళు విరుచుకున్నాడు. మనోహరి గబగబా భోజనాలు సిద్ధంచేసింది.

అరగంటలో అన్ని పనులూ పూర్త య్యాయి. ద్వారక పక్కగదిలోకి వెడుతూ 'గుడ్‌నైట్ చెప్పాడు. యతీ మనోహరీ తలుపు వేసుకున్నారు. ప్రైమరీస్కూలు, అప్పర్‌ప్రైమరీ స్కూలు అయింది. క్ర మంగా హైస్కూలు, జూనియర్ కాలేజ్, డిగ్రీ కాలేజ్, రెసిడెన్షియల్ కాలేజ్, స్టాఫ్, అడ్మినిస్ట్రే షన్ హంగులూ, హంగామా వీటిచుట్టూ పకడ్బందీగా ప్లాన్‌చేస్తున్నారు ఇద్దరూ యంత్రాల్లా పనిచేయడం అలుపు ఎరగకపో వడంతో ఇద్దరూ తమ తెలివితేటల్నీ, నైపు ణ్యాన్నీ, పునాది రాళ్ళుగా చేశారు. ఇప్పుడ క్కడ కాంక్రీటులాంటి నికరాదాయం, లాభా లూ పోగు అవుతున్నాయి.

రాత్రి బాగా పొద్దుపోయేవరకూ లెక్కల్లో మునిగితేలడం తెల్లవారు ఝామున లేచి తాము తీసుకుంటున్న డబ్బుకి న్యాయం చేయడం కోసం పాఠాల్ని నెమరువేసుకోవ డంతో క్షణం తీరిక లేని జీవితాన్ని గడుపుతు న్నారు.



**పాణిగ్రాహితో** సంసారంలోకి అడుగుపె ట్టిన కొత్తలో అసంతృప్తితో అలజడితో, అత నితో జీవితాన్ని గడపడం అంటే దుర్భరం అనుకునేది శ్రీమహాలక్ష్మి కానీ పాణిగ్రాహికి ఆమె పైన ప్రేమ ఆమెని ఎప్పటికప్పుడు నిలదీసేది.

"నిన్ను ప్రేమించేవాడు నువ్వు ప్రేమించే వాడికన్నా గొప్పవాడు'' అనేది సబిత.

శ్రీమహాలక్ష్మి గతాన్ని తలుచుకుని నవ్వు కుంది. అత్తగారు హఠాత్తుగా పోవడంతో తల్లిని తనదగ్గరే వుంచుకుంది. పెద్దవాడు పరశురామ్, రెండో కాన్పులో వైష్ణవి పుట్టింది. మళ్ళీ ఆరేళ్ళకి అనుకోకుండా కడు పుతో వుంది. మళ్ళీ నవ్వుకుంది. అనుకోకపో వడం ఏమిటి. పిచ్చికాకపోతే... దాదాపు తొమ్మిది నెలల క్రితం జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది ఆమెకి.

సుభద్రమ్మ వంటింట్లోంచి కాఫీ తీసుకువ చ్చి కూతురికి యిచ్చింది. "స్కూలుకి సె లవు పెట్టకూడదూ''

"వీలు కాదమ్మా''

అప్పుడే వచ్చిన పాణిగ్రాహి చేతుల్లో పువ్వులూ, పళ్ళూ, మిఠాయి బాక్స్ వున్నాయి. శ్రీమహాలక్ష్మి చేతికి యిస్తూ "కాస్సేపు రిలాక్స్ అవాల్సింది శ్రీమహాల క్ష్మి'' అన్నాడు ఆప్యాయంగా.

శ్రీమహాలక్ష్మి జరిగి చోటుయిచ్చింది. అతను పక్కన కూర్చోబోయి''వొద్దులే బరు వుకి మంచం ఏదైనా అయితే కష్టం. శ్రీమహా లక్ష్మి నీకు ఐస్‌క్రీమ్ తీసుకువద్దామనుకున్నా ను. పిల్లలకి కూడా తినాలనివుంటుందని తీసుకురాలేదు''

"డాడీ'' పరిగెత్తుకువచ్చి అతన్ని చుట్టేశా రు. వైష్ణవి అతన్ని కుర్చీలో కూర్చునేవరకూ విసిగించింది. ఆ తర్వాత హాయిగా ఒళ్ళో కూర్చుంది. పరశురామ్ కూడా ఆ ఒళ్ళోనే సర్దుకున్నాడు.

"డబ్బు ఎక్కడిదండీ'' శ్రీమహాలక్ష్మి తా రీఖుచూస్తూ అడిగింది.

"అలా కాలండర్‌వైపు చూడకు శ్రీమహాల

క్ష్మీ, ముందు నీకు పురుడురానీ ఆ తర్వాత నేను మంచి జాబ్ చూసుకుంటాను''

ఆమె మాట్లాడలేదు. కొన్ని పూలు దేవుడికీ, వైష్ణవికీ పెట్టి కొన్ని తను పెట్టుకుంది. మిఠాయి అందరికీ పెట్టేసరికి అయిపోయింది.

పాణిగ్రాహి తన వంతుది కూడా ఆమెకే యిచ్చాడు. ఆమె అడగకుండానే ఆమెకి ఏవి కావాలో అమర్చిపెడతాడు. అతను తన తండ్రికంటే కూడా ప్రాణప్రదంగా చూసుకుంటున్నాడు. తను చేయలేదని బట్టలు వుతికి ఆరేస్తున్నాడు. అంట్లుతోముతున్నాడు. అత్తగారు వారించినా వినడంలేదు అతను. "మనింటి పని మనం చేసుకోవడంలో ఆడా మగా ఏమిటి అత్తయ్యా''

ఆవిడ లబలబలాడింది. "మగపిల్లాడు మీరు. వీధి వాకిలి వూడ్చి ముగ్గుపెట్టకండి''

"ఫరవాలేదు అత్తయ్యా! మన వాకిలే కదా! మరో రెండుమూడు నెలలు ఓపికపడితే పనిపిల్లని పెట్టుకోవచ్చు''

శ్రీమహాలక్ష్మి కళ్ళు చెమ్మగిల్లాయి. "మీరు మరీ నన్ను అవమానం చేస్తున్నారు''

అతను వులిక్కిపడ్డాడు "నేను... నేను నిన్ను... నిన్ను అవమానం చేయడమా! నెవ్వర్. నిన్ను నా ప్రాణంకంటే ఎక్కువగా చూసుకుంటాను శ్రీమహాలక్ష్మీ''

"కాదనడంలేదండీ. ఈ ప్రేమ మోతాదు ఎక్కువైనా నేను బాధపడతాను. గిల్టీకాన్షస్. మిమ్మల్ని నేను చాలా తేలికగా చూశానన్న బాధ. మీరు ఎందుకూ కొరగారన్న దురభిప్రాయం"

"నో' అతను వారించాడు. "శ్రీమహాలక్ష్మీ... అనవసరంగా మనసులో లేనిపోని ఆలోచనల్ని రానీయకు. నేను ముందు స్నేహితుణ్ణీ, ఆ తర్వాతే మొగుణ్ణి. నువ్వు ఇప్పుడు మామూలు మనిషివి కూడా కాదు. నీ కోసం ఏం చేసినా తక్కువే'





శ్రీమహాలక్ష్మి అతనివైపు ఆరాధనగా చూసింది. ఇక ఈ జన్మకి పెళ్ళికాదనీ, ఒంటరిగా తోడులేకుండా బతకడం దుర్లభం అనీ తప్పనిసరి పరిస్థితుల్లో అతన్ని చేసుకుంది. కలిసి జీవించడం ప్రారంభించేక కృతజ్ఞతాభావం ప్రేమగా మారిపోయింది.

అతను పైచదువు చదవమంటే బద్ధకిస్తాడు. ఎంత కాలం ఈ గొర్రెతోక బెత్తెడు జీతం? ఎంతకాలం? ఒకటికి రెండు అంతకంటే ఎక్కువే 'నోళ్ళు' ఏర్పడ్డాయి. ఒకే ముక్కని రెండుగా పంచుకునే వాళ్ళు. ఇప్పుడు ఐదు అయాయి. రేపు మరోబిడ్డ పుట్టబోతోంది. ఆ బిడ్డకు బోలెడు అవసరాలు. తెలియని విషయమా ఇది. చిన్నప్పుడే ఇంగ్లీషు టకటకా మాట్లాడేయాలని పిల్లల్ని కాన్వెంట్ స్కూల్లో చేర్పించింది. ఆంగ్లవాఙ్మయం పట్ల అభిరుచి, ఇంగ్లీషు వ్యామోహం. తండ్రి దగ్గర్నుంచి పుణికిపుచ్చుకున్న వారసత్వం అక్కరకురాని భేషజం.

మంచంమీంచి లేచింది పిల్లల్ని తయారు చేసింది. వాకిట్లో 'రిక్షా' ఆగింది. తండ్రి తనని కూడా ఓ సమయంలో 'టాంగా'లో పంపాడు.

పాణిగ్రాహి స్నానం చేసి ఆదిత్యహృదయం చదువుతూ సూర్యనమస్కారం చేస్తున్నాడు. అదో అరగంట ప్రహసనం. ఆమెకి కోపం తెప్పిస్తుంది. ఏ పనీ త్వరగా చేయడు. వంటింట్లోకి జొరబడితే పాటలు పాడుకుంటూ వంటకాలు రుచికరంగా చేయడంలో నిమగ్నం అయిపోతాడు. అందుకే వంట వచ్చిన మగవాడంటే శ్రీమహాలక్ష్మికి అసహ్యం. అతనికి ఉద్యోగంమీద అంత శ్రద్ధ వుండడంలేదు.

★ ★ ★

మరే పనైనా చేయమంటే దిక్కులు చూసే పాణిగ్రాహి వంట విషయంలో ఫస్ట్. కొన్ని ఇళ్లల్లో మగవాడి జన్మహక్కుగా వంటవచ్చి వుంటుంది.

అతను తయారైవచ్చేసరికి తను సిద్ధంగా వుంది. ఎంతో ఇష్టంగా కొనుక్కున్న మోటర్

సైకిల్ అమ్మేయాల్సివచ్చింది. తప్పదు. ఆర్థిక న్యాయం ఎలా చెబితే అలా చేయాల్సి వస్తుంది.

నడిచి వెళ్లడం ఆరోగ్యానికి మంచిది.

ఈజీగా డెలివరీ అవుతుంది.

సాకులే ఇవన్నీ. చేతిలో ఎర్రని ఏగానీ లేకపోతే చెప్పుకునే సాకులు.

ఆయాసం వస్తోంది. అక్కడే రోడ్‌మీద కూర్చోవాలని వుంది. పాణిగ్రాహి ఆమె చే తిని పట్టుకుని "ఇంటికి వెళ్లిపోదామా'' అని అడిగాడు.

శ్రీమహాలక్ష్మి అతికష్టంమీద బుర్ర వూపింది. ఆమె చీర తడిసిపోతోంది. "అ య్యో ఇంటికి వెళ్లలేం రిక్షాలో హాస్పిటల్‌కి వెడదాం''

అతను భయపడ్డాడు. నీళ్లు కుమ్మరించిన ట్లే. చుట్టూ చూశాడు. ఎవరూ లేరు అక్కడ. వూపిరిపీల్చుకున్నాడు. ఎంత అప్రతిష్ఠ. 'నెల లు నిండిన మనిషిని స్కూల్‌కి పంపిస్తావు రా వెధవా' అని నలుగురూ చేరి తన్ను తారేమో' అన్నంత భయం వేసింది.

పరిగెత్తుకు వెళ్లి పోలీసు ఠాణా దగ్గర ఆగిన రిక్షా మాట్లాడి తీసుకువచ్చాడు. కాంపౌండ్ లోంచి కరంసింగ్ వస్తున్నాడు. అతను వచ్చేవరకూ ఆగాడు. "పెదనాన్నా! శ్రీమహాలక్ష్మిని ఆసుపత్రికి తీసుకు వెడుతు న్నాను. ఈ విషయం మనోహరికీ, సబితకీ, ఇంట్లో అత్తకీ చెప్పండి''

కరంసింగ్ చప్పున జేబులోంచి యాభై రూపాయలు నోటు తీసి అందించాడు. పాణి గ్రాహి దాన్ని అందుకున్నాడు. అవసరం సిగ్గుని విడిచేస్తుంది.

"నేను కూడా రానా'' అడిగాడు అతను.

పాణిగ్రాహికి ఆందోళనగా వుంది. "ప్లీజ్ సబితనీ, మనోహరినీ రమ్మని చెప్పండి చాలు''

మనోహరి స్కూలువైపు కరంసింగ్ వెళ్లా డు.

పాణిగ్రాహి రెండు చేతులూ జోడించి దేవుడికి నమస్కారం చేశాడు "ఇతనే రాకపో తే... దేవుడే పంపాడు''

శ్రీమహాలక్ష్మి పళ్ల బిగువున నొప్పిని దాచుకుంటోంది. ఇద్దరికీ ఇద్దరూ మూసపో సినట్లు వున్ననాడు పౌర్ణమి, లేనినాడు అమా వాస్య. తట్టతగలేసి బుట్టబోర్లించుకుని కూర్చుంటారు. భార్యాభర్తల్లో ఒకళ్లు ఖర్చు చేస్తే రెండోవాళ్లు జాగ్రత్త పడతారంటారు. ఈ పది రోజులూ ఎలాగడుస్తాయో. అను కుంది. అతన్నే ఎందుకు ఆడిపోసుకోవడం తన వివేకం ఏమైనట్లు? అమ్మ పెద్దదైపో యింది. ఈ పది రోజులూ తననీ పిల్లల్నీ పాణిగ్రాహి తప్ప మరెవరు చూస్తారు? డబ్బుంటే ఆ దారివేరు. ప్రేమ వేరు డబ్బువే రు. దేని ఇంపార్టెన్స్ దానిదే.

అతన్ని పెళ్లి చేసుకోక పూర్వం వ్యక్తిత్వా నికీ ఆ తర్వాత వ్యక్తిత్వానికీ జమీన్ ఆస్మాన్ ఫరఖ్. అంత బాధలోనూ నవ్వువచ్చింది. తెలంగాణా, ఉర్దూ మిక్స్‌డ్ తెలుగు అచ్చు కదంబమాలలా వుంటుంది.

"ఎలా వుంది శ్రీమహాలక్ష్మి'' అతను ఆమె తలని గుండెల మీద పెట్టుకున్నాడు. ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాలు భారంగా వస్తు న్నాయి. ప్రొద్దున్నే పదిగంటలు కాకపోయినా ఎండ చుర్రుమంటోంది. చేతిలో కర్చీఫ్ ఆమె తలమీద వేశాడు.

హాస్పిటల్‌కు రాగానే ఇద్దరు ఆయాలు పరిగెత్తుకు వచ్చారు. నేర్పుగా లేబర్ రూమ్ లోకి తీసుకు వెళ్లారు.

రిక్షావాడికి డబ్బు ఇచ్చేసి పంపేశాడు అతను. దూరంగా ఒంటరిగా చెట్టుకింద కూర్చున్నాడు. జేబు బరువుగా వుంది. శ్రీమ హాలక్ష్మి గొంతు చించుకుని అరుస్తోంది. ఆ కేకలకి చెట్టుమీద పిట్టలన్నీ పరిగెత్తి వెళ్లిపో యాయి. ఒక్కొకేక గుండెల్లో గునపాలతో పొడిచినట్లే. శ్రీమహాలక్ష్మి కేకలు అరణ్యరో దనలు అవుతున్నాయి.

సబితా చలపతీ ఆటో దిగారు. ప్రాణంలే

చివచ్చినట్లయింది పాణిగ్రాహికి.

అరగంటలో శ్రీమహాలక్ష్మితోబాటు మరో ప్రాణి కూడా కెవ్వుమంది.

పాణిగ్రాహి కళ్లు మూసుకున్నాడు. అల సిపోయిన టెన్షన్. చలపతి రెండు వందలు అతని జేబులో కుక్కాడు.

సబిత బయటికి వచ్చింది. "తల్లీ పిల్లాడు కులాసాగా వున్నారు.సిజేరియన్ చేశారు.హెల్దీ బేబీ అంటున్నారు''

"నేను చూడచ్చా'' పాణిగ్రాహి ఆతృతగా అడిగాడు.

"రా వెడదాం" అంది ఆమె.

శ్రీమహాలక్ష్మిని వార్డులోకి తీసుకు వెడు తున్నారు. పిల్లవాడు తెల్లగా వాడి జుట్టు నల్లగా బొడ్డు దగ్గర ఎర్రగా, కాలి కింద రక్తం ఎర్రగా...

"అయ్యో, అదేమిటి?"

"చిన్న దెబ్బ సిజరిన్ చేసేప్పుడు తగిలి వుంటుంది. అచ్చం అమ్మలాగే వున్నాడు'' అంది సబిత. చలపతి వాచీ చూసు కుంటూంటే సబిత అతనితో చెప్పింది, "అ యిన టైమ్ ఎలాగూ అయింది. ఈ రోజు సెలవు పెట్టకూడదూ''

"వీల్లేదు సబితా. చాలా పనివుంది. ముందే చెప్పాను ఆలశ్యంగా వస్తానని. అందుకే కంగారు పడడం లేదు. నేను వెళ్లాలి. నిన్ను ఆటోలో డ్రాప్ చేసి అట్నుంచి..."

సబిత అడ్డుకుంది! "దానికి తెలివిరాలేదు ఇంకా. ఎనస్తీషియా ప్రభావం. పసివాడు ఏడిస్తే ఇక్కడ ఎవరో ఒకరు వుండాలి. మీరు వెళ్లండి. వెళ్లేముందు పాణిగ్రాహి తిన్నాడోలే దో హెూటల్కి వెళ్లి భోంచేసి..."

"స్కూలుకు బయలుదేరాం. భోజనాల యాయి మావి'' పాణిగ్రాహి లేచి నిలుచున్నా డు. అతను నిలబడిన తీరు అతనికే నచ్చలే దు.





జెండర్ అప్రస్తుతం. ముగ్గురూ ప్రాణానికి ప్రాణంలా పెరిగారు. డబ్బు గోడలా అడ్డం నిలుచుంది. పేదకీ ధనికుడికీ మధ్య వ్యత్యా సాన్ని కళ్లముందు బహు గొప్పగా చిత్రీకరి స్తోంది.

చలపతి తనకంటే అన్నిటా గొప్పగా వెలిగిపోతున్నాడు. బట్టలు మనిషి హెూ దానీ, అందాన్నీ రెండింతలు చూపిస్తాయి. బాంక్ ఆఫీసర్. ఖజానా అధికారి. పాణిగ్రాహి నిటారుగా అయాడు. ఈమధ్య కొన్నేళ్లుగా ప్రతి నిమిషం పక్కవాడితో బేరీజు వేసుకుని ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్తో కృంగిపోవడ మే. ఎత్తుకి ఎదగడం తనకి చేతకాదు. అంతే. అతను తిరిగి చెట్టుకింద చతికిల పడ్డాడు.

చలపతి వెళ్లబోతూంటే సబిత వెనుక నుంచి అంది, "పనిమనిషి నర్సమ్మతో చెప్పండి. నేను ఇక్కడ వున్నానని. డబ్బు ఇస్తానని కూడా చెప్పండి. వెంటనే వచ్చే స్తుంది''

"నువ్వు రాత్రికి వస్తావా''

"చూస్తాను''

"పాణిగ్రాహీ! నేను మళ్లీ కలుస్తాను'' అని వెళ్లిపోయాడు. పాణిగ్రాహిలో మార్పులేదు. అతను నిండుకుండ. ఎప్పుడూ ఒకేలా వుంటాడు.

సబిత కొంచెంసేపు అతని ఎదుటే నిలు చుంది. పాణిగ్రాహి మాట్లాడలేదు. ఈసారి ఆమె అతనికి ఎదురుగా కొద్దిదూరంలో చోటు చేసుకుని కూర్చుంది. "పాణిగ్రాహీ! నువ్వు మరీ మూగవాడివైపోయినట్లు కనిపిస్తు న్నావు. ఏమైంది?"

"ఆఁ" అతను వులిక్కిపడ్డట్లు తలెత్తాడు.

"ఈసారైనా ఆపరేషన్ చేయించుకోండి''

"సిజేరియన్తోబాటు అదికూడా చేసేశారు''

"గుడ్...ఓ పనైపోయింది. పాణిగ్రాహీ! నువ్వు చాలా నిరాశగా, నిరాసక్తిగా కనిపిస్తు న్నావు. ఒంట్లో బాగులేదా?"

"అబ్బే!" అతను కంగారును అణుచుకు

న్నాడు. "అదేం లేదు సబితా! మేము హాయిగానే వున్నాం. ఇద్దరం జాబ్ చేస్తు న్నాం. కొంచెం ఆర్థిక చిక్కులు అంతకు మించి మరేమీలేదు''

సబిత జాలిగా చూసింది. మనమధ్య దాపరికం వుండేదికాదు. ఏదో ఓ టాపిక్ మీద గంటల తరబడి మాట్లాడుకునేవాళ్లం. అప్పుడు కూడా గొప్ప ఐశ్వర్యవంతులం కాము. అయినా ఆ రోజుల్లో ఎంతో థ్రిల్ వుండేది. మనోహరీ యతీకూడా బాగానే వున్నారు. ఎటొచ్చీ మీ ఇద్దరే'

అతను హాయిగా మునుపటిలాగే నవ్వేశా డు. "మనం చూసే దృక్పథంలో తేడా వుండి వుంటుంది సబితా! నేనూ శ్రీమహాలక్ష్మి హాయిగా వున్నాం. ఎప్పుడూ గట్టిగా వా దించుకోవడం కూడా తెలీదు మాకు''

"చాలా సంతోషం" సబిత మనస్ఫూర్తిగా అంది.

"సబితా! నేను ఇంటికి వెళ్లి వస్తాను. అత్తగారికి ఈ విషయం తెలీదు బహుశా... నేను వచ్చేవరకూ..."

"బొత్తిగా బుద్ధిలేదు పాణిగ్రాహీ!"

అతను హడలిపోయాడు.

"నువ్వు నన్ను దేవిరించక్కర్లేదు. శ్రీమ హాలక్ష్మి నాకు తోడబుట్టినలాంటిది. నేను చూసుకుంటానుగానీ తాపీగా రా. వచ్చేప్పు డు ఫ్లాస్కులో కాఫీ తీసుకు రావడం మరిచి పోకు'' అంది.

అతను నవ్వి వెళ్లిపోయాడు.

శ్రీమహాలక్ష్మి కళ్లు తెరిచేసరికి ఎదురుగా స్టూలు మీద సబిత కూర్చుని వుంది. పక్కనే వున్న కొడుకునీ, ఆమెనీ చూసి నెమ్మదిగా నవ్వింది. "ఎప్పుడు వచ్చావు?"

"కరంసింగ్ పెదనాన్న చెప్పినప్పుడు''

"మనోహరి రాలేదా''

"వస్తుంది. స్కూలు ఎవరికైనా అప్పజె ప్పి రావాలి. ఎలాగూ టైమ్ అవుతోంది. మధ్యలో హాస్పిటల్ వాళ్లు రానీయరని సాయంకాలమే వద్దామనుకున్నా తప్పులే దు''

"నిజం నిజం" అంది శ్రీమహాలక్ష్మి.

"వీడు అచ్చు నీలాగే వున్నాడు''

"వైష్ణవి మాత్రం వాళ్లనాన్న''

"ఆకలేస్తోందా శ్రీమహాలక్ష్మి''

"లేదు''

"కడుపు నిండిపోయింది కదూ''

"నిజమే'' వాడిని ముద్దాడింది శ్రీమహా లక్ష్మి.

వాడు పాలకోసం బుర్ర అటుయిటూ కదిలిస్తున్నాడు.

"వింత పిల్లలు. ఇలా పుట్టగానే అలా తిండి మీద దాడి''

"ప్రకృతి విరుద్ధంకాదే సబితా. ఈ పొట్టకో సమే ఇన్ని తిప్పలూ అని చెప్పేది నగ్న సత్యం"

వాడు పాలు తాగుతూంటే చప్పుడు వినిపిస్తోంది.

"ఈ కాలపు పిల్లలకి తెలివి ఎక్కువే''

"అదీ నిజమే అయివుంటుంది'' అంది శ్రీమహాలక్ష్మి.

శ్రీమహాలక్ష్మి మనసు ఇంటిమీదకీ, పిల్ల లమీదకీ మళ్లింది. వైష్ణవి మరీ చిన్నది. దానికి క్రాపు చేయించాలనుకుని మానేసింది. తను చేసిన పని ఆ పిల్లచేత చేయించకూడ దని. తల్లికి జడవేయడం రాదు.

పిల్లకి కాలు విరిగిందంటే డాక్టర్ దగ్గరకి పరిగెత్తేది. ఇరుగూ లేదు పొరుగూ లేదు. శ్రీమహాలక్ష్మికి ఎవరైనా ఒకటే. అటు వంటిది ఇప్పుడీ హాస్పిటల్‌లో ఒంటరిగా... కొంచెంసేపు వుంటే సబిత వెళ్లిపోతుంది. సబితకంటే ఎక్కువేమీ కాదు మనోహరి. ఇద్దరు పిల్లలు పుట్టినప్పుడు అత్తగారు వుండేది. తల్లికి ఓపిక వుండేది. ఇప్పుడు ఏవీ ఆ రోజులు? కొద్దిలో గొప్పగా వున్న ఆ రోజులు కూడా పోయాయి. ఒంటరిపోరా టంలా...

సబిత చిన్నవాడిని ఒళ్ళోకి తీసుకుంది. "నువ్వు బెంగపెట్టుకోకు శ్రీమహాలక్ష్మి. నర్సమ్మ రాత్రీ పగలూ వుండేట్లు ఏర్పాటు చేస్తాను. నేనూ వస్తాను. అధైర్యపడకు''

"నీకు శ్రమ"

"భలేదానివే... నువ్వేమైనా పరాయిదాన వా నాకు? డబ్బు గురించి కూడా బెంగపెట్టు కోకు. ఆపదలో ఒకళ్లకి మరొకళ్లు తోడుగా వుండాలి. ఓకే'

శ్రీమహాలక్ష్మి కళ్లు తుడుచుకుంది.

"అదిగో! ఆ పనే ఒద్దు. ఇప్పుడేమైంది? ఎద్దు ఎప్పుడూ ఒక వైపే పడుకోదు. గాలి ఎప్పుడూ ఒకవైపే వీచదని చదివాం గుర్తులే దూ''

"వూc"

"ఈ కష్టాలూ, కన్నీళ్లూ మనల్నేమీ అంటి పెట్టుకుని వుండవు. ఓ టైమ్ వస్తే మనం కూడా లక్ష్యాన్ని సాధిస్తాం"

"నువ్వు ఎనర్జీ వేస్ట్ చేసుకుంటున్నావు సబితా! నన్ను నవ్వించాలనీ, ధైర్యం నూరి పోయాలనీ చూస్తున్నావు. రెస్ట్ తీసుకో'

సబిత గంభీరంగా అయిపోయింది. ఆరు గంటలకి పది నిమిషాలుందనగా మనోహరీ, యతీ వచ్చారు. మనోహరి చేతిలో ఓ సంచీ వుంది. అది ఇస్తూ "మీ అమ్మ ఇచ్చారు. పిల్లాడికి సబ్బూ, పాత బట్టలూ'' అంది.

సబితని చూసి "హలో' అంది. యతి కూడా పిల్లవాడిని చూసి సంతోషించాడు.

యతి ఫ్లాస్కులో కాఫీ తీసుకువచ్చాడు. అది గ్లాసులో పోసి శ్రీమహాలక్ష్మికి ఇచ్చింది.

"అంతా కులాసాయేనా'' పలకరింపులు అయిపోయాయి. ఈలోగా గంట గణగణా శబ్దం వినిపించింది. విజిటర్స్‌ని వెళ్లిపొమ్మని చెప్పడం.

"సారీ శ్రీమహాలక్ష్మీ! నీకు రోడ్డుమీదే లేబర్ పెయిన్స్ స్టార్టయ్యాయని పెదనాన్న చెప్పారు. సబిత బయలుదేరుతోందని కూడా అన్నారాయన. స్కూలు వదిలేసి అర్థాంతరంగా రాలేక పోయాం. పోనీ రాత్రి ళ్లు వుండాలన్నా ఇంటికి ఎవరో ఒకరు వస్తూ వెడుతూ వుంటారు. వూపిరి ఆడడం లేదు. ఆదివారం అయినా ఇల్లు తిరణాళ్లలా వుంటోంది. నువ్వు చూస్తూంటావు కదా! నేను వెళ్లాలి ప్లీజ్!"

"అయ్యో!" శ్రీమహాలక్ష్మి బాధపడింది. "నీ పనులు మానుకోవద్దు మనూ. ఇప్పుడు నాకేం కావాలని? పాణిగ్రాహి స్కూలుకి సెలవు పెట్టివుంటాడు. పిల్లల్ని చూసు కుందుకు అమ్మ వుండనే వుంది''

"మరి మేము వెళ్లొస్తాం"

వాళ్లు ఎంత హడావుడిగా వచ్చారో అంతే హడావుడిగా వెళ్లిపోయారు. కాలానికీ డబ్బు కీ ముడిపడిపోయి వుంది. ఏది జరిపినా నష్టమే.

సబిత ఆలోచిస్తోంది. ఒంటరిగా ఇలా వదిలేయడానికి మనసు ఒప్పుకోవడంలేదు. పాణిగ్రాహి ఒక్కడే వస్తే ఇబ్బందిలో పడా ల్సివస్తుంది. నర్సమ్మ కూడా వస్తే నిశ్చింతే. ఆమె ఆలోచనల్లోంచి బయటికి వచ్చేసింది. నర్సమ్మ కాలికి వున్న కడియాలు, మట్టెలు, పట్టాలు ఇవన్నీ పెద్ద శబ్దం చేస్తున్నాయి. నిద్రలోవున్నా మెలకువ వస్తుంది. అటువంటిది సబితకి ప్రాణమే లేచివచ్చినట్లయింది.

నర్సమ్మ వస్తూనే శ్రీమహాలక్ష్మి పక్కన కింద చతికిలబడింది. ఆమె శరీరాన్ని ఆప్యాయంగా తడిమింది. పిల్లవాడి చెంపల్ని రెండు చేతుల్తో రాసి కణతలకి తగిలించుకుని మెటికలు విరిచింది.

"ఇగ నువ్వు పోమ్మ సబితమ్మ'' అంది.

"నర్సమ్మా! అది నా చెల్లెలికంటే ఎక్కువ. నువ్వీ నెల్లాళ్లూ అమ్మ దగ్గర పనిచేశావంటే నీకు మంచి చీర కొనిపెడతాను'' అంది.

"ఫికర్ చేయకమ్మ. నేనున్నగద" అంది ధైర్యం చెబుతూ.

"సబితని డ్రాప్ చేసి వస్తాను'' అని





బయలుదేరాడు పాణిగ్రాహి.

సబిత మళ్లీ వెనక్కు వచ్చింది. "పిల్లల్ని నేను తీసుకు వెడతాను శ్రీమహాలక్ష్మీ''

"ఒద్దు. అమ్మ ఒకతే వుంటుంది''

"పోనీ ఆమెని కూడా తీసుకు వెళ్లనా?"

"ఒద్దు సబితా! నువ్వు అనవసరంగా శ్రమ తీసుకోకు''

సబిత మాట్లాడలేదు.

పాణిగ్రాహి ఆమెతో బయలుదేరాడు. దార్లో ఏమీ మాట్లాడుకోలేదు. ఆటోలో కూర్చుంటూ పర్సుతీసి రెండు వందలు చేతిలో పెట్టింది. అతను మొహం దించుకున్నాడు. "చలపతి ఇచ్చాడుగదా!"

"తెలుసు.సిజేరియన్ అయిన పిల్ల. ఖర్చులు వుంటాయి. అవసరం అయితే సిగ్గుపడకు'' అంది.

పాణిగ్రాహి తల మరీ కుంగిపోయింది.

అతను తిరిగి హాస్పిటల్‌కి వచ్చాడు. ఇంటిదగ్గర పిల్లలు, అత్తగారు, ఎలా ఉన్నారో అతని మనసు బెంగతో మూలిగింది.

★ ★ ★

శ్రీమహాలక్ష్మిలో అసంతృప్తి పెరిగి పెద్దదౌతోంది. పెరుగుతున్న పిల్లల అవసరాలు అందుబాటులో లేనంత ఎత్తుకు ఎగురుతున్నాయి. వాటిని అందుకోవడం చేతకావడంలేదు.

పాణిగ్రాహి ఓ కంపెనీలో చేరాడు. కంపెనీ బాగా పేరున్నదే. అదీ చలపతే చూసిపెట్టాడు. అతను ఆ కంపెనీలో చేరగానే శ్రీమహాలక్ష్మి పనిచేస్తున్న స్కూలుని గవర్నమెంట్ తీసుకుంది. అనుకోని ఈ అదృష్టానికి భార్యాభర్తలిద్దరూ చాలా సంతోషించారు.

పాణిగ్రాహి తెల్లవారు తుంటే కంపెనీ బస్సులో వెళ్లిపోయాడు. తిరిగి రాత్రి ఏడు గంటల ప్రాంతంలో కంపెనీబస్సులోనే వస్తాడు. చిన్నప్పుడు సరదాకి నేర్చుకున్న టైపు ఇప్పుడు ఉపయోగపడింది.

అతను మొదటిసారి నెల జీతం తీసుకున్నప్పుడు కంగారుపడ్డాడు. భయపడ్డాడు. కంపెనీవాళ్లు పొరబాటున ఇచ్చారేమో అని. కానీ అతనికి రావలసిన జీతమే ఇచ్చారు. పూర్వం అతనికి వచ్చిన జీతానికి దాదాపు నాలుగురెట్లు ఎక్కువ. అతను నమ్మలేకపోయాడు. వస్తూవస్తూ పుల్లారెడ్డి మిఠాయి తీసుకు వచ్చాడు. రెండుమూడు గజాల పూల దండ, స్ట్రాంగ్ పుదీనా, యిలాచీ పాన్‌లు రెండు, మాసపత్రికలు, చందమామ... అతను ఇంట్లోకి అడుగుపెట్టగానే వింతైన పరిమళం.

డబ్బు వాసన.

డబ్బుకి వాసనవుంటుందా?

పరిమళం... ఫ్రాగ్రెన్స్.

శ్రీమహాలక్ష్మి చేతిలో వుంచాడు.

పాణిగ్రాహి చుట్టూ పిల్లలు చేరారు. వాళ్లని ముద్దులతో తడిపేశాడు. "నీక్కూడా'' అంటే శ్రీమహాలక్ష్మి నవ్వుకుంది. అటువంటి నవ్వు ఎప్పుడో పుష్కరానికోసారి ఆమె పెదవులమీద కదులుతుంది.

అత్తగారికి ఇష్టం అని జిలేబి తెచ్చిఇచ్చాడు.

ఆవిడ దేవుడికి దండంపెట్టుకుంది.

పిల్లలు చాలా హుషారుగా వున్నారు.

పాణిగ్రాహికి కూడా హాయిగావుంది. ఈ జీవితం ఇలా సాగిపోతే చాలు. "సినిమాకి వెడదామా''

శ్రీమహాలక్ష్మి తల అడ్డంగా తిప్పింది.

అతనికీ పిల్లలకీ భోజనం ఏర్పాటు చేసింది. తల్లికి ఫలహారం చేసి ఇచ్చింది. ఆ పైన వెన్నెల్లో డాబామీద పక్కలు పరిచింది. తల్లికి చలి పడదు. ఆవిడ కిందే వుండిపోయింది.

వెన్నెల్లో పిల్లలకి 'కీలుగుర్రం' కథ చెప్పాడు అతను. పిల్లలు అతని గుండెలమీద ఇటూఅటూ హాయిగా నిద్రపోయారు.



పాణిగ్రాహికి చాలా తృప్తిగా వుంది.

శ్రీమహాలక్ష్మి వంటిమీద చేయివేశాడు అతను.

ఆమె ఇబ్బందిగా ఆ చేతిని సుతారంగా తీసేసింది.

ఫ్రిజిడిటీ... ముడుచుకుపోతోంది శ్రీమహాలక్ష్మి శరీరం. సెక్స్ పట్ల విముఖత, అసహ్యం.

మరి ఆ ముగ్గురు పిల్లలూ ఎలా పుట్టారు?

ఎప్పుడో ఒక్కో సందర్భంలో చిన్నప్పటి నుంచీ తన పట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకున్న పాణిగ్రాహి పట్ల ప్రేమ లేకపోలేదు. అతనంటే ఇష్టంవుంది. అతనికోసం చచ్చిపోయేందుకు కూడా సిద్ధంగా వుంది. కానీ... అతనితో పక్కపంచుకునేందుకు మనసు సిద్ధంగా లేదు. యాక్సిడెంటల్‌గా అతనిపక్కన చేరిన ఫలితాలు వాళ్ళు.

అతని ప్రేమకి ఆశ్చర్యపోతూ అతన్ని చేరుకోవాలని గట్టి నిర్ణయానికి వచ్చినప్పుడు అతని ప్రవర్తన అతన్నించి దూరంగా విసిరేసేది. అతని అలవాట్లు బొత్తిగా నచ్చవు. భర్తకాని క్రితం పాణిగ్రాహి అండ చాలా గొప్పది అనుకునేది. కానీ అతని బద్ధకం, జీవితం పట్ల సరియైన అవగాహన కానీ, ఓ లక్ష్యంగానీ లేకపోవడం చిరాకుపరుస్తూ ఆమెలో అణిగిపోయిన కోర్కెల్ని తట్టిలేపేది.

"శ్రీమహాలక్ష్మి'' అతను పిలిచాడు.

"చెప్పండి'' అంది విసుగ్గా.

"ఏమీలేదు'' అతను అటు తిరిగి పడుకున్నాడు.

★ ★ ★

వేసవి సెలవలకి స్నేహితులందరూ అమ్మమ్మల ఇళ్లకు వెడతారు. ఎప్పుడూ లేనిది పిల్లలు తల్లి దగ్గర పేచీ పెట్టారు

"మన అమ్మమ్మ ఇక్కడే వుంది. నానమ్మలేరు. మరి మనం ఏ వూరు వెడదాం అమ్మా?"

"మనం వూరికి వెళ్ళాలంటే డాడీకి సెలవు దొరకదు'' అంది శ్రీమహాలక్ష్మి.

"ఏ వూరైనా వెడదాం అమ్మా ప్లీజ్' పరశురాం ప్రాధేయపడుతున్నట్లు అడిగాడు.

ఎంతసేపూ ఇల్లూ, స్కూలూ, పనీ అంతకుమించి మరో వ్యాపకం వైపు పరిగెత్తడంలేదు మనసు. కూడికలు, తీసివేతలూ ఇంతే. కళ్లముందు చదరంగం గళ్ళల్లా, పగలూ రాత్రీ ఏ ప్రమేయం లేకుండా, ఏ ప్రాముఖ్యత లేకుండా జారిపోతున్నాయి.

దోసిళ్ళల్లోంచి నీళ్ళు కారిపోతున్నట్లు.

పట్టుకోవాలి, పరిగెత్తే కాలాన్ని ఆపేయాలి.

ఎందుకీ తొందర? ఆరాటం?

మరిచిపోయేందుకు?

అసంతృప్తి... లేనిదిరాదు. రానిదాని కోసం పరుగులతో ప్రయోజనంలేదు.

"అమ్మా తిరుపతి పోదాం" వైష్ణవి తల్లి మొహాన్ని తనవైపు తిప్పుకుంది.

పరధ్యానం వదిలిపోయింది.

"అలాగే'' శ్రీమహాలక్ష్మి ఓ నిర్ణయానికి వచ్చింది.

పిల్లలు 'కూ... చుక్... చుక్' మంటూ వెళ్ళిపోయారు. పాణిగ్రాహి రాగానే అతనికి చెప్పింది.

అతను పూర్తిగా విని "అలాగే' అన్నాడు.

సుభద్రమ్మకి చాలా సంతోషంగా వుంది. ఈ ఊరు వదిలి ఆవిడ ఎప్పుడూ ఎక్కడికీ వెళ్లలేదు. పాణిగ్రాహి వారంరోజులు ముందుగానే రిజర్వేషన్ చేయించాడు.

ఇంట్లో వుత్సాహం వెల్లివిరిసింది.

శ్రీమహాలక్ష్మి పిల్లలకి కావలసినవి ముందే సిద్ధం చేసుకుంది. నాలుగైదురోజులు వుండిరావచ్చు. అటునుంచి పుట్టపర్తికో లేదా పుట్టపర్తినుంచి అటో వెడితే అనుకుంది. ఈ విషయం పాణిగ్రాహితో చెబితే అతను 'వచ్చేప్పుడు వెడదాంలే అన్నాడు.

అతను రెండురోజుల్లో రెండువేలు తీసుకు





వచ్చి శ్రీమహాలక్ష్మికి ఇచ్చాడు. పిల్లలు నేలమీద నడపడం మానేసినంత సంతోషపడిపోతున్నారు.

శ్రీమహాలక్ష్మికి ఓవైపు భయంవేస్తోంది. తిరిగి ఈ అప్పుల వలయంలో చిక్కుకుని మొదటికి వస్తే 'అమ్మయ్యో, గుండె ఆగిపోదూ...' అంతలోనే తేరుకుంది. పిల్లలకి కూడా స్థలం మార్పు కావాలి.

ఈ వార్త విని సబితా, మనోహరీ కూడా సంతోషించారు. శ్రీమహాలక్ష్మికి కూడా మార్పు కావాలి. చూస్తుండగానే రైలెక్కేశారు. పిల్లలను కిటికీల దగ్గర పడుకోబెట్టింది.

పాణిగ్రాహికి ఎదురుగా వున్న సీట్లో తనూ కిటికీ పక్కనే కూర్చుంది.

రైలు పాడే జోల పాటకీ, వూపే వూయలకీ క్రమంగా ఒక్కొక్కరే నిద్రలోకి జారిపోతున్నారు.

శ్రీమహాలక్ష్మి నిద్రపోలేదు. కిటికీలోంచి చంద్రుడిని చూస్తోంది. వెన్నెల అడవుల్లోంచి వూళ్లోకీ, వూళ్లోంచి అడవుల్లోకీ పాకుతుంటే హాయి... హాయిగా ఆమని... ఎంత చక్కని పాట... సాగిపోనీ ఈ రైలు ఆగకుండా ఇలాగే ఎప్పటికీ వెళ్లిపోతూంటే...యాత్ర.

అంతులేని ప్రయాణం.

విసుగురాని పయనం. బాధ్యతలకీ బరువులకీ... బంధాలకీ, వీటన్నిటికీ అతిదూరంగా దూరంగా... రైల్వేగేట్ పక్కన డప్పుల చప్పుడుకి వులిక్కిపడింది. ఆ రాత్రి వేళ పెట్రోమాక్స్ లైట్ల వెలుగులో శవయాత్ర... యాత్ర... జీవితం పరిపూర్ణం అయిపోయిన తర్వాత ఆఖరి మజిలీ. ఒక్కసారి గుండె ఝల్లుమంది.

ఆ డప్పుల మోత

ఆ శవయాత్ర

ఆమె భయకంపితురాలైంది.

ఎదురుగావున్న పాణిగ్రాహి వైపుచూసింది.

అతని చూపులు ఈ ప్రపంచంతో సంబంధం లేనట్లు ఎటో చూస్తున్నాయి. ఆ చూపుల్లో ఏదో అపశృతి... తాత్కాలికంగా, క్షణంపాటు ఆ చూపులతో తన చూపుల్ని ఏకంచేస్తూ ఆ కోణంలోంచి అతను చూసే దృశ్యం వైపు దృష్టిని సారించింది.

శ్రీమహాలక్ష్మి చెంపమీద 'ఛెళ్లు'మని చరచినట్లయింది.

అక్కడ...

నమ్మలేకపోతోంది. పాణిగ్రాహియేనా?

మళ్ళీ అతనివైపు చూసింది. అతను రెప్పలు వేయడం మరిచిపోయాడు.

ఆమెలోని మాతృమూర్తి సిగ్గుతో తల దించుకుంది.

ఆ కిటికీకి కొద్దిదూరంలో అవతలివైపు ఓ ఇరవై ఏళ్ళు దాటిన చక్కనైన అమ్మాయి ఒళ్ళో పాపకి పాలిస్తోంది.

మధ్యలో నిద్రపట్టినట్లుంది. కొంగు జారిపోయింది.

పాలు తాగుతున్న పాప చేయి ఓ రొమ్ము మీదా, నోరు మరో రొమ్ముమీదా...

లేచివెళ్ళి ఆ పిల్ల కొంగు సరిచేస్తే అనిపించిందిగానీ, ఆపనీ చేయలేకపోయింది.

ఆ తల్లి తననుతాను మర్చిపోయి మాతృత్వంలో మాధుర్యాన్ని ఆస్వాదిస్తూ నిద్రాదేవి వొళ్ళోకి జారిపోయి ఉంది.

పాణిగ్రాహి కళ్ళు ఆ ప్రదేశాన్ని తడుముతున్నాయి. మానసిక వ్యభిచారానికి పరాకాష్ఠ.

కళ్ళు గట్టిగా మూసుకుంది ఆమె.

రైలు ఆగకుండా వెళ్ళిపోతోంది.

ఆమెకి ప్రయాణపు ఆనందం ఎంతోసేపు నిల్వలేదు.

రాత్రంతా ఆమె జాగరణ చేసింది.

పాణిగ్రాహి ఆమెని గమనించలేదు.

దుశ్శాశనుడిలా ఆ పిల్లని వివస్త్రని చేస్తున్నట్లూ, కామాంధుడిలా ఆ పిల్లని బలాత్కరిస్తున్నట్లూ కనిపిస్తూంటే శ్రీమహాలక్ష్మికి నిద్రేం పడుతుంది?

తెలతెలవారుతూంటే రైలు ఆగింది.

ఆ పిల్ల భర్తవచ్చి ఆమెని లేపి దిగేందుకు హడావుడి పడిపోతూంటే 'బతుకుజీవుడా' అనుకుంది.

రైలు తిరుపతి చేరుకున్నాక ఆపైన ఆమె ఆలోచించలేదు.

తల్లితో పిల్లలతో తిరుమల బస్సులో కూర్చుంది. పక్కనే పాణిగ్రాహి.

అతను బస్సు కదలడం ఆలశ్యం నిద్రలోకి జారిపోయాడు. శ్రీమహాలక్ష్మి భుజం మీదకి ఒరిగాడు. ఆమె వొంటినిండా బొద్దింకలు, గొంగళిపురుగులూ పాకుతున్నాయి.

"గోవిందా, గోవింద"

శ్రీమహాలక్ష్మి రెండుచేతులూ జోడించింది.

పిల్లలు అమ్మమ్మతో కబుర్లాడుతున్నారు.

చిన్నవాడు ఆమె వొళ్ళో నవ్వుతున్నాడు.

పాణిగ్రాహి వునికి మండుటెండలో గాలి ఆడనప్పుడు ఈగలు ముసురుతున్నట్లుంది.

అతను గురకపెడుతున్నాడు.

సిగ్గులేని మనిషి. రాత్రంతా జాగారం చేసి ఇప్పుడు నిద్రపోతున్నాడు.

పైకి ఎంతో గంభీరంగా, హుందాగా, ధీటైన వ్యక్తిత్వంతో వుండే మనుషుల్లో ఇంత ఛండాలపు మనిషి దాక్కుని వుంటాడా?

ఏ నిప్పులు దగ్ధం చేస్తాయి?

ఏ గంగ ప్రక్షాళనం చేస్తుంది?

అంతలోనే సర్దుకుంది. తనవి తొందరపాటు నిర్ణయాలు కావుగదా!

పరధ్యానంలో చూపు ఒక్కోసారి ఎక్కడో కేంద్రీకృతం అయిపోతుంది. అప్పుడు ఏదీ కనిపించదు. ఒకవేళ అటువంటి పరిస్థితుల్లో చిక్కుకున్నాడేమో?

చాలిక శ్రీమహాలక్ష్మి చాలు.





ఎక్కేది స్వామివారి సన్నిధివైపు.

మరల్చుకో... మరల్చుకో మనసు నీవైపు మరల్చుకో.

చెంపలు వేసుకుంది. మళ్ళీ రెండుచేతుల్తో దండం పెట్టింది. ఈసారి స్పష్టంగా 'గోవిందా' అనే వినిపించింది.

బస్సు ఆగగానే రూమ్ తీసుకున్నాడు.

పిల్లలని తనతో తీసుకువెడుతూంటే చంటివాడితో శ్రీమహాలక్ష్మి బయలుదేరింది.

"గుండు చేయించుకోవాలా డాడీ" పరశురామ్ అడిగాడు.

"నేను హాఫ్ ఇస్తాను డాడీ" వైష్ణవి.

"చిన్నవాడికి దగ్గరుండి చేయించాలి" అంది శ్రీమహాలక్ష్మి. "నేనూ కొసలు ఇవ్వాలి" అంది మళ్లీ.

సుభద్రమ్మ కూడా బయలుదేరింది.

స్నానాలు, పానాలూ అన్నీ చకచకా జరిగిపోయాయి.

శ్రీవారి దివ్యమంగళ విగ్రహ దర్శనం మూడు గంటలు 'క్యూ'లో కూర్చున్నాక జరిగింది. కళ్లారా చూశారు.

స్వామివారి అభయాస్తం శ్రీమహాలక్ష్మికి ధైర్యాన్నిచ్చింది.

"వెళ్ళండి, వెళ్ళండి"

"తప్పుకోండి, తప్పుకోండి"

"గోవిందా... గోవిందా"

ఏడు ద్వారాల్నీ దాటుతూ స్వామిని చూస్తూ, ముందుకీ ఆపైన వెనక్కి తిరిగి చూస్తూ బయటికి ఆ మధ్యాహ్నం ఆ సాయంత్రం... మర్నాడు మంగాపురం, కళ్యాణ వేంకటేశ్వరస్వామి దర్శనం, గోవిందరాజులవారి దర్శనం అయిపోయింది. తర్వాత పుట్టపర్తి వైపు బయలుదేరారు.

సుభద్రమ్మ తెగ సంబరపడింది. "పాణిగ్రాహీ! నేను అదృష్టం చేసుకున్నాను."

"చీటికీ మాటికీ చేతులు గుండుమీదకి వెళ్ళిపోతున్నాయి డాడీ"

"నాక్కూడా ఎందుకు చేయించావమ్మా"

"మొక్కుకున్నాను వైష్ణవీ''

"ఏమనీ''

''నీ తలనెప్పి తగ్గితే గుండు చేయిస్తాననీ''

"నాకు తలనొప్పి ఎప్పుడొచ్చిందీ''

"నువ్వు బాగా ఉ[illegible]గా వున్నప్పుడు''

పరశురామ్ ఫక్కున నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నావురా?" కసిరింది శ్రీమహాలక్ష్మి.

"సారీ అమ్మా! చెల్లికి తలనొప్పి వస్తే చెల్లి మొక్కుకోవాలి. లేదా నువ్వు మొక్కుకోవాలి కానీ... పాపం వైష్ణవికి గుండేంటమ్మా''

"ఏడిశావ్‌లే' నవ్వేసింది.

"నాలుగు ప్లస్ ఒకటి ఐదుగుళ్ళన్నా''

"చుప్'' పరశురామ్ నోటిమీద చేయివేశాడు.

తిరుపతి అయ్యాక పుట్టపర్తి వెళ్లాలంది శ్రీమహాలక్ష్మి.

పుట్టపర్తిలో క్యూ... వైష్ణవి కళ్ళార్ప కుండా చూస్తోంది. శ్రీమహాలక్ష్మి అంతే.

నిశ్శబ్దం... అద్భుతమైన నిశ్శబ్దం. ఆహ్లాదకరమైన నిశ్శబ్దం...

స్వామి కాషాయాంబరధారియై...

నెమ్మదిగా అటూ ఇటూ అక్కడా ఇక్కడా అంతటా అభయహస్తంతో ఆశీర్వదిస్తూ దగ్గరగా వచ్చినట్లే వచ్చి దూరంగా జరిగిపోతూ... శ్రీమహాలక్ష్మి కళ్ళు తడిశాయి.

సజలనయనాలయ్యాయి.

ఆపైన అంచులు దాటిన ఆ నీరు చెంపల మీదకి జారింది. భక్తిపారవశ్యంతో ఆమె గుండె చెరువై కాలువై, నదై, సముద్రమై ఉప్పొంగింది.

"శ్రీమహాలక్ష్మి ఇక ఇంటికేనా?" పాణిగ్రాహి అడిగాడు.

"అవునండి''

"ఆర్ యూ హాపీ''

"నిస్సందేహంగా''

ఐదురోజులూ ఇట్టే గడిచిపోయాయి. తిరిగి ఇల్లు. తలుపులు తెరిచి లోపలికి ప్రవేశించింది. తనతోబాటే తెచ్చుకున్న జ్ఞాపకం తిరిగి అలజడిలో దింపేసింది.

ఇల్లు తుడుచుకోవడం, వంట చేసుకోవడం ఆ రోజుకి మరి విశ్రాంతి తీసుకున్నాడు పాణిగ్రాహి. పెద్ద పిల్లలు అమ్మమ్మ దగ్గర పడుకుంటున్నారు.

చంటివాడితో పాణిగ్రాహి గదిలో ప్రవేశించింది శ్రీమహాలక్ష్మి.

వున్న ఒక మంచంమీదా సర్దుకుని పడుకోవాలి. తప్పదు. వేసవి అయినా అప్పుడప్పుడు కురిసేవాన పెట్టే ఇబ్బంది అది.

"శ్రీమహాలక్ష్మి! పొరపాటు చేశావేమో'' అన్నాడు పాణిగ్రాహి.

ఉలిక్కిపడింది ఆమె.

"ఇప్పుడేమైంది?" అని అడిగింది.

"ఏమైందో నీక్కూడా తెలుసు''

"నాక్కూడా తెలుసా. ఎలా పసిగట్టారు'' నాలుక జారిపోయింది.

"ఎందుకు తెలీదు. నీ ఆశలు శిఖరాగ్రాన వుండేవి. దారిలేక నన్ను పెళ్లి చేసుకున్నావు. నీ శరీరం, మనసూ నన్ను స్వీకరించేందుకు ఎదురు తిరుగుతాయి అవునా?"

శ్రీమహాలక్ష్మి మొహం తుడుచుకుంది. రైల్లో సంగతి కాదన్నమాట. మధ్యలో తనెందుకు భయపడ్డం? ఓ సంస్కారం లేనివాడిని సంస్కారం మరిచిపోయి చూసినందుకు. "ఛ! అదేంలేదు''

అతను ఆమె ఒంటిమీద చేయి వేయబోయాడు.

పిల్లవాడు నిద్రలో కెవ్వుమన్నాడు.

శ్రీమహాలక్ష్మి కంగారుపడింది. పాణిగ్రాహి ఉసూరుమన్నాడు.

 

శ్రీమహాలక్ష్మి ఎక్కడ వుంటే అక్కడ సందడీ, హంగామా వుండేది. ఇప్పుడలా కాదు. అంతటా శ్మశాన నిశ్శబ్దం. ఎప్పుడూ

ఆడుతూ పాడుతూ గెంతుతూ గలగల్లాడే గోదారిలా వుండే ఆమె ఇప్పుడు మూగదాని లా అయింది.

పాణిగ్రాహికి ఇంటికి రావాలనిపించదు.

వచ్చినప్పటినుంచీ పిల్లలు తనతో కాస్సేపు కాలక్షేపం చేస్తారు. ఆ తర్వాత నిద్రపోతారు. ఆపైన ఏంచేయాలో తెలీదు. చదువుకోవాలనిపించదు. ఉత్సాహం వుండదు. ఎందుకొచ్చిన కాపురమా అని శ్రీమహాలక్ష్మి నెత్తిమీద చేతులు పెట్టుకుని కూర్చున్నట్లు కనిపిస్తుంది.

అక్కడంతా చీకటిలా అనిపిస్తుంది. పనులన్నీ యాంత్రికంగా జరిగిపోతుంటాయి.

అతని కాళ్ళు సబిత ఇంటివైపు మళ్ళాయి.

సబిత పిల్లలు మేడమీద గదుల్లో చదువుకుంటున్నారు. చలపతి బాంక్ పనిమీద బొంబాయి వెళ్ళాడు. అతని తల్లి 'రామాయణం' చదువుకుంటోంది.

పాణిగ్రాహిని చూస్తూనే "రా పాణిగ్రాహీ'' అంది సబిత సంబరంగా. "శ్రీమహాలక్ష్మి ఏదీ?" అని అడిగింది.

"తను రాలేదు''

సబిత కొంత గ్రహించింది. మరికొంత అర్థం చేసుకుంది. ఈ సంసారం సుడిగుండంలో చిక్కుకుంది. శ్రీమహాలక్ష్మిని కలుసుకోవాలి.

"రా, లోపలికి'' అంది దారితీస్తూ.

హాల్లో సోఫాలో ఎదురెదురుగా కూర్చున్నారు ఇద్దరూ. సబిత "ఒక్క నిమిషం" అంది.

ఆమె లోపలికి వెళ్ళి ఓ ప్లేట్‌లో కొంచెం మిక్చర్, మంచినీళ్ళూ తెచ్చింది.

"నాకిప్పుడు ఇవేవీ ఒద్దు సబితా'' అతని గొంతు జీరపోయింది.

"కొంచెమే తీసుకో'

అతను ఇబ్బందిగా కదిలాడు. అయినా సబిత వూరుకోలేదు. అతనికి తినక తప్పలేదు.

అతను మంచినీళ్ల గ్లాసు కిందపెట్టాక సబితే చొరవగా అడిగింది. "పాణిగ్రాహీ! నువ్వు బొత్తిగా మారిపోయావు. కాలం మనుషుల్ని మారుస్తుంది. శారీరకంగా జరిగే మార్పు తప్పదు. ఈ శరీరానికి వయసు వస్తుంది. కాలం గుర్తులు వేస్తూ కదిలిపోతుంది. కానీ మనసులో ఏర్పడే మార్పు మొహంలో ముద్రవేస్తుంది. మీ ఇద్దరికీ పడడంలేదా?"

అదే ఆడపిల్ల అయివుంటే కదిలి కదిలి ఏడ్చేదే. మగజన్మ ఎత్తినందుకు సుఖంగా ఏడ్చే అదృష్టం కూడా వుండదు. పాణిగ్రాహి కాసేపు నిశ్శబ్దంగా వుండిపోయాడు. ఆ పైన మనసులో పేరుకుపోయిన బాధనంతా వెళ్ళగక్కాడు.

"శ్రీమహాలక్ష్మికి నన్ను పెళ్లి చేసుకోమని చెప్పకుండా వుండాల్సింది సబితా! నువ్వు చెప్పింది యదార్థమే. కానీ ఆమె ఆవేశంలో పెళ్లాడింది. నేనంటే తనకి బొత్తిగా ఇష్టంలేదు. నమ్ము సబితా! నేను శ్రీమహాలక్ష్మి అంటే ప్రాణం పెడతాను''

సబిత వూహించని విషయం అది. పాణిగ్రాహిని తేరిపార చూసింది. మనిషి సగం అయ్యాడు. నల్లబడ్డాడు. మెరిసేకళ్లు నీడలు కమ్ముకున్నాయి. పెదవుల మీద సన్నగా, తెల్లగా మచ్చలువున్నాయి. పాణిగ్రాహిని కొత్తగా చూస్తోంది. ఒకవిధంగా ప్రాణస్నేహితుడే అతడుకూడా.

"పాణిగ్రాహీ నువ్వు సిగరెట్లు కాలుస్తున్నావా?"

వులిక్కిపడ్డాడు అతను. తను చెప్పేది ఏమిటి? ఆమె అడుగుతున్నది ఏమిటి? రెండింటికీ సంబంధంలేదే?

"మనసు కోతిలాంటిది. దాని చిత్తం వచ్చినట్లు గంతులు వేస్తుంది. ఎప్పుడో తెలుసా పాణిగ్రాహీ? దాని గతి తప్పినప్పుడు. మనసుకి కూడా ఓ ప్రత్యేకమైన నిశ్శ





యించబడిన స్థానం వుంది. దానికో స్థలంవుంది. అంటే ఎ ప్లేస్, ఎ స్టేటస్ అన్నమాట. దానికి క్రమశిక్షణ వుంది''

"సబితా! నువ్వేం చెప్పాలనుకుంటున్నావు?"

"నువ్వు మన కాంపౌండ్‌లో వున్న నలభై అయిదు ఇళ్లల్లో పిల్లలకీ ఆదర్శంగా వుండేవాడివి గుర్తుందా! ఏ ఇంట్లో పిల్లాడు అల్లరిచేసినా పాణిగ్రాహిని చూడండిరా! అనేవాళ్లు. అటువంటిది నువ్వు సిగరెట్లు కాలుస్తున్నావని నీ పెదాలే చెబుతున్నాయి''

చాలా సిగ్గుపడ్డాడు అతను. సబిత తన ఆత్మబంధువే. అందుకే తన కాళ్లు ఇటు లాక్కువచ్చాయి.

"చాలామటుకు మనం విధిని నమ్ముకున్నవాళ్లమే పాణిగ్రాహీ! భార్యాభర్తలన్న తర్వాత కలతలు, విసుగులు, సుపీరియారిటీ, ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌లూ ఇలా వస్తూనే వుంటాయి. ఎల్లకాలం కలిసి బతకాలనే సిద్ధాంతం వల్లో ఏమో సర్దుకుపోయేట్లుంటాం. ఒకరికొకరు అర్పించుకోవడంవల్ల, పెళ్లి అనే పవిత్రమైన క్రతువువల్ల దాంపత్యానికి చాలా విలువ ఇస్తాం. చిన్నచిన్న విషయాల్ని భూతద్దంలోంచి చూసే ప్రయత్నం చేయకు ప్లీజ్''

"సబితా'' అతను నిలువునా కూలిపోయినట్లు అల్లాడిపోయాడు. "నువ్వు నన్ను అర్థం చేసుకో. ఓ ఆడదాని ముందు ఉచ్ఛమూ నీచమూ లేకుండా మాట్లాడాడు అని అసహ్యించుకోకు. నా బాధలెవరితో చెప్పుకోను? చిన్నప్పటినుంచీ వేరే స్నేహప్రపంచం తెలీదు నాకు. అమ్మలేదు. నువ్వు నీ పరిధిలోకి వెళ్లిపోయావు. ఆర్థిక ఇబ్బందులు ఎలాగైనా అధిగమిస్తామనే ధైర్యంవుంటుంది. కానీ..."

సబిత నిటారుగా అయింది. పాణిగ్రాహి స్వతహాగా చాలా మంచివాడు. అతన్ని పరిస్థితులు అగాథంలోకి తోసేయడంలేదుకదా. అనుకుంది.

"నిజమే నేను సిగరెట్లే కాదు మా కంపెనీలో కొంతమంది స్నేహితులతో కలిసి అప్పుడప్పుడూ తాగుతాను కూడా''

"పాణిగ్రాహీ!" తెల్లబోయింది సబిత.

"ఏ పని చేసినా అబద్ధం చెప్పకూడదనుకునేవాళ్లం. అబద్ధాలాడే వాళ్లంటే అసహ్యించుకునే వాళ్లం. సబితా! నేను శ్రీమహాలక్ష్మికి యాంత్రికంగా ముగ్గురు పిల్లల్ని ఇవ్వగల్గానేగానీ ఆమె మనసుని జయించలేకపోయాను. మా ఇద్దరి మధ్యా సామరస్యంలేదు. నేను దగ్గరకి వస్తున్నానని తెలిస్తే శ్రీమహాలక్ష్మి ఇంచుమించు పారిపోతుంది. ఇంతకంటే నాగరికంగా చెప్పడం నాకు రాదు'' అతని కళ్లల్లో నీళ్లు ఏర్పడ్డాయి. అతని లోపం అతను చెప్పుకోలేడు.

సబిత దీర్ఘంగా నిట్టూర్చింది. ఎంతైనా అతను మగవాడు. అతను ఇంకా ఏం చెప్పాలనుకున్నాడో మొత్తం అర్థమయిపోయింది సబితకి. తల్లీతోడూ తన వాళ్లూ ఎవ్వరూలేరు. విచిత్రంగా తనక్కూడా అంతే! పుట్టింటి వాళ్లెవరూ లేరు. అటు చలపతి బంధువులు కూడా ఎక్కువ మంది లేరు. శ్రీమహాలక్ష్మి సంగతీ అంతే. ఎటొచ్చీ మనోహరి మధ్యలో వచ్చింది కనుక ఆమె సంగతివేరు.

"నేనేం చేయను సబితా''?

ఏడవలేక నవ్వింది. "ఏమీ చేయద్దు. పిల్లలు పెద్దవాళ్లు అవుతున్నారు. వాళ్ల ఎదుట బయటపడి పోవద్దు! నువ్వు జాగ్రత్త. నీ ఆరోగ్యం జాగ్రత్త. మంచి అలవాట్లు చటుక్కున వంటబట్టవు. చెడు అలవాట్లు ఓ పట్టాన మనిషిని వదలవు. నువ్వు మానేస్తావని నాకు నమ్మకం లేదనుకో. అయినా నీ మంచి కోరి చెబుతున్నాను. సిగరెట్లు, తాగుడూ రెండూ మానేసేయ్''

అతను వెళ్లేందుకు సిద్ధం అవుతూ లేచి నిలబడి నవ్వుతూ "ప్రస్తుతం మూడే వున్నాయి. మిగిలినవి నా జోలికి రావు అని



మాత్రం భరోసా ఇవ్వను. కానీ ఏదో ఓ రోజు సప్తవ్యసనాలూ వున్నాయి అని ఎవరైనా చెప్పినా ఆశ్చర్యపోవద్దు'' అన్నాడు.

సబితకి దుఃఖం వచ్చింది. మనిషికీ మనిషికీ మధ్య అనుబంధానికి రక్తసంబంధమే అవసరంలేదు. కొంగుతో కళ్లు తుడుచుకుంది. "ఏమిటా మూడో వ్యసనం?"

"నాకోసం వీధి గుమ్మంలో కళ్లు అలసిపోయేలా ఎదురుచూసేవాళ్లెవరూ లేరు. అందుకే నా స్నేహితుల్తో పేకాడి ఆలస్యంగా ఇంటికి వెడతాను. అప్పటికి అత్తగారూ పిల్లలూ పడుకుంటారు. తలుపు తీసి ఓ కంచంలో ఇన్ని పదార్థాలు పడేసి పక్కకి తప్పుకుంటుంది శ్రీమహాలక్ష్మి. నేను తిని పడుకుంటాను''

"భగవంతుడా'' సబిత గట్టిగా అనేసింది.

అతను చెప్పులు వేసుకుని వీధి గుమ్మం దాటాడు. మెరుపులు మెరుస్తున్నాయి. కళ్లు చీరుకుపోతాయేమో అన్నట్లు ఉరుములతో గాలి దుమారం మొదలైంది. పెద్దపెట్టున గగ్గోలు పెడుతూ భోరుమంటున్నట్లు చెట్లు గాలితో కలిసిన చప్పుడుతో వినిపిస్తోంది.

కరెంటు పోయింది. "సబితా పాపం చీకటీ, వర్షం. వడగళ్లు పడుతున్నట్లున్నాయమ్మా. ఆ పిల్లాడు ఆగాల్సింది'' అంది అత్తగారు.

సబిత నిశ్శబ్దంగా వుండిపోయింది. ఆమె మెదడుకి పెద్ద దెబ్బతగిలినట్లు స్థబ్దుగా వుంది. సోఫాలో వెనక్కి వాలి కళ్లు మూసుకుంది.

★ ★ ★

ఉరుములేని పిడుగులా ఓ ఆదివారం ఆటో దిగి శ్రీమహాలక్ష్మి ఇంట్లోకి రాగానే సబితా, చలపతీ ఆశ్చర్యపోయారు. "ఇంత ప్రొద్దున్నే ఇంత చక్కగా... వావ్' అంది సబిత ఉండబట్టలేక.

శ్రీమహాలక్ష్మి హాయిగా నవ్వింది.

"పూరకరారు మహానుభావులు''

"బావగారితో పనుండే వచ్చాను. మీ గెస్ కరెక్టే' అంది సోఫాలో కూర్చుంటూ. సబితకి ఆశ్చర్యంగా, నమ్మలేనట్లుగా వుంది. చాలా ఏళ్ల తరువాత అప్పటి శ్రీమహాలక్ష్మి కనిపిస్తోంది.

"చెప్పమ్మా'' అన్నాడు చలపతి.

శ్రీమహాలక్ష్మి భుజాన వేలాడుతున్న సంచీలోంచి కాగితాల మడతల్ని అతని చేతికి అందించి సబితవైపు తిరిగింది. ప్రొద్దున్నే రాకపోతే బావగారు చిక్కరు. అందుకే పెందరాళే బయలుదేరాను. ఆదివారం కనుక యిడ్లీ, చట్నీ, సాంబారుతోబాటు కాఫీ కూడా వుంటుందని''

"ఇప్పుడే తీసుకురానా, పని అయేవరకూ ఆగనా''

"ముందుపని కానీయనీ''

"నిజమేనమ్మా! నేను మీటింగ్‌కి అటెండ్ కావాలి'' అంటూనే చలపతి ఆ కాగితాల్ని ఆ మూలనుంచి ఈ మూల వరకూ చూసి తన టేబుల్ కింద భద్రంగా పెట్టుకున్నాడు.

"ఒకే చేస్తున్నట్లేనా బావగారూ''

"తప్పకుండా. కానీ బిల్డింగ్..."

శ్రీమహాలక్ష్మి సంబరంగా చెప్పింది. "పూర్ణచంద్రరావుగారు ఆ ఏర్పాట్లు చేస్తానన్నారు'' అంది. నాందీ ప్రస్తావనా లేకుండా సబిత ముందుకు వంగి "దట్ వివిపి'' అంది గుర్తుచేస్తూ "నీది గవర్నమెంట్ జాబ్‌కాదా?"

"కాదు! అదీ, ఎగ్జాట్లీ ఓసారి స్క్వాడ్‌తో వచ్చారు. యూనియన్ లీడరు. తన దగ్గరున్న బిల్డింగ్ ప్రస్తుతం అద్దెకి ఇస్తానని చెప్పారు. కొన్ని పోస్టులకి ఎయిడ్ లేదు. అందులో నాదొకటి'' అంది.

"ఎంతమంది పడతారు?" చలపతి అడిగాడు.

"ఈజీగా హైస్కూల్ వరకూ రన్ చేయచ్చు. పోతే మీరు లోన్ ఇప్పించాలి. ఫర్నిచర్, పరికరాలు అన్నీ కావాలి కనుక''





"తప్పకుండా. గాడ్ బ్లెస్ యూ. చూడు శ్రీమహాలక్ష్మి! వీటిని నాలుగేసి కాపీలు చేయించి వుంచితే మంచిది. నీకు కబురు చేస్తాను'' అన్నాడు లేస్తూ.

శ్రీమహాలక్ష్మికి చాలా సంతోషంగా వుంది "పద టిఫిన్ తీసుకుందాం" అంది సబితతో.

టిఫిన్ తింటూ చెప్పింది శ్రీమహాలక్ష్మి. "ఎప్పుడూ ఏవో ఇబ్బందులు. వీటికో ఫుల్ స్టాప్ పెట్టాలంటే చొరవ తీసుకోవాలి. తెగించాలి. స్కూలు పెట్టి నష్టపోయిన వాళ్లెవరూ లేరీ ప్రపంచంలో. పిల్లల చదువుకీ ఇల్లు గడిచేందుకు డబ్బు సరిపోవడంలేదు. ట్రైనింగ్ పూర్తి చేశాను కనుక అటు డి.యి.వో గారి పర్మిషన్, ఇటు లోన్ రెండూ వస్తాయి. నేను చేయగలను. అందుకే ఈ నిశ్చయం తీసుకున్నాను''

"మంచి ఆలోచన"

"నాకు కలిగేదో కాదోగానీ పూర్ణచంద్రరావు గారే ప్రపోజ్ చేశారు''

"ఒక్కో పరిచయాలు విచిత్రంగా వుంటాయి. మనం ఇన్విజిలేషన్‌కి వెళ్లినప్పుడు చూశాను నేను. మంచి పర్సనాలిటీ''

"అప్పుడే నాకూ పరిచయం అయింది. ఆ తర్వాత నువ్వు స్కూలు మానేశావు. నేను యూనియన్ యాక్టివిటీస్‌లో పాల్గొన్నప్పుడు ఆయన కూడా వుండేవారు. అలా మన ఇంటికి రావడం జరిగేది. ముఖ్యంగా ఆయన వైష్ణవి కోసం వచ్చేవారు''

"వైష్ణవి కోసమా''

శ్రీమహాలక్ష్మి గడగడా చెప్పేస్తోంది. "ఆడపిల్లలు లేరు ఆయనకి. దీన్ని పెంచుకుంటాననేవారు''

"పాణిగ్రాహి ఏమంటాడు?"

"పాణిగ్రాహి ఏమీ అనడు. నేను ఏది చేసినా అతనికి ఇష్టమే''

"అయితే ఆ పిల్లని''

"ఆయనకి గుళ్లో దత్తు ఇచ్చేశాం"

నివ్వెరపోయింది సబిత. "ఏంచేసినా సెన్సేషనల్ అనుకుంటావా శ్రీమహాలక్ష్మి. ఆయనేదో పిల్ల బొద్దుగా ముద్దుగా వుందని అడిగితే ఇచ్చేయడమేనా? నీకు మాత్రం ఎంతమంది ఆడపిల్లలు వున్నారు''

"సబితా! నేను ఏది తోస్తే అది చేస్తాను. పిల్లల్ని కనగానే సరికాదు. వాళ్లని సక్రమంగా పెంచి పెద్ద చేసి వాళ్ల జీవితాల్ని వాళ్లకి అందించాలి. దినదినగండం నూరేళ్లాయుషులా చాలీచాలని జీతంతో... ఆ టైమ్‌కి అది మంచిదనిపించి ఇచ్చేశాం"

"వైష్ణవి ఎక్కడుంది?"

"మా ఇంట్లోనే''

"మరి?"

"అదంతే''

సబిత కాఫీ ఇచ్చింది. శ్రీమహాలక్ష్మి గబగబా తాగేసి "నేను వెళ్లొస్తాను'' అంది.

సబిత ఆమె చేతిని పట్టుకుని కూర్చోబెట్టింది. అయినా ఆమె ఎక్కువసేపు వుండలేదు. ఆమె ఎంత వేగంగా వచ్చిందో అంతే వేగంగా వెళ్లిపోయింది.

సబితకి దిగ్భ్రాంతి వల్ల కాళ్లూ చేతులూ ఆడడం మానేశాయి. ఈ లోపుగా స్నానం చేసి బయటికి వెళ్లేందుకు సిద్ధం అయిన చలపతి అక్కడికి వచ్చాడు. భార్యని చూడగానే అతనికి నవ్వువచ్చింది. భళ్లున నవ్వేశాడు కూడా. ఆ శబ్దానికి సబిత ఈ లోకంలోకి వచ్చింది. "ఎందుకు నవ్వుతారు?"

చలపతి సీరియస్‌గా అయిపోయాడు. "ఎందుకంత ఆశ్చర్యం? ఏం శ్రీమహాలక్ష్మి స్వశక్తితో పైకి రాకూడదా? మారకూడదా? ఎప్పటికీ అలాగే యాదురోమంటూ బతకాలనుకుంటున్నావా''

సబిత నిర్ఘాంతపోయింది.

"సబితా! శ్రీమహాలక్ష్మికి నీ ఒంతు సహాయం చేయి. ఆమె లేని ఉత్సాహం తెచ్చుకున్నట్లు నటిస్తున్నట్లుంది. నిశ్శబ్ద పర్వతాన్ని నమ్మకూడదు''



అతను డైనింగ్ టేబుల్ దగ్గరకి వెళ్లి తనే టిఫిన్ పెట్టుకుని గబగబా తినేశాడు. సబిత ఏమీ మాట్లాడకుండా అతని వెనుకే తిరుగుతోంది. అతను గుమ్మందాటుతూ "అమ్మా మరి నేను వెళ్లొస్తాను, పిల్లలూ వస్తాను'' అని సబిత బుగ్గమీద చిటికె వేశాడు. "వర్రీ అవకు. ఎవరి ఖర్మవాళ్లది''

అతను కారు మలుపు తిప్పేవరకూ తల్లీ పిల్లలూ అందరూ నిలుచుని చేతులు వూపారు.



**హో**రున వర్షం కురుస్తూంటే ఇంట్లో అడుగు పెట్టాడు పాణిగ్రాహి. పూర్తిగా తడిసి ముద్దై పోయాడు. తమలపాకులతో నోరు ఎర్రబడింది. అడుగులు తడబడుతున్నాయి. గాలికి తలుపు ధడేల్‌మందో లేక అతని చేయి తగలడంవల్ల గోడకి తగిలిందో శబ్దం విని నిద్రలో పిల్లలు కళ్లు తెరిచి మళ్లీ మూసుకున్నారు.

మూల గదిలో సుభద్రమ్మ మంచి నిద్రలో గురకపెడుతోంది. శ్రీమహాలక్ష్మి గుండెమీద చేయివేసుకుని హమ్మయ్య అనుకుంది. ఆవిడ మెలకువగా వుంటే ఆవలించకుండానే పేగులు లెక్కబెట్టి "అయ్యో శ్రీమహాలక్ష్మి నీ బతుకెలా అయిపోయిందే తల్లీ! అని ఆరునొక్కరాగం తీస్తుంది. శ్రీమహాలక్ష్మికి వళ్లు మండిపోతుంది. కొంపలంటుకుపోయినట్లు ఆవిడ గుండెబాదుకోవడం ఇష్టం వుండదు. పాణిగ్రాహి మామూలుగా వచ్చినప్పుడు ఎంత తటస్థంగా వుంటుందో అతను పీకలదాకా తాగినా అంతే నిశ్చలంగా వుంటుంది. ఏ రియాక్షనూ వుండదు.

పాణిగ్రాహి తువ్వాలు కోసం వెతుక్కుంటూంటే అది కనిపించలేదు. దండెంమీద పాత చీర లాక్కుని తల తుడుచుకున్నాడు. నోట్లోంచి చిన్నగా పాట వస్తోంది. అంటే తాగలేదు అని చెప్పడం. ఎదుటివాళ్లని నమ్మించాలనే ప్రయత్నం. వాసన రాకుండా కిళ్లీ వేసుకోవడం కూడా అందులో భాగమే. శ్రీమహాలక్ష్మి కళ్లు తెరిచి అతని చర్యల్ని గమనిస్తోంది. చీకటికీ వెలుగుకీ మధ్య వుంది. ఆమె ముఖ కవళికలు కనిపించడంలేదు.

"శ్రీమహాలక్ష్మి'' పాణిగ్రాహి లుంగీ కోసం వెదకడం మొదలు పెట్టాడు. ఆఖరికి దొరికింది. బాత్‌రూమ్‌లోకి వెళ్లి మొహం కాళ్లూ చేతులూ కడుక్కుని వచ్చాడు. తలుపు వేసి అదే గదిలో ఓ మూల చోటు చేసుకుని పడుకున్నాడు. "కుడి ఎడమైతే పొరబాటు లేదోయ్'' అతను మైకంలో పాడుతున్నాడు.

శ్రీమహాలక్ష్మి మనసు మూలల్లో ఎక్కడో గుచ్చుకున్నట్లయింది. అన్నం తినలేదు పాపం... హుం నిండా తాగాక తినేందుకు ఖాళీ ఎక్కడ వుంటుంది? మనిషిలో కసి ఇంత దారుణంగా వుంటుందా? ఎదుటి వ్యక్తి తనవాడే అయినా బూడిదా, మసీ అయిపోయేంత హీనస్థితికి రావాలని కోరుకుంటుందా? మానవ నైజంలో సురాసురులు తొంగిచూస్తూ వుంటారా?

అదృష్టదురదృష్టాలు ఎవరివి వారికే పరిమితం. తన దురదృష్టాన్ని మరొకళ్లమీదకి నెట్టివేయడం భావ్యమేనా?

పాణిగ్రాహి పురుషులందు పుణ్యపురుషుడు.

ఆ తల్లి కనుసన్నలలో అబ్బురాన పుట్టి ముద్దుబిడ్డ లాగే పెరిగాడు. ఆమె అదుపు ఆజ్ఞల్లో వ్యక్తిత్వాన్ని సంపాదించాడు. ఆ తల్లి గిరిగీసిన మేరకు అతి గొప్ప మనిషి అయాడు. ఆ స్త్రీ మూర్తి తన కొడుకు అని సగర్వంగా చెప్పుకోగల్గినంత ఔన్నత్యాన్ని సంపాదించుకున్నాడు.

మరి? తను అతని జీవితప్రాంగణంలోకి అడుగుపెట్టింది. అరచేతిలో వుసిరిపండులాగే చూసుకున్నాడు. అయితేనేం తన ప్రతి చర్యా అతన్ని బాధపెట్టింది.

దిగజారడం మొదలుపెట్టాడు. కొండ మీది బండరాయిలా అగాథంలోకి జారిపోతున్నాడు. అతన్ని ఆపలేదు.

శ్రీమహాలక్ష్మి లేచి వంటగదిలోకి వెళ్ళింది.అక్కడ కిరసనాయిల్ డబ్బా అగ్గిపెట్టే కనిపించాయి.

"నా ఈ అసంతృప్తిని నాలోనే అంతంచేయి. భగ్గున మండే నా గుండె మంటలు ఆ మంటల్తో కలిసిపోనీ. స్వామీ! ఓ స్త్రీ రూపుదిద్దిన చైతన్యాన్ని అచేతనం చేస్తున్న ఈ స్త్రీ మసైపోనీ'' కళ్ళు మూసుకుని సాహసం చేయబోయింది.

శ్రీమహాలక్ష్మి ఫెళ్ళున నవ్వింది. భౌతికంగా లేదామె. గుండె గుళ్ళోంచి నవ్వుతోంది. పిచ్చిదానా తొందరపడకు. నువ్వు కారణంగా కనిపిస్తున్నావు కానీ నువ్వు కానేకాదు.

నిద్రలో వైష్ణవి "అమ్మా'' అని కేకపెట్టింది. శ్రీమహాలక్ష్మి పరుగున వచ్చింది. వైష్ణవి పక్కమీద కూర్చుని తల్లికోసం అటూ యిటూ చూస్తోంది. చిన్నవాడు అరవింద్‌తో బాటు పెద్దవాడు లేచాడు. శ్రీమహాలక్ష్మి ముగ్గుర్నీ సరిగా పడుకోబెట్టి జోకొట్టసాగింది.

పాణిగ్రాహి నిద్రలో మూలుగుతున్నాడు.

శ్రీమహాలక్ష్మి నిట్టూర్చింది. ఆమె కంటికి నిద్రరాలేదు. తెల్లవారింది. పాణిగ్రాహి త్వర త్వరగా తయారై డ్యూటీకి వెళ్ళే ప్రయత్నంలో వున్నాడు. శ్రీమహాలక్ష్మి అతనికి కాఫీ యిచ్చింది. అతను నిశ్శబ్దంగా అందుకున్నాడు.

ఆమె కడుపులో సన్నగా మొదలైన మంట భగ్గుమంది! "ఎంత కాలం యిలా సాధిస్తారు పాణిగ్రాహీ! మీరు రోజురోజుకీ తాగడం ఎక్కువ చేస్తున్నారు''

అతను కాఫీ గ్లాసు కిందపెట్టేసి చిన్నగా నవ్వాడు.

"రాత్రి భోజనం కూడా చేయలేదు''

"అయినా బాగానే వున్నాను''

"మీరు...మీరు చాలా నిర్లక్ష్యంగా వుండడం వల్లేకదా ఇలా జరిగింది''

"నాకు టైము అయిపోయింది''

"టిఫిన్ తీసుకు వెళ్ళండి''

"కాంటీన్‌లో తింటాను''

అతను పరిగెత్తినట్లే వెళ్ళిపోయాడు.

పిల్లలకి బోలెడు అవసరాలు. ఎంత డబ్బు వచ్చినా సరే సరిపోవడంలేదు. వేళ్ళమధ్య సందుల్లోంచి నీళ్ళల్లా డబ్బు జారిపోతోంది. పాణిగ్రాహి! డబ్బు ఇస్తాడు... ఇవ్వడు. ఇస్తాడిస్తాడు. కట్టలు కట్టలుగా రూపాయి రూపాయిల్లా అంతకు మించే తీసుకుంటాడు. తన వల్లే యిలా జరిగిందా?

అతనికి ఇంట్లో వుండాలని వుండదు.

పిల్లలంటే ప్రేమ.

శ్రీమహాలక్ష్మి అంటే ప్రాణం.

కానీ ఆ రెండింటినీ సమన్వయ పరచలేక పోతున్నాడు.

జీవితం అంటే లేవడం పడుకోవడం మధ్య కార్యకలాపాల్ని నిర్వర్తించడం కాదు. అంతకు మించి మరేదో వుంది. .... బస్సులో ప్రయాణం చేస్తున్న పాణిగ్రాహి అదే సమయంలో శ్రీమహాలక్ష్మిలాగే ఆలోచిస్తున్నాడు.

బస్సు ఎక్కి కంపెనీలోకి వెళ్ళి తిరిగి బస్సు ఎక్కేవరకూ చాలా చాలా బుద్ధి

మంతుడు.

బస్సు ఎక్కినప్పుడు గత్యంతరంలేక ఆఫీసులోకి వెడతాడు. బస్సు దిగినప్పుడే అతనితోబాటు మనసు కోతి కూడా దిగుతుంది. కాళ్ళు బార్‌వైపూ మనసు ఇంటివైపూ లాగుతూంటాయి. మరుక్షణం మనసు బార్‌వైపూ కాళ్ళు ఇల్లువైపు లాగుతాయి. 'టగ్ ఆఫ్ వార్' రెండూ ఏకం అయి బార్‌లో స్థిరపడతాయి.

అందం ఆనందించడానికీ.

జీవితం అనుభవించడానికీ.

ఇల్లు... అదో నిర్జీవ శిలాప్రతిమలా కనిపిస్తుంది. తనకోసం ఎవరూ ఆలోచించరు.

చిన్న విషయాన్ని కూడా దుర్భిణిలో చూస్తుంటారు. తన నిర్లక్ష్యం, తన బాధ్యతారాహిత్యం, తన సోమరితనం తన వాచాలత్వం శ్రీమహాలక్ష్మి మనసుని తూట్లు చేసిందని అతనికి తెలుసు. అయినా దోషి నేరం వొప్పుకోడు. తన చేతులు బాహాటంగా చాపేసి ఎంత వీలైతే అంతదూరం వరకూ తన నిర్దోషిత్వాన్ని నిరూపించాలని అనవసర ప్రయాసపడతాడు.

శ్రీమహాలక్ష్మి అతనికి అదృష్టవశాత్తు దొరికిన భార్య.

పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు.

'బార్'లో అడుగుపెట్టగానే పూర్ణచంద్రావు కనిపించాడు.

"రండి'' అతని చుట్టూ చాలామంది వున్నారు.

పాణిగ్రాహి మొహమాటపడ్డాడు.

"ఫరవాలేదు రండి'' అతను బలవంతం చేశాడు.

ఓసారి బెట్టుసరి చేయడం నాగరికత. సబ్‌కాన్షస్‌లో యింక చాలు వెళ్ళి కూర్చోవచ్చు అంటుంది తాగుడికి అలవాటుపడ్డ ప్రాణం.





పూర్ణచంద్రావు చేతిలో కట్టలు. వ్యాపారవేత్తలు తమ వ్యాపారాల్ని వృద్ధిచేసుకునే విధానాల్లో భాగంగా 'బార్'లని ఆశ్రయించడం నాగరికతే.

పూర్ణచంద్రావు నవ్వుతూ జేబుల్లోంచి కట్టలు అందిస్తున్నాడు. ఓ పక్క లాయరు. మరోపక్క పార్టనర్లూ. అక్కడ సురాపానంతోబాటు లిక్విడ్ కాష్ బదిలీ అవుతోంది.

స్టీల్ షాప్

వైన్ షాప్

టూర్స్ అండ్ ట్రావెల్స్

ఫ్లాట్స్...

ఫ్లాట్స్...

పైసని రూపాయిగా, రూపాయిని ఏకంగా వేలల్లోకీ లక్షల్లోకీ మార్చే తెలివితేటలున్నాయి పూర్ణచంద్రావుకి. అతనితో చేయి కలిపితే 'సిరి' సరాసరి ఇంట్లోకే వచ్చేస్తుందని నమ్మకం వున్న వాళ్ళే అందరూ.

అక్కడ కాలాన్ని డబ్బుతో కొలుస్తారు.

పూర్ణచంద్రావు హైద్రాబాద్ వచ్చినప్పుడు కాళ్ళకి చెప్పులు కూడాలేవు.

అతని 'లక్ష్యం' కోట్లు సంపాదించాలని.

అతడాజానుబాహుడు. అరవింద దళాయ తాక్షుడు. చెంపకి చేరడేసి కళ్ళు, అవి పొగరుబోతు మైసూరు ఎడ్లకళ్ళల్లా వుంటాయి, కాటుక పూసుకున్నట్లు. విశాలమైన వక్షస్థలం లక్ష్మీసరస్వతుల నిలయంలా వుంటుంది.

అతను కష్టపడి డిగ్రీలు చదివాడు.

ముందు సరస్వతిని పట్టుకుంటే లక్ష్మి దానంతట అదే వస్తుందని గాఢమైన నమ్మకం.

"మిష్టర్ రావ్. మీకు చాలా థాంక్స్'' అగ్రిమెంట్లమీద సంతకాలు అయాయి. పార్ట్‌నర్స్ కృతజ్ఞతతో అభివాదం చేశారు. సగం మత్తులో పాణిగ్రాహి వాళ్ళనే తదేకంగా చూస్తున్నాడు. బార్‌లో నీలం దీపాలు అస్పష్టం అయిన వెలుగుల్ని యిస్తున్నాయి.

"పాణిగ్రాహీ! ఇంటిదగ్గర డ్రాప్ చేస్తాను

రండి''

"పదండి'' లేచి తడబడి నిలదొక్కుకుని అతని వెనుకే నడిచాడు. ఎక్కడి వాళ్ళు అక్కడ దిగిపోయాక పాణిగ్రాహిని ఇంటికి తీసుకు వచ్చాడు పూర్ణచంద్రరావు.

కారు ఆగిన శబ్దం విని తల్లీ పిల్లలూ బయటికి వచ్చారు. పూర్ణచంద్రరావుని చూసి శ్రీమహాలక్ష్మి ఒక్క అడుగు వెనక్కివేసింది. వైష్ణవిని ఎత్తుకుని ముద్దాడాడు అతను.

"శ్రీమహాలక్ష్మీ! పిల్లలు ఎక్కడ చదువు తున్నారు'' చెప్పింది... శ్రీమహాలక్ష్మి

"బాగా చీకటైపోయింది. వెళ్ళొస్తాను. అవసరం అయితే కలుసుకోండి పాణిగ్రాహీ''

అతను నిమిషం కూడా ఆగకుండా వెళ్ళి పోయాడు.

పరిమళం... తిరిగి అదే పరిమళం. మంచికీ, డబ్బుకీ మధ్య పొత్తుతో కలిసిన పరిమళం.

పాణిగ్రాహి చేతిని పట్టుకుని లోపలికి తీసుకువెళ్ళింది శ్రీమహాలక్ష్మి. పిల్లలూ, సుభద్రమ్మా పడకల్లో దూరారు.

భోజనం వడ్డిస్తూ అంది శ్రీమహాలక్ష్మి "ఆయన నీకెక్కడ కనిపించాడు?"

"రోడ్డుమీద"

"రోడ్డుమీద కనిపించగానే కార్లో తీసుకువచ్చేశాడు అంతేనా?"

"అవును''

"ముందు తాగావా, తాగాక కారెక్కావా?" శ్రీమహాలక్ష్మి తన నెత్తిమీద తనే రెండు అంటించుకుంది. "నీవల్లే మాటలు కూడా మర్చిపోతున్నాను. తాగిన... ఛీ... పోనీ ఇంకోసారి ఇలా అర్ధరాత్రీ అపరాత్రీ అనకుండా ఎవర్నిపడితే వాళ్ళని ఇంటికి తీసుకురావద్దు''

"అలాగే''

శ్రీమహాలక్ష్మి అంట్లు తీసి తోమేచోట పడేసింది. పాణిగ్రాహి సిగరెట్ వెలిగించుకున్నాడు. అతనికిప్పుడు భయంలేదు. బాహాటంగా తాగి రాగా లేనిది ఆఫ్టరాల్ పొగతాగడం ఓ లెక్కకాదు. శ్రీమహాలక్ష్మికి ఏడుపు వచ్చింది.

పాణిగ్రాహి ఆరుబయట కూర్చుని గుండ్రంగా పొగల్ని గాల్లోకి వుఫ్...వుఫ్‌మని వూదుతున్నాడు. ఆ పొగను గుండెల్నిండా పీల్చుకుంటున్నట్లు రింగుల్ని బట్టే తెలుస్తోంది.

శ్రీమహాలక్ష్మి మోకాళ్ళచుట్టూ చేతులు వేసుకుని మొహం ఆన్చి అతనివైపు చూస్తోంది. మనసులోకి చూస్తోంది. అతను సిగరెట్ పారేసి వచ్చి ఆమె పక్కనుంచే వెళ్ళిపోయాడు. శ్రీమహాలక్ష్మి చాప పరచుకుని పడుకుంది. ఆమె రైల్లో పాణిగ్రాహిని మరిచిపోలేదు.

★ ★ ★

మనోహరీ, యతీ కాలేజీలు తెరిచారు. అంచలంచలుగా వృద్ధిలోకి వచ్చారు. సిద్ధాంతాలకి కట్టుబడ్డారు. డబ్బు విలువ తెలుసుకున్నారు.

కార్లూ, ఎస్టేట్‌లూ, బ్యాంక్ బాలన్సులూ, సరస్వతీ పీఠాలు.

మనోహరి బాగా లావైంది.

యతీ అంతే.

బంగారం తొడుగు వుంది మనోహరికి.

యతి కొడుకు ద్వారక ఇంజనీరింగ్ పాసయ్యాడు. గాజుల చేయీ గాజుల చేయీ ఘల్లుమన్నట్లే. అతనికీ స్వంత సంపాదన వుంది. తల్లితండ్రులు సంపాదించింది బోలెడు.

శ్రీమహాలక్ష్మి సబితతో కలిసివచ్చింది.

మనోహరి సోఫా చూపించింది.

ఇప్పుడు కాంపౌండ్‌లో చాలా మార్పులు వచ్చాయి.

రెండేసి ఇళ్లు కొనేసి కొత్తవాళ్ళు అధునాతనమైన బంగ్లాలు కట్టారు. కాంపౌండ్‌లో తారు రోడ్లు వచ్చాయి.

అపార్టుమెంట్లు వచ్చాయి.

గేటుపక్కనే వుండే సాలెకిష్టయ్య అతి పెద్ద యినపకార్ఖానా మాయం అయిపో యింది. పొట్టిగా లావుగా నల్లగా ఆరుగురు అన్నదమ్ములకి పెద్దన్నగా ధర్మరాజుగా చలా మణీ అయిన కిష్టయ్యతోబాటు కార్ఖానా కూడా పోయింది. అక్కడ ఫ్లాట్లు వెలిశాయి. ఆ పక్కనే వేసవికాలంలో స్నానాలు చేసే పెద్ద దిగుడుబావి. దాంట్లోంచి ఆరడుగుల సిమెంట్ తొట్టిలాంటిది అందులోంచి ఆరడు గుల పొడవూ వెడల్పూ మూడడుగుల ఎత్తు వున్న మరో నీటితొట్టె యిప్పుడు లేవు. స్టేట్‌బ్యాంక్, పెట్రోలు బంకు వచ్చేశాయి. ఆ పాత కాంపౌండ్ పల్లెటూరికీ పట్నానికీ నిల యంలా వుండేది. ఇప్పుడు పట్నవాసమేమి టి...విదేశీ సంస్కృతి కూడా వొళ్ళు విరుచు కుంది.

మనోహరికి ఆ కాంపౌండ్ అచ్చివ చ్చింది. అందుకే వదలలేదు.

వంటావిడ టిఫిన్, కాఫీతో వచ్చింది. సబితా, శ్రీమహాలక్ష్మి కాఫీ మాత్రం తీసుకు న్నారు.

"ఈ కాంపౌండ్‌లో అడుగుపెట్టినప్పుడు లోలోపల చాలా భయపడ్డాను శ్రీమహాల క్ష్మీ! ఆ క్షణంలో నువ్వూ పెదనాన్నా లేకపో తే కర్రలతో బాదేసేవారే'

శ్రీమహాలక్ష్మికి నవ్వు వచ్చింది. "ఆ వేశం పాలు ఎక్కువ మనకి. అడ్వెంచర్ చేయడం అదో థ్రిల్'

మనోహరి కూడా నవ్వి "మంగళసూత్రా లు లేకపోతే ఏం, నల్లపూసలు, మట్టెలూ ఎందుకు వుండాలి అని ఎదురు ప్రశ్నవేసే స్వభావం. వొద్దన్నపని చేయాలనో లేదా నమ్మిన సూత్రంమీద నిలబడాలనో మొత్తాని కి ఆ చిన్నతనమే బాగుండేది. ఇప్పుడు టైమ్ లేదు'' అంది.

"ద్వారక ఏంచేస్తున్నాడు?" సబిత అడి గింది.

"వాడి బిజినెస్ వాడిది. కంప్యూటర్ యుగం. కంప్యూటర్ ప్రపంచం"

"వైష్ణవిని తీసుకురాలేదేం"

"కంప్యూటర్ క్లాసుకి వెళ్ళింది''

"చాలా రోజుల తర్వాత కలుసుకున్నాం. మీ స్కూలు ఎలా వుంది?"

"అంత బాగులేదు. తల్లితండ్రులు బీదవా ళ్ళు. ఫీజులు కట్టలేరు. కాళ్ళావేళ్ళా పడతా రు. కాదనలేం"

"ఫీజు తీసుకోపోతే ఎలా శ్రీమహాలక్ష్మి''

"వాళ్ళు పొట్టచూపించి ఏడుస్తుంటే గుండె తరుక్కుపోతుంది''

"అటువంటి వాళ్ళని చేర్చుకునేందుకు గవర్నమెంట్ స్కూళ్ళున్నాయి శ్రీమహాల క్ష్మీ''

నివ్వెరపోయింది శ్రీమహాలక్ష్మి. "పిల్లలు తెలివైన వాళ్ళు. వాళ్ళని వెళ్ళగొట్టడం నావ ల్లకాదు''

"టీచర్లకి జీతాలు ఎలా యిస్తున్నావు?"

"ఏంచేస్తాను? అప్పు చేస్తున్నాను''

"శ్రీమహాలక్ష్మి ఇప్పటివరకూ చేసింది చాలుగానీ ఆ స్కూలుని నేను కొనుక్కుంటా ను. నీకు జీతం గవర్నమెంట్ స్కేలు ప్రకారమే ఇస్తాను. జాలి కూడుపెట్టదు. ఇంకా అప్పుల పాలవకముందే అమ్మే సెయి''

మనోహరి మొహమాటం లేకుండా చెప్పే సింది. సబితకి ఈ సూచన బాగా నచ్చింది. శ్రీమహాలక్ష్మికే మనసు కలుక్కుమంది. "అ నవసరంగా ఈ విషయం ఎందుకు ఎత్తావు స్వామీ'' అనుకుంది.

శ్రీమహాలక్ష్మి మౌనంగా వుండిపోవ డంతో మనోహరి మరోసారి హెచ్చరించింది. "నీకేదో అపకారం చేయాలనీ నేను లాభాలు గడించేయాలనీ అనుకోవడం లేదు. ఆలో చించుకో'

"సరే' అంది. గొంతువరకూ వచ్చి ఆగి పోయిన విషయాన్ని గట్టిగా చెప్పలేకపో యింది. సబిత వైపు చూస్తే "ఇప్పుడు





కాదన్నట్లు'' సైగచేసింది. కొద్దిసేపు వుండి వెళ్ళిపోయారు.

★ ★ ★

పిల్లల్ని తీసుకుని పూర్ణచంద్రరావు వుండే మెయిన్ ఆఫీసుకి వెళ్ళింది. అన్ని వ్యాపారాలూ వృక్షంలో శాఖల్లా ఆంధ్రప్రదేశ్ మొత్తం శాఖోపశాఖలుగా విస్తరించి వున్నాయి.

అకౌంట్లూ, ఆడిటింగ్ మొత్తం వ్యవహారాలన్నీ మెయిన్ ఆఫీసులో పూర్ణచంద్రరావు పర్యవేక్షణలో జరుగుతూ వుంటాయి. శ్రీమహాలక్ష్మికి అతనికోసం నిలుచుని పడిగాపులు కాసే అవసరంలేదు. తలుపు తీసుకుని చొరవగా వెళ్ళిపోతుంది. ఆమె వస్తే చేస్తున్న పనులన్నీ పక్కకి పెట్టేస్తాడు అతను.

పరశురామ్ తమ్ముడిని తీసుకుని వెళ్ళిపోతూ తల్లితో చెప్పాడు. "నువ్వు పని ముగించుకుని ఇంటికి వెళ్ళిపోమ్మా. నేనూ తమ్ముడూ కొంచెం లేటుగా వస్తాం. లైబ్రరీకి కూడా వెళ్ళి. రావాలి''

"ఈమధ్య ద్వారక కనిపించాడా''

పరశురామ్ ఆమె భుజంమీద ఆప్యాయంగా చేయివేసి నొక్కి వదిలేశాడు. "నువ్వేం కంగారుపడకు. అన్నీ సవ్యంగా జరుగుతాయి''

శ్రీమహాలక్ష్మి విశాలమైన కళ్ళు తన కంటే ఎత్తు ఎదిగిన కొడుకు వైపు తనివితీరా చూశాయి. నిన్నమొన్న పుట్టినట్లూ యింకా ఆ నొప్పుల బాధ కలుక్కుమన్నట్లే వుంది. ఆరడుగులు పెద్దవాడుంటే తనేం తక్కువకాదన్నట్లు మరో రెండు అంగుళాలు ఎదిగాడు చిన్నవాడు అరవింద్.

వైష్ణవి బొమ్మలా వుంది. పిల్లలు అటువెళ్ళగానే కార్లోంచి దిగిన పూర్ణచంద్రరావు కూతుర్నీ శ్రీమహాలక్ష్మినీ చూసి "ఫోన్ చేయాల్సింది వైష్ణవీ'' అన్నాడు.

వైష్ణవి మొహం ఎర్రబడింది. "చాలాసార్లు చేశాను. రాలేదని చెప్పారు. మీరీమధ్య బొత్తిగా రావడం మానేశారు నాన్నగారూ. మనింట్లో ఫోన్‌కూడా లేదు''

"పదండి'' అతను ఆఫీసురూమ్‌లోకి అడుగుపెడుతూ కూతురు చేతిని అందుకుని "సో సారీ డియర్, ఇదిగో పరశురామ్‌తో చెప్పి ఇప్పుడే ఫోన్ విషయం చూసుకోమని చెబుతాను ఓ.కే' అని "ఇప్పుడు చెప్పు" అన్నాడు తను కూర్చుని వాళ్ళని "కూర్చోమని'' చెబుతూ.

శ్రీమహాలక్ష్మి గంభీరంగా వుండడం అతనికి నవ్వు తెప్పించింది. "ఏమిటి విశేషం" అని అడిగాడు.

చీరకొంగు వేలికి చుడుతూ తీస్తూ నెమ్మదిగా చెప్పింది. "ద్వారక" ఆపేసింది.

వైష్ణవి పక్కనేవున్న మరో గదిలోకి వెళ్ళింది. అక్కడ అతను తన ఇష్టదైవాల్ని కూర్చోబెట్టాడు. ఆ గదినిండా అన్ని దేవుళ్ళు వున్నారు. నిత్య ధూపదీప నైవేద్యాలతో పూజ చేసేందుకు బ్రాహ్మణుడు వస్తాడు. ఆ గది పాలరాళ్ళతో కట్టించాడు. గంధం వాసన వస్తోంది. వైష్ణవి అక్కడ నేలమీద కూర్చుని చేతులు జోడించింది.

శ్రీమహాలక్ష్మి చెబుతోంది. "ద్వారక మీకు తెలుసుకదా'

"మనోహరీ, యతీ... వాళ్ళబ్బాయే కదూ. చాలాసార్లు చూశాను. పరశురామ్‌తో వస్తూంటాడు''

"మన వైష్ణవిని పెళ్ళిచేసుకుంటానని చెప్పాడు''

"ఈ విషయం అతని తల్లితండ్రులకి తెలుసా?"

"తెలుసు''

"వాళ్ళేమంటారు?"

"వాళ్ళకీ యిష్టమే''

"మరి ఆలశ్యం దేనికి?"

"ఆలశ్యం మన దగ్గరే'

"దానిదేంవుంది. చేసేద్దాం"

"ముహూర్తాలు..."

"ఓ.కే. శ్రీమహాలక్ష్మి నువ్వేం బాధప

డకు నేను వున్నాను. అన్నీ చూసుకుంటాను. పాణిగ్రాహిని పంపించు'' అతను మాట పూర్తిచేయలేదు. శ్రీమహాలక్ష్మి-అహంకారం, అహంభావం, దర్పం, టీవీ, గర్వం, ఓ మనిషిలో ఏవైతే వుండకూడదో అన్ని లక్షణా ల్నీ పుణికిపుచ్చుకున్న స్త్రీ మూర్తి అప్రయ త్నంగా అతని పాదాలమీద పడిపోయింది. ఆమెలో ఘుచ్చుకైనా అంతక్రితం కనిపించిన లక్షణాలు లేవు.

కన్నీటితో అతని పాదాల్ని అభిషేకం చేస్తోంది. అతను తేరుకుందుకు చాలా టైమ్ పట్టింది. ఆపైన కంగారుగా ఆమె భుజాల్ని పట్టుకుని లేవదీశాడు "ఛ! తప్పు. నా కూతురి పెళ్ళి చేయడంకోసం నువ్వు యిలా చేయకూడదు'' అన్నాడు.

ఎగిసిపడే దుఃఖాన్ని ఆపే ప్రయత్నం చేయలేదు ఆమె.

"నేను వున్నాను. నీకూ పిల్లలకీ అన్యాయం జరగదు''

"వైష్ణవీ'' అనగానే "వస్తున్నా నాన్నా'' అంటూ వచ్చింది.

డ్రైవరుతో వాళ్లని ఇంటికి పంపేశాడు అతను.

★ ★ ★

శ్రీమహాలక్ష్మి స్కూలు అమ్మేసింది. మనోహరే కొనుక్కుంది. ఆవేళ భోజనం చేయాలనిపించలేదు ఆమెకి. తన పిల్లలతోబా టు దాన్ని పెంచి వృద్ధి చేయాలనుకుందిగానీ నిజాయితీతో వ్యాపారాలు చేయలేం అనే గుణపాఠాన్ని నేర్చుకుంది. బాంక్‌లోన్ తీర్చే యగా వేయి రూపాయలు కూడా మిగల్లేదు. కాళ్లీడ్చుకుంటూ ఇంటికి వచ్చి కుర్చీలో కూలబడింది. పాణిగ్రాహి ఇంకా ఇంటికి రాలేదు.

పరశురామ్ వచ్చి తల్లికి కొంచెం దూ రంలో కూర్చున్నాడు. వైష్ణవి మొహం ఎర్రబ డి బుసలు కొడుతోంది. అప్పటికి సాయంత్రం ఆరుగంటలు కాలేదు. అరవింద్ చేతిలో పుస్తకం వుంది.

"అమ్మా'' అని పిలిచింది శ్రీమహాలక్ష్మి.

సుభద్రమ్మ కాఫీ గ్లాసు అందిస్తూ ము క్కు ఎగపీలుస్తూంటే శ్రీమహాలక్ష్మి కనుబొ మ్మలు ముడిపడిపోయాయి. తమాయించు కుని నిశ్శబ్దంగా వుండిపోయింది.

పరశురామ్ చాలాసేపటికి అన్నాడు, "నీ కో షాకింగ్ న్యూస్ చెప్పాలనుకుంటున్నాన మ్మా''

చప్పున తలెత్తి కొడుకు వైపు చూసిందా మె.

"అమ్మమ్మ చెబుతోంది. వైష్ణవి తండ్రి పూర్ణచంద్రరావుట. నిజమేనామ్మా. అమ్మ మ్మ మరెవరోకాదు నీ తల్లే! ఆవిడ అబద్ధం చెప్పదుగదా! యామై కరెక్ట్''

శ్రీమహాలక్ష్మి చేతిలోంచి గ్లాసు జారిపో యేదే ఠక్కున గట్టిగా పట్టేసుకుంది. ఒక్క సారి మొహంలో వున్న రక్తాన్ని పీల్చేసినట్లు తెల్లగా పాలిపోయింది. కాఫీ తాగడం ఆపలే దు. వణుకుతున్న శరీరాన్నీ, పెదవుల్నీ కదలనీయకుండా పట్టుకునే ప్రయత్నం చే స్తోంది. కాళ్లల్లో నిస్సత్తువ ఏర్పడింది. కాఫీ గ్లాసు కిందపెట్టి తల్లివైపు చూసింది.

ఆవిడ ముసుగు సవరించుకుని "అలా అని అందరూ అనుకుంటున్నారు'' అంది.

"అందరూ.. ఎవరమ్మా ఆ అందరూ''

"మీ అక్కలు''

శ్రీమహాలక్ష్మి కాళ్లకింద భూమి కదిలినట్ల యింది.

అక్కలు.. ఎవరు? ఎప్పటివాళ్లు? ఎక్క డినుంచి వచ్చారు? ఎలా వుంటారు? తండ్రి చచ్చిపోతే రాలేదు. ఆర్థికంగా చితికిపోయి ఆధారంలేనప్పుడు రాలేదు. ఇవాళ వున్న ట్లుండి ఎక్కడినుంచి వూడిపడ్డారు. అసలు తనకి సంబంధించినంతవరకూ తన వాళ్లు న్నారా? పూర్ణచంద్రరావుగారి స్నేహం యా ధృచ్ఛికం. ఈ సంగతి అమ్మకి తెలుసు.

"ఎవరమ్మా ఈ అక్కలు? ఎక్కడనుంచి




వచ్చారమ్మా వీళ్లు?"

పరశురామ్ ఆ మధ్యాహ్నం పోస్టులో వచ్చిన ఉత్తరాన్ని తల్లిచేతికి ఇచ్చాడు.

"నిప్పులేనిదే పొగరాదంటారు. ఈ విషయం తెలుస్తే యతీ అంకుల్, మనోహరి ఆంటీ అప్రతిష్ట అనుకుంటారమ్మా. అందుకు ఆయన్ని మన ఇంటికి రానీయకుండా వుండడమే మంచిది'' వైష్ణవి ఇంకా ఏదో అనబోయింది.

"వైష్ణవీ'' చెంపఛెళ్లుమనిపించబోయిన చేయి ఆగిపోయింది.

"నా జీవితం పాడు చేయకమ్మా! నీకు దండం పెడతాను. ఎవరో చెబితే నమ్మేవాళ్లంకాదు. సాక్షాత్తూ నీ తోడబుట్టిన వాళ్లూ, నిన్ను కన్నతల్లీ..."

"అమ్మా'' శ్రీమహాలక్ష్మి కుర్చీలోంచి లేచి తల్లివైపు వెళ్లి ఆమె రెండు భుజాలు పట్టుకుని కుదిపింది. చెప్పమ్మా. నీకు నిజం తెలుసు. వైష్ణవి పురుడు నువ్వు పోయలేదూ''

ఆవిడ జవాబు చెప్పలేదు.

"ఛీ'' శ్రీమహాలక్ష్మి చేతులు వదిలేసింది.

ఆ సాయంత్రం ఆమె వంట ఇంట్లోకి అడుగుపెట్టలేదు. శ్మశానంలాంటి నిశ్శబ్దం ఆ ఇంటినీ, ఇంట్లో మనుషుల మనసుల్నీ ఆక్రమించుకుంది. శ్రీమహాలక్ష్మి మంచానికి అతుక్కుపోయింది. రెక్కలు ముక్కలు చేసుకుని పిల్లల్ని చదివించింది. పెద్దపెద్ద ఫీజులు కట్టాల్సి వచ్చినప్పుడు ఆదుకున్నది పూర్ణ చంద్రరావే.

ఓ మగ మనిషి మరో ఆడ మనిషికి సాయపడడం అనేది కేవలం శారీరక సంబంధం ఉంటేనే జరుగుతుందా. రుణానుబంధాలు అని గొంతెత్తి అరిచి గీ పెట్టుకుని చెబుతారు. ఇది వర్తించదా. ఓ స్త్రీకి మరో పురుషుడికి మధ్యగల అనుబంధానికి ఇంత వక్రభాష్యం కూడా చెప్పచ్చునా? తను ఇంత పెద్దదయ్యాక తన అక్కలు ఎప్పుడు చూశారు? తన తల్లి ఈ నిజాన్ని తన పిల్లల ఎదుట ఎందుకు చెప్పలేకపోతోంది?

ఆవిడకి కూడా సందేహమా?

వైష్ణవి ఎంత పెద్దదైపోయింది?

ఆరిందాలా మాట్లాడుతోంది.

పాలుతాగి రొమ్ముగుద్దడం అంటే ఇదేనా? పాణిగ్రాహి వస్తూనే "శ్రీమహాలక్ష్మీ! పిల్ల పెళ్లికి లోన్ శాంక్షన్ అయింది'' అని చెప్పాడు హుషారుగా.

ఆమె దిగ్గున లేచి లేని నవ్వుని మొహం మీదకి లాక్కుంది. "ఎంత?"

"ఇరవై వేలు''

"పోనీండి అదే చాలు'' అంతకుమించి ఏం మాట్లాడాలో తోచలేదు. అతనికి టిఫిన్, టీ అందించింది. అంతక్రితం ఏమీ జరగనట్లే ఎవరికివారు హడావుడిగా తమ పనుల్లో నిమగ్నం అయ్యారు. పాణిగ్రాహి చాలా వుత్సాహంగా వున్నాడు. ఎందుకంటే మును పెన్నడూ అంత చేరువగా లేని పిల్లలు తన చుట్టూ తిరుగుతున్నారు. అతను బాగా దాహంవేసి ఎండిపోయిన నాలుకమీద చిన్న చినుకు పడితే బావుండును అని ఎదురుచూసే బాటసారిలా వున్నాడు. ఒక చుక్కనీరేం ఖర్మ తీయని నదీజలాలు నాలుకనీ, ఆత్మనీ, శరీరాన్నీ తడిపేస్తున్నాయి. అతను మునిగి తేలుతున్నాడు.

పిల్లలు ముగ్గురూ అతని చుట్టూ చేరి పరోక్షంగా తల్లిమీద నిరసన వ్యక్తం చేస్తున్నారు. పాణిగ్రాహి భోళా మనిషి. అతనికిటువంటి విద్యలు తెలీవు.

శ్రీమహాలక్ష్మి ఈ సంబరాన్ని రోజూ ప్రొద్దునా, సాయంత్రం చూస్తోంది. ఇంతబాగా నటించగలరా తన పిల్లలు. ఎవరి జీన్స్? తనకీ, పాణిగ్రాహికీ కుండబద్దలుకొట్టడం తెలుసు. ఇలా నాటకీయంగా కాలక్షేపం చేయడం తెలీదు.

వైష్ణవి తండ్రిని దేనికో డబ్బు అడుగుతోంది.



దూరంగా కూర్చుని పిలవాల్సిన స్నేహితుల్నీ, కొలీగ్స్‌నీ లిస్టు రాసుకుంటున్న శ్రీమహాలక్ష్మి తండ్రీ కూతుర్ని ఓ వైపు గమనిస్తోంది.

"నా దగ్గర అంత డబ్బు ఎక్కడిదమ్మా. మీ నాన్నగారికి ఫోన్ చేయకపోయావా'' పాణిగ్రాహి అమాయకంగా కూతురి శిరసు నిమిరాడు. వైష్ణవి కటువుగా జవాబు చెప్పింది. "నన్ను మీరు కన్నారా ఆయనా''

శ్రీమహాలక్ష్మికి వెన్నెముక విరిగినట్లయింది.

పాణిగ్రాహి నవ్వి "ఓహ్.. నేనే కన్నాను. సారీ మీ అమ్మ కన్నది. కానీ పూర్ణచంద్రరావు నీకు తక్కువ చేయడమ్మా''

వైష్ణవి దిగ్గున లేచి వెళ్ళిపోయింది. పాణిగ్రాహి గమనించలేదు.

★ ★ ★

శ్రీమహాలక్ష్మి మాట్లాడడం తగ్గించేసింది. తల్లి అవసరం పిల్లలకి లేనట్లే ప్రవర్తిస్తున్నారు. ఆమె తల్లి కూడా మాట్లాడడం మానేసింది. గోడమీద గడియారం తిరుగుతూ తన పని తను చేసుకుపోతున్నట్లే ఇంట్లోకి కావాలసిన వస్తువులూ, పిల్లల ఫీజులూ వాళ్ల అవసరాలూ గుర్తుపెట్టుకుని అమర్చిపెడుతోంది.

ద్వారక వచ్చి వెడుతున్నాడు.

మనోహరికి శ్రీమహాలక్ష్మి పట్ల కృతజ్ఞత వుంది. అది ఇప్పటిదికాదు. పైలైట్ కాంపౌండ్‌లోకి అడుగుపెట్టినప్పుడు ఏర్పడిన భావం అది. ఆవేళ నవవధువుగా అత్తవారింట్లో కాలుపెట్టినట్లు ఇబ్బందిగా, భయంగా, ఒద్దికగా ఎటూ పాలుపోని సందర్భంలో అత్తింటి ఆడపడచులాగే శ్రీమహాలక్ష్మి సాదరంగా ఆహ్వానించినట్లు అనిపించింది.

మనోహరి అప్పటికీ ఇప్పటికీ మట్టెలూ, మంగళ సూత్రాలు పెట్టుకోనేలేదు. రెండు ఆత్మలు ఒకదానికొకటి గౌరవం ఇచ్చిపుచ్చుకోవడం, ఇష్టాలు పంచుకోవడం, శరీరాలు ఏకం చేసుకోవడం వీటిని మించిన పెళ్లి వేరే లేదంటుంది. అదీ నిజమేనేమో. ఆకాశం అంత పందిరి, భూదేవంత అరుగూ వేసి ఆడంబరంగా, ఆర్భాటంగా చేసే పెళ్లిళ్లు ఎన్ని సక్సెస్ అవుతున్నాయి?

ఆ రోజు శ్రీమహాలక్ష్మి, సబితా వచ్చి వెళ్లినప్పుడే అనుకుంది మనోహరి. ఈమధ్య తరుచు శ్రీమహాలక్ష్మి ఇంటికి కొడుకు వెళ్లడంచూసి చిన్నప్పటి స్నేహితులు అని వూరుకోవాలనిపించలేదు ఆమెకి.

పరశురామ్ మెడిసిన్ చదివి హౌస్‌సర్జన్ చేస్తున్నాడు. ద్వారక ఇంజనీరింగ్ పాసయాడు.

వీళ్లిద్దరి స్నేహం చదువు విషయంలో అయితేకాదు. కొడుకుని గాలంవేసి లాగేంత శక్తి వైష్ణవి అందచందాలకు, చదువుకు వున్నాయి. వైష్ణవి ఎమ్.బిఏ చేస్తోంది. ఓ యువకుడు తన జీవిత భాగస్వామిని గూర్చి కలలుకంటే ఆమె వైష్ణవి కంటే అద్భుతంగా వుండకపోవచ్చు.

మనోహరికి ఆ పిల్లంటే ఇష్టం. ఎవరో తెలీని వ్యక్తుల్ని కలుపుకునే కంటే స్నేహితురాలి కూతుర్నే కోడలిగా చేసుకోవడం మంచిది అన్నాడు యతి. మరి మనోహరి నో అనదు. వైష్ణవి అందం, సంస్కారం, అణకువ అన్నీ మనోహరికి నచ్చాయి.

ఇక్కడ డబ్బు ప్రసక్తిలేదు. కొడుకు ఇష్టాన్ని తాము కాదు అనలేరు. పాణిగ్రాహి మొదటినుంచీ తెలుసు. ఆర్థిక పతనం ప్రారంభిస్తే నైతిక పతనం చేరువౌతుంది. అటువంటి దుర్గంధ భూయిష్టమైన వాతావరణంలోంచి ఆ పిల్లని బయటికి అంటే తమ ఇంటికి వీలైనంత త్వరగా తెచ్చుకోవాలి.

శ్రీమహాలక్ష్మికి మిగతా ఇద్దరూ మగపిల్లలే. వాళ్ల గురించి బెంగలేదు. ద్వారకా, పరశురామ్ ఇద్దరూ తల్లితండ్రులకి చెప్పడంతో ఫార్మాలిటీస్ అంటూ తతంగం ఏమీ జరగలేదు.

పాణిగ్రాహికి ఇంట్లో జరిగే ఏ విషయమూ తెలీదు. ఒకవేళ తెలిసినా తెలియనట్లే వూరు




కుంటాడు. తన నెత్తిమీద ఏ భారమూ పడనంతవరకూ నిశ్చింతే నిశ్చింత.

★ ★ ★

పబ్లిక్ గార్డెన్‌లో జనం పలచబడుతున్నారు. దూరంగా ఓవైపు లాన్‌లో శ్రీమహాలక్ష్మి తోబాటు సబితా, మనోహరీ కూర్చున్నారు. శ్రీమహాలక్ష్మి మాటిమాటికీ కళ్లు తుడుచుకుంటోంది. ఆమె భుజంమీద చేయివేసి సబిత ఓదారుస్తోంది.

"నువ్వంటే నాకు ఇష్టం శ్రీమహాలక్ష్మి. ఆ కారణంగా నేను నీ కూతుర్ని కోడలిగా చేసుకోవడం ఒక పాయింట్ అయితే అనేక ప్లస్ పాయింట్స్ వైష్ణవిలో వున్నాయి. వైష్ణవిని కన్నతండ్రి పాణిగ్రాహే అని నాక్కూడా తెలుసు. అయినా నేను ఎలుగెత్తి చెప్పలేను'' అంది మనోహరి.

"ఏం ఎందుకు చెప్పలేవు మనూ? నేనేం తప్పుచేశాననీ''

"తప్పు నువ్వు చేయలేదు. కానీ నేను నీ తరపున వకాల్తా పుచ్చుకోలేను''

"ఎందుకనీ అని అడుగుతున్నాను''

మనోహరి బుర్ర అడ్డంగా వూపి "తెలీదు. ఘర్షణ ఇష్టంలేదు. చిరిగిన గుడ్డ కుడుతుంటే చిల్లు పెద్దదౌతుంది. నేను కాదన్నకొద్దీ నిజం అంటుందీ లోకం. అది నేను ఫేస్ చేయలేను''

"నువ్వూ నమ్ముతున్నావా?"

"లేదు.. అయినా కొన్నిసార్లు పరిస్థితులకి లొంగిపోవాలి. వైష్ణవిని మా ఇంటికి తీసుకువెళ్లాక తిరిగి ఆ పిల్లని పంపమని అడగద్దు. అందుకే ఇక్కడికి పిలిచాను''

మనోహరి నిశ్శబ్దం అయిపోయింది.

సబిత నివ్వెరపోయింది. చిన్నగా దూది వాములో పడ్డ అతి చిన్న నిప్పురవ్వ వూళ్లూ పూళ్లూ మింగేసినట్లే... శ్రీమహాలక్ష్మి మీద పడ్డ అపనింద నిజం వరకూ వచ్చింది.

శ్రీమహాలక్ష్మి పిడికిళ్లు బిగుసుకుంటూంటే ఆ వ్రేళ్లని రెండు చేతుల్తో పట్టుకుని సబిత విడదీస్తూ "ఆవేశం వద్దు. మనం పిల్లని ఇచ్చుకునే వాళ్లం. ద్వారక, వైష్ణవీ పెళ్లి గురించి అందరికీ తెలిసిపోయింది. ఇప్పుడు వాళ్ల జీవితాల్తో ఆడుకోవడం దేనికి చెప్పు?" అంది శాంతపరుస్తూ.

మనోహరి మొహం ఎర్రబడింది. కళ్లల్లోనీళ్లు వచ్చాయి. ఏదో కోపం ఎవరిమీదో తెలీదు. నిస్సహాయురాలిలా వుండిపోయింది.

"పదండి వెడదాం" అంది తను లేస్తూ.

సబిత స్నేహపూర్వకంగా ఆమె చేతిని అందుకుని "మేం వేరే ఆటోలో వస్తాం. మూడ్ బాగులేనప్పుడు ఎవరిదారిన వాళ్లు వెడితేనే మంచిది'' అంది.

"అయితే మరి నేను వెళ్లొస్తాను'' అని వెళ్లిపోయింది మనోహరి.

శ్రీమహాలక్ష్మి కళ్లు జలపాతాలయ్యాయి. సబిత చాలాసేపు వూరుకుని చివరికి అంది "బాధపడకు''

నిజాన్ని నిరూపించేందుకు చాలా కష్టపడాలి.

అబద్ధాన్ని నిజం చేయడానికి అంత అవస్థ అవసరంలేదు. అదిగో పులి ఇదిగో తోక సామెత లాంటిది. దొంగని దొంగ అంటే నిర్ఘాంతపోడు. నిర్దోషినే దొంగ అంటే వురిపోసుకుని చచ్చిపోతాడు.

★ ★ ★

వైష్ణవి చాలా ఉత్సాహంగా వుంది. పూర్ణచంద్రరావు కావలసిన వన్నీ డ్రైవరుతో పంపిస్తున్నాడు. అన్నీ డబ్బాల్లో సీల్ చేసినట్లు వున్నాయి. ఫంక్షన్ పాలెస్ మాట్లాడడం అయిపోయింది. శుభలేఖలు వచ్చేశాయి. చీరలూ, సారెలు, నగలూ...

పూర్ణచంద్రరావు భార్యకి ఇవేవీ తెలియవు. చెప్పాలని అతను అనుకోడు. పది చేతుల్తో సంపాదిస్తున్నప్పుడు ఓ చేత్తో దానధర్మాలూ శుభకార్యాలూ, గుళ్లూ గోపురాలు ఇలాంటివి చేయాలని అతని సిద్ధాంతం.

బట్టలో మూట కట్టుకోవలసినవి జల్లెడతో జల్లించకూడదు అంటుంది భార్య భాను మతి. అతని దానధర్మాలు తెలిసినప్పుడు ఇల్లంతా ఓ కొలిక్కి తీసుకువస్తుంది. అందు కే అతను తెలియనీయడు.

ద్వారక బంధువర్గంలోని పిల్లల్ని చ్చేందుకు గతంలో చాలామంది హడావుడి పడ్డారు. వారంతా ఇపుడు శ్రీమహాలక్ష్మి కూతురు ఏం సిరి వెంటబెట్టుకు వస్తుందోనని ఎగతాళిగా ఎదురుచూస్తున్నారు.

ఆ ఉత్సాహంమీద పూర్ణచంద్రరావు తెర వెనుకనుండి నీళ్లు చల్లాడు. వూహకి అంద నంత ఘనంగా చేస్తున్నారు పెళ్లి.

పాణిగ్రాహికి అంత డబ్బు ఎక్కడిది?

"శ్రీమహాలక్ష్మి అందం పణంగా పె ట్టిందిట, అసలు వైష్ణవి ఆయన కూతురేనట"

హోరెత్తే మంత్రాలతో గింగుర్లెత్తే బాండ్ మేళంతో వైష్ణవి పెళ్లకూతుర్లై ఆ పైన ద్వారక ఇల్లాలై అన్ని శుభకార్యాలూ ఒకటొకటే అయిపోయాక తన ఇంటికి వెళ్లిపోయింది. అదే హాల్లో మరో పెళ్లి కొన్ని గంటల్లో జరగబోతోంది. అంతకు ముందున్న షామి యానా, లైట్లు అన్నీ తీసేశారు. ఓ వైపు చీపుర్లతో తుడిచేస్తున్నారు. మరోవైపు హాలుకు కొత్త రూపాన్ని దిద్దుతున్నారు.

బంధువులు, స్నేహితులు, కొలీగ్స్ అంద రూ వెళ్లిపోయారు. చలపతీ, సబితా పిల్లలతో శ్రీమహాలక్ష్మికీ పాణిగ్రాహికీ తోడుగా వుండి మిగిలిన ఏర్పాట్లు చూస్తున్నారు.

పూర్ణచంద్రరావు పంపిన వాన్‌లో అంద రూ ఇంటికి చేరుకున్నారు. స్థిమితపడ్డాక సబిత వెళ్లిపోతూ "బాధపడకు'' అంది.

దేనికి. బాధపడాలో, కూడదో అర్థం కాలే దు.

అలసిన పిల్లలూ, అమ్మా, పాణిగ్రాహి పడుకున్నారు.

అలసిసొలసి సగమై, మిగిలేందుకు ఏమీ లేనిదై కంటికి నిద్ర దూరమై వారం క్రితం తను చేసిన పనిని గుర్తు చేసుకుంటూంటే మాత్రం శ్రీమహాలక్ష్మికి ఆనందంగా తోచింది.

★ ★ ★

రివాల్వింగ్ ఛెయిర్‌లో కూర్చుని విధీ విరామం లేని ఫోన్లతో తలమునకలౌతున్న పూర్ణచంద్రరావు స్ప్రింగ్‌డోర్ కొట్టుకోగానే వులిక్కిపడి తల పైకెత్తాడు.

శ్రీమహాలక్ష్మి రెండు చేతులూ జోడించి దగ్గరగా వచ్చి అతని పాదాలమీద వాలిపో యింది.

"ఏమైంది? ఏం జరిగింది? డబ్బు ఏమై నా కావాలా''

ఛివాల్న తలెత్తింది ఆమె. ఆమె చూపుల్లో అగ్నివర్షం కురుస్తోంది. కళ్లు కెంపుల య్యాయి. పెద్దగా, ఎర్రగా, దీపంలావున్న కుంకుమ చెమటవల్ల కొద్దిగా పక్కకి జరి గింది.

అతనామె భుజాలు పట్టుకుని లేవదీయ బోయాడు. ఆమె ఆ రెండు పాదాల్నీ వదల్లే దు.

ఆమె ఏడుస్తోందని మాత్రం గ్రహించాడు. ఆమెను పలకరించలేదు. చాలా సేపటికి వరద వెల్లువ తగ్గింది. ఆమె మామూలుగా అయింది. అతని కళ్ళల్లోకి చూస్తూ "మీరు యిచ్చినమాట నిలబెట్టుకుంటారని అంతా చెప్పుకుంటారు. నాకు మీరు ఓ ఉపకారం చేయాలి'' అంది.

"చెప్పు" అన్నాడు అతను.

"మీరు నమ్మిన దేవుడి సమక్షంలో నన్ను పెళ్లి చేసుకోవాలి''

"వ్వాట్..." అతను కుర్చీలోంచి హఠాత్తు గా లేచి నిలబడ్డాడు.

"పెళ్ళా... మనం చేసుకోవడమా... కల గనడంలేదుకదా"

శ్రీమహాలక్ష్మి చిన్నపిల్లలా వెక్కివెక్కి ఏడు స్తుంటే అయోమయంలో పడ్డాడు అతను. పద్ధెనిమిది, యిరవై ఏళ్ళస్నేహం తమది.




రెండు శరీరాలమధ్య టేబుల్ వుంది. రెండు మనసుల మధ్యా గాలి కూడా లేదు. ఆమె చూపులు భాష్యం చెపుతున్నాయి. ఆ బిజినెస్ మాగ్నెట్ మొట్టమొదటిసారిగా ప్రేమగురించి అర్థంచేసుకునే ప్రయత్నం చేస్తున్నాడు.

అతని చెంపలు, పాపిడిభాగం కొద్దిగా తెల్లబడ్డాయి. నెరిసిపోయిన మీసాలకి రంగు వేసుకున్నాడు. అతని నవ్వు వెన్నెల కురిపిస్తోంది.

ఆమె చెంపలు యిప్పుడిప్పుడే తెల్లబడుతున్నాయి. ఆమె వైష్ణవి గురించి చెప్పింది.

అతను తను కూర్చుంటూ "కూర్చో" అన్నాడు.

అతని అంతరంగం కదిలింది. ఆమెపట్ల అతనికి 'ఇది' అని చెప్పలేని ప్రత్యేక భావం వుంది. ఆ భావమే యిన్నేళ్ళుగా గాఢస్నేహాన్ని పట్టి నిలబెట్టింది.

ఆమె తెలివితేటలమీద అతనికి గౌరవం. ఆమె పిల్లల్ని పెంచిన తీరుకి అబ్బురం.

కరెన్సీలో మునిగితేలి కరెన్సీ మీద నడిచి వచ్చే అతనికి అహం జాస్తి. ఆ అహంభావం పెరిగిపెరిగి తన పిల్లల్నికూడా అడుగుదూరంలో నిలబెట్టింది.

తన తప్పు తెలుసుకుని వొప్పుకోలేకపోయాడు.

పిల్లలు తండ్రిని మించిపోయారు.

సంపాదించడం వాళ్ళకి వెన్నతోపెట్టిన విద్య.

రూపాయి యింటూ రూపాయి యీజ్ యాక్వల్ టు కోట్లు. మమకారం, తండ్రీ పిల్లల దగ్గరతనం యివేవీ పిల్లలకీ తెలీవు. తండ్రికీ తెలియవు.

కాలాన్ని అతను డబ్బుతో ముంచేసి దాని విలువ తెలుసుకునేసరికి వయసు యాభైకి చేరువౌతోంది. భార్యాపిల్లలు, సంసారం, ఆత్మీయత యివన్నీ మరిచిపోయాడు. తపోభంగం అయిపోయిందిప్పుడు.

అంటే ఎక్కడో అట్టడుగు పొరల్లో మనసు మారుమూలల్లో తను యిటువంటి నెచ్చెలిని కోరుకున్నాడన్నమాట.

ఆమె రెండుచేతులూ కలిపి దోసిలి ముందుకు చాపింది అతను ఆ చేతిలో చేయివేశాడు.

ఆమె అతనిలో ఐక్యం అయింది. ఆపైన అగ్నిసాక్షిగా గుళ్ళో పెళ్ళిచేసుకున్నాడు.

మంత్రోచ్చారణలమధ్య బ్రాహ్మణుడు అడిగాడు, "ఏ జుబ్లీ చేసుకుంటున్నారు సర్"

"చిన్నప్పుడు మంత్రాలు, పురోహితులు, మంగళసూత్రం ఏవీ తెలీని వయసులో మా పెళ్ళి పెద్దలు చేశారు. అది గుర్తులేదంటే మళ్ళీ చేసుకోవాలనిపించింది" అన్నాడతను.

పురోహితుడు చేయి చాపకుండానే పంచెలచాపూ, పట్టుచీరతోబాటు సంభావన కూడా పుష్కలంగా ఇచ్చి దంపతులు ఇద్దరూ ఆయన కాళ్లకి నమస్కారం చేశారు.

ఆయన మొహం మతాబులా వెలిగిపోయింది.

సుభద్రమ్మ అటునుంచి ఇటువత్తిగిలింది. దీపం సన్నగా వెలుగుతోంది. గదిలో గుడ్డివెలుగు పడుతోంది. శ్రీమహాలక్ష్మి గోడకి ఆనుకుని కూర్చోవడం చూసి ఆమె అడిగింది, "నిద్రపట్టడం లేదా శ్రీమహాలక్ష్మీ"

శ్రీమహాలక్ష్మి ఈలోకంలోకి వచ్చింది. "లేదమ్మా"

ఆవిడకూడా లేచి కూర్చోబోతూంటే "అర్ధరాత్రి దాటిపోతోంది ఇప్పుడు నువ్వెందుకు లేస్తున్నావమ్మా, పడుకో" అంది.

ఆవిడ పడుకుంది.

ఎక్కడివాళ్ళు అక్కడ సర్దుకున్నారు.

శ్రీమహాలక్ష్మికి హాయిగా వుంది.

ప్రశాంతంగావుంది. ఎవరో 'హిప్నటైజ్ చేస్తున్నట్టు... 'హాయిగా ప్రశాంతంగా పడుకో!'



కళ్ళమీదకి సుతారంగా, సుతిమెత్తగా, రెప్పలు గులాబీరేకులన్నంత సుకుమారంగా, వాటిని స్పృశించే నిద్ర... మరీ సున్నితంగా... శ్రీమహాలక్ష్మి పడుకుంది.

శ్రీమహాలక్ష్మి ఏళ్ళతరబడి నిద్రకి దూరం అయింది.

ఆ కలలు గన్న కళ్ళు యిప్పుడు నిద్రపోతున్నాయి...



తెల్లవారింది. పాణిగ్రాహి బడలిక వల్ల నిద్రపోతున్నాడు. శ్రీమహాలక్ష్మి సుఖంగా నిద్రపోయింది. బోసినోరుతో సుభద్రమ్మ ఆశ్చర్యంగా చూస్తోంది.

పచ్చని పసిమి ఛాయలో యిల్లుకూడా పచ్చని ఛాయలో వుందేమిటి. ఆవిడ బుగ్గలు నొక్కుకుంది. శ్రీమహాలక్ష్మి మేని ఛాయ గోడలకీ, యింటికీ సూర్యకిరణాలు పడి పరావర్తనం చెందుతున్నాయా? ఆవిడకి పరావర్తనం అనేపదం తెలీదు.

కూతుర్నీ, గదినీ మార్చి మార్చి చూస్తూ అంతలోనే బెంగపడింది. అయ్యో! పెళ్ళిచేశాక 'దిష్టి' తీయాల్సింది. కూతురికన్నా తల్లి శ్రీమహాలక్ష్మి పెళ్ళికూతురులా వుందని జనం చెప్పుకుంటూంటే విందితను. "దిదిమిదీపం పెట్టచ్చు"

తను కూడా తల్లేగా. ఖైమరచిపోయి వింటూ కూర్చుంది. పుత్తడిబొమ్మ తన కూతురు. తండ్రి రూపురేఖలూ, ఛాయా... అన్నీ తండ్రి లక్షణాలే.

హఠాత్తుగా ఆమెకళ్ళు శ్రీమహాలక్ష్మి మెడమీద, క్రమంగా గుండెలమీదా ఆగిపోయాయి.

ఇన్నాళ్ళూ తను చూడనేలేదు. పచ్చని పసుపుతాడు మెరిసిపోతోంది. ఆ తాడు ఆవరించిన మేరచూస్తూ వెడుతుంటే గుండెలమీద సన్నని చీర చాటున రూపాయి కాసంత మంగళసూత్రాలు ధగధగా మెరుస్తున్నాయి. కాళ్ళకి కొత్త మట్టెలు, పట్టాలు... తను యిన్నాళ్ళూ చూడలేదేం...

ఆవిడ నిట్టూర్చింది. ఎప్పుడూ నలుసు బంగారం వొంటిమీద వుంచుకోలేదు. అప్పులు, ఫీజులు, తిండి, తీర్థం... ఓహ్... ఎన్నని? మంగళసూత్రం... అప్పుడెప్పుడో ఏళ్ళక్రితం భద్రాచలంలో సీతమ్మవారి మెళ్ళో చూసింది. మహంకాళి గుళ్ళోచూసింది. దుర్గమ్మవారి మెళ్ళో చూసింది.

ఆమె కళ్ళు చెమర్చాయి.

శ్రీమహాలక్ష్మి దిగ్గున లేవగానే గాజులు ఘల్లుమన్నాయి! మెళ్ళో సూత్రాలు మెరిశాయి.

"అయ్యో పొద్దెక్కింది!" అంటూ బాత్‌రూమ్‌లోకి పరిగెత్తింది.

★ ★ ★

ఓ నిర్ణయానికి వచ్చాక మనసులో వుండే బెదురూ సంకోచం, ఎక్కడో సంప్రదాయపు పోకడలు చేసే హెచ్చరికలూ, యివేవీ మెదడు రిసీవ్ చేసుకోదు. అలా చేసుకోవాల్సిన అవసరం గురించి ఆలోచించదు. ఆ నిర్ణయం తీసుకునే ముందే తెగింపు వస్తుంది. దాన్ని తెగింపే అనాలో, నిర్ణయమే అనాలో, సిద్ధాంతమే అనాలో యిదమిత్థంగా శ్రీమహాలక్ష్మికి తెలీదు.

శ్రీమహాలక్ష్మితో పరిచయం వున్నవాళ్ళూ, తెలిసినవాళ్ళూ ఆమెని డబ్బుమనిషి

అనీ, నీతిలేనిదనీ అనలేరు. ఆమె ఏటికి ఎదురీదే మనిషి అంటారు. గుండెనిబ్బరం గల వ్యక్తిగా గౌరవం యిస్తారు. స్త్రీ తల్లిగా నిర్వహించే పాత్రగురించి తెలుసుకోవాలంటే శ్రీమహాలక్ష్మిని ఉదాహరణగా చెబుతారు. సింహం ఆకలి వేస్తే గడ్డితినదు. శ్రీమహాలక్ష్మి అంతే...

ఆ మధ్యాహ్నం ఎండ నిప్పులు చెరుగుతోంది.

సూర్యుడు చండ్రప్రతాపం చూపిస్తున్నాడు.

వైష్ణవి పెళ్ళి అయ్యాక శ్రీమహాలక్ష్మి మనోహరి స్కూల్లో వుద్యోగం మానేసింది. దీనివల్ల అనేక నష్టాలు ఎదుర్కోవాల్సి వచ్చింది. అయినా మనోహరి ముందు మెసలడం ఆమెకి ఇష్టంలేదు.

తలుపుతాళం తీసి లోపలికి వచ్చింది.

రెండురోజుల క్రితం వైష్ణవిని చూసేందుకు సుభద్రమ్మ వెళ్ళింది. ఆమె వైష్ణవిని చూస్తానని పేచీ పెడుతుంటే, పరశురామ్ స్వయంగా తీసుకువెళ్ళాడు. ఆవిడ అక్కడ రెండుమూడురోజులపాటు ఉండటానికి నిశ్చయించుకుంది.

పరశురామ్ పిక్‌నిక్‌కు వెళ్ళాడు.

అరవింద్ సినిమాకీ ఫ్రెండ్ యింటికీ వెళ్ళాడు.

పాణిగ్రాహి కంపెనీకి వెళ్ళాడు.

తలుపులు తీసి ఫాన్ వేసుకుని వంటింట్లోకి వెళ్ళి మంచినీళ్ళు తెచ్చుకుని కుర్చీలో కూర్చుంది.

ఎండకి వాడిలిన వంకాయిలా మారిపోయింది శరీరం.

శ్రీమహాలక్ష్మి గ్లాసు కిందపెట్టి మొహం తుడుచుకుంది.

అదే సమయంలో రెక్కలు చాపుకున్న కారు ఆమె యింటిముందు ఆగింది. పూర్ణచంద్రరావు మెట్లెక్కి ఆమె వున్న గదిలోకి వచ్చాడు.

ఆమె చప్పున కుర్చీలోంచి లేచింది. అతనామెను చేతుల్లోకి తీసుకున్నాడు. ఆమె వారించలేదు.

ఎండవేడిమికి బీటలు వారిన భూమ్మీద తొలకరి జల్లు పడ్డట్లు, ఆవిర్లతో కూడిన సెగలు బయటకు వస్తున్నట్లు శ్రీమహాలక్ష్మి కల చెదిరిపోతుందేమో అన్న భయంతో అతన్ని గట్టిగా పట్టుకుంది.

ఫాన్ తిరగడం ఆగిపోయింది. ఆమె సరిచేసేందుకు అటు వెళ్ళింది. 'కరెంట్ పోయింది' అంది పూర్ణచంద్రరావుతో. సరిగ్గా అప్పుడే ధడేల్‌మన్న శబ్దానికి శ్రీమహాలక్ష్మి తలెత్తింది.

పరశురామ్...

స్విచ్ బోర్డుదగ్గర ఆమె. కుర్చీలో అతను. నేలమీద నలిగిన పూలు.

తల్లివైపొకసారి చూసి లోపలికి వెళ్ళిపోయాడు. అతనా సమయంలో తల వొంచుకున్నాడు. పూర్ణచంద్రరావు ఆమెవైపు చూసి 'వాడు మాట్లాడలేదు' అన్నాడు.

ఆమె దగ్గర సమాధానం లేదు.

వంటింట్లోకి వెళ్ళి కాఫీ తీసుకువచ్చి అతనికి యిచ్చింది.

"ఎండ బావుంది. ఈ వేడి కాఫీ"

"సారీ!" ఆమె ఆ గ్లాసు తను తీసుకుంది. అతనికి నిమ్మకాయ నీళ్ళు యిచ్చింది.

అతని కాళ్ళదగ్గర కూర్చుని నెమ్మదిగా అంది. "చాలు ఈ జీవితాన్ని శాశ్వతం చేయండి"

"తప్పకుండా. నీ కేలోటూ రానీయను"

"లోటు..." నవ్వింది ఆమె. "మనిషికి ఓ లక్ష్యం వుంటే దాన్ని సాధిస్తారు. నా లక్ష్యం డబ్బు సంపాదించడం కాదు. నాకు తోడు కావాలి. ఆ తోడు ఎలా వుంటుందో మిమ్మల్ని చేసుకున్నాక తెలుసుకున్నాను."

అతను బాధపడుతూ అన్నాడు "మన ఈ పెళ్ళిని చట్టం వొప్పుకోదు. పాణిగ్రాహికి నేను



అన్యాయం చేశానేమో అనిపిస్తోంది. నా 'నీడ' కావాలని వచ్చిన నిన్నూ కాదనలేకపోతున్నాను''

శ్రీమహాలక్ష్మికి ఏడుపు వచ్చింది. "చట్టం... చట్టం... అది మనం ఏర్పాటుచేసుకున్నదే! న్యాయానికి అన్యాయం జరగకూడదని, సాంఘికంగా రక్షణకోసం ఏర్పడింది. నాకు మీకోట్లు అవసరంలేదు. అన్నీ మీ భానుమతిగారికే యివ్వండి. ఈ సమాజంలో నాకో గుర్తింపు కావాలి. నేను పూర్ణచంద్రరావుగారి భార్యనని నలుగురూ చెప్పుకుంటే చాలు''

అతను వులిక్కిపడ్డాడు. కొరడాతో కొట్టినట్లు విలవిలలాడి పోయాడు. ఆమెవైపు రెప్ప వేయకుండా చూశాడు.

అందరూ మెచ్చే రోమ్‌ను ఒక్క రోజులో నిర్మించలేదని ఓ సూక్తి ఉంది.

"సమయం... ఏ పనికైనా సమయం పడుతుంది. ఇప్పటికిప్పుడు మీరు శ్రమ తీసుకోనవసరంలేదు''

అతనామె మొహాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని సున్నితంగా ముద్దుపెట్టుకుని "అలాగే... తప్పకుండా'' అన్నాడు. సూర్యుడు వుదయించడం మరిచిపోతాడేమోగానీ అతను మాటకి కట్టుబడి వుంటాడు. అతని రెండుచేతుల్ని కళ్ళకి అద్దుకుంది.

"మళ్ళీ వస్తాను. ఇది కొత్త బాధ్యత" అతను గొంతు పెంచి "పరశురామ్ నేను వెళ్ళొస్తాను'' అన్నాడు.

ఆ గదిలోంచి అతను ఆశించిన జవాబురాలేదు.

కారు వెళ్లిపోయింది.

శ్రీమహాలక్ష్మికి అప్పటివరకూ జరిగింది కలలా అనిపించింది. యదార్థంలోకి రాగానే ఎక్కడో సన్నని ఒణుకు ప్రారంభమయి శరీరాన్ని మొత్తం కుదిపేస్తోంది. ఆమె ఆ ప్రకంపనాల్ని దూరం చేసుకోవాలని ప్రయత్నం చేసింది. కానీ సాధ్యం కాలేదు.

లేచి టూ యిన్ వన్ ఆన్ చేయాలనుకుంది. కానీ కూర్చున్న చోటునుంచి అంగుళం కూడా కదలలేకపోయింది. ఆ గది గుమ్మానికి ఆనుకుని నిలబడ్డ పరశురామ్ కళ్ళు నిప్పులు చెరుగుతున్నాయి.

తలెత్తిన శ్రీమహాలక్ష్మి కొడుకు మొహంలోకి చూస్తుండిపోయింది. తల్లిని తిట్టాలని ప్రయత్నం చేస్తున్నాడు. నోట్లోంచి ఒక్క మాట కూడా పెగిలి రావడంలేదు. కోపం కట్టలు తెంచుకున్నా ఏమీ చేయలేక పోతున్నాడు. అతను పెరిగిన తీరు అతనికి సంస్కారం నేర్పించింది. అది హద్దు మీరనీయడంలేదు. అతను పెనుతుపానుకి సముద్రంలో పడవలా కొట్టుకుంటున్నాడు. హోరుగాలికి పిచికపిల్లలా అల్లాడిపోతున్నాడు. అతని పిడికిళ్ళు బిగుసుకున్నాయి. ఆ పిడికిలిని గోడకేసి బలంగా కొట్టాడు. ఒక్కసారికాదు కసితీరా కొడుతుంటే శ్రీమహాలక్ష్మి చప్పునలేచి అతని చేతిని పట్టుకుంది. అతను విసురుగా లాక్కున్నాడు. చేతినిండా రక్తం... గోడమీద రక్తం.

కుప్పలా కూలిపోయి భోరుమని ఏడ్చాడు. చిన్నప్పుడు దెబ్బ తగిలినా వాడు అలా ఏడవడం శ్రీమహాలక్ష్మికి గుర్తులేదు. పెద్దపెట్టున ఏడుస్తున్నాడు గుండెలు బాదుకుంటూ. శ్రీమహాలక్ష్మి చాలాసేపు ఏం చేయాలో పాలుపోని దానిలా కొడుకువైపు చూస్తూండిపోయింది.

గబుక్కున వాడిని రెండు చేతుల్లోకి తీసుకుని గుండెలకి హత్తుకుంది. ఎగిసిపడే కెరటాలు వొడ్డుదగ్గర పలచనైనట్లు తల్లిగుండెలో తల పెట్టగానే పరశురామ్‌లో ఉధృతం తగ్గింది. నిశ్శబ్దం అయిపోయాడు. అయినా శబ్దంరాని దుఃఖం తన్నుకువస్తోంది. శ్రీమహాలక్ష్మి అతని వీపుమీద చేయివేసి మరింత దగ్గరకి తీసుకుంది.

అంతవరకూ ఆమె చెప్పినట్లు వింటున్నట్లే అమ్మ గుండెల్లో లభించే వూరట కోసం వెతుకుతున్నట్లే వున్నాడు. ఆపైన మరి వుండలేక పోయాడు. ఆమె నుంచీ దూరం




జరిగాడు.

తలెత్తి ఆమెవైపు చూశాడు. ఆమె ఏడుస్తోంది. చెట్టంతకొడుకు ఆవేశంగా తగిలించుకున్న దెబ్బకి రక్తం చెదరి చొక్కామీద కూడా పడింది. అతను నిట్టూరుస్తుంటే గుండె బరువు తెలుస్తోంది.

"నేను ఆయన్ని పెళ్లిచేసుకున్నాను"

పరశురామ్ మొహంలో ఏ భావమూ లేదు.

"ఆయనతో వెళ్ళిపోతాను"

అప్పుడు కదిలాడు పరశురామ్. "ఇప్పుడు యిన్నేళ్ళకి ఆయనతో వెళ్ళిపోతావా? మమ్మల్నేం చేస్తావమ్మా?"

"తెలీదు"

"నువ్వు చాలా తప్పు చేస్తున్నావమ్మా"

"లేదు. ఆయన నా భర్త"

"చట్టం వొప్పుకోదమ్మా"

శ్రీమహాలక్ష్మి రెండుచేతులూ జోడించింది. ఆ సమయంలో అతను తన కొడుకు అన్న సంగతి మరిచిపోయింది. "బాధ్యతలకి దూరంగా పారిపోయిన మగాడ్ని చేసుకుని బాధపడ్డాను. తోడు... నీడ యివి కావాలి. తోడు 'నీకు నేనున్నాను' అని చెప్పగల్గే వాడే మగాడు. అటువంటి వ్యక్తి ఓ జీవితకాలం లేటు అయినా దొరికాడు. నేను నమ్మిన సిద్ధాంతం ప్రకారం పెళ్ళాడాను"

"అదో ముసుగు... అన్నీ అబద్ధపు సిద్ధాంతాలే! పెళ్ళి ఎందుకు చేసుకోవాలి. తెగింపుకు వచ్చాక ఆపని చేయకపోయినా ధైర్యంగా తిరగాల్సింది"

"మగవాడు చట్టంతో ప్రమేయం పెట్టుకోకుండా పెళ్లిచేసుకోవడంలేదూ"

"అసహ్యంగా మాట్లాడద్దమ్మా. మగవాడికే చెల్లింది. నువ్వు..." పరశురామ్ గంభీరంగా మారిపోయాడు. "నీ యిష్టం నీకు తోచినట్లు బతుకు. మమ్మల్ని మా ఖర్మానికి వదిలేయ్. అమ్మమ్మ అక్కడే అంటే వైష్ణవి దగ్గర వుంటుంది. అరవింద్‌ని నేను తీసుకుని వెళ్ళిపోతాను. మరి అతను నీ ఈ దిగజారుడుతనానికి కారణం అయిన మిష్టర్ పాణిగ్రాహి ఎక్కడ వుంటాడో నువ్వు తేల్చుకో ఈ విషయం నేను ఎప్పుడో గ్రహించాను. కళ్ళతో చూడనిదే ఏ నిర్ణయం తీసుకోకూడదనే హఠాత్తుగా వచ్చాను. పాణిగ్రాహిగారికి కూడా తెలిసేవుంటుంది. తెలియనట్లు నటిస్తున్నారేమో?"

ఆ పిల్లవాడు అన్నన్నిమాటలు అంటూ వుంటే 'బొమ్మ'లా అయిపోయింది. మనసు వాటిని పూర్తిగా అర్థంచేసుకోలేకపోతోంది. పాణిగ్రాహిని అతను అసహ్యించుకుంటున్నాడు. చివుక్కుమంటోంది.

పాణిగ్రాహి తనని అమితంగా ప్రేమించాడు. సందేహంలేదు. తనకోసం చచ్చిపోయేందుకు కూడా సిద్ధంగా వుంటాడు. అంతలోనే నవ్వు వచ్చింది. ఎందుకొచ్చిన ప్రేమ? ప్రేమ తిండిపెట్టదు.

భర్త- భరించేవాడు.

ఇక్కడ భర్త భారం వేసేవాడు.

మోయలేని భారం.

భుజాలు వొంగిపోయిన భారం.

చందమామ కథలోమాదిరిగా.

"దూకుతా దూకుతా" చెట్టుమీదనుంచి వినిపిస్తాయా మాటలు. దూకేది మహాలక్ష్మే ఏమో అనుకుని 'దూకు' అంటాడు. అది బాటసారి భుజంమీద దయ్యంగా మారిపోతుంది. వదల్చుకోలేడు... బరువు... అవకాశం వచ్చేవరకూ మోస్తూనేవుంటాడు.

ఎప్పుడో మరొకడి నెత్తిన వేస్తాడు.

పాణిగ్రాహి అటువంటివాడే.

తనే వదల్చుకుంది.

"ఈ విషయం అందరికీ చెప్పమ్మా"

శ్రీమహాలక్ష్మికి భయం వేసింది.

పరశురామ్ లేచాడు.

"ఎక్కడికి రా" అంది.

"నా యిష్టం... నేను వెళ్ళిపోతాను"

"అయ్యో''

అతను వినిపించుకోలేదు. పర్సు చూసుకున్నాడు.

"ఎక్కడికిరా పరశురామ్?"

పరశురామ్ తల్లివైపు తిరస్కారంగా చూసి వెళ్లిపోయాడు.

సాయంత్రం అయింది. ఏపనీ చేసే ఓపిక లేదు.

ఇప్పటికిప్పుడు పూర్ణచంద్రావు రమ్మంటే వెళ్ళిపోతుంది. అతను యిప్పట్లో రమ్మనడు. తనూ అవకాశవాదేనా? పూర్ణచంద్రావు తనని స్వీకరించే వరకూ పాణిగ్రాహి యింట్లో వుంటుందా? మెదడుని చెదపురుగులు తింటున్నట్లు ఆలోచనలు... ఆత్మాభిమానం గల స్త్రీ ఎవరైనా కోరికోరి ఉంపుడుగత్తెలా వెళ్ళదు.

ఈ పెళ్లికి విలువలేదు.

ఏవిధంగా?

చట్టం... ఎటుతిరిగీ భూమి గుండ్రంగా వున్నట్లు. చట్టం... ఏం చేయగలదీ చట్టం.

తాగకు గొంతు పిసికేస్తా అనగలదా?

"భరించు'' అంటే భరించేట్లు చేయగలదా?

న్యాయాన్ని ఆశ్రయించినప్పుడు కదా?

తనకి డబ్బుతో నిమిత్తంలేదు.

ఇప్పుడు తనకి కావలసింది డబ్బుకాదు.

పూర్ణచంద్రావులాంటి వ్యక్తిగురించే తను కలలు కనివుంటుంది. హఠాత్తుగా ఏర్పడ్డ ప్రేమకాదు యిది. ఆకర్షణా, సెక్సు యివికూడా కావు. సామ్రాజ్యాలన్నిటినీ ఏకంచేసి ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలి తనదైన రాజ్యాన్ని స్థాపిస్తానన్న మగధీరుడు అలెగ్జాండరు. అతను గ్రీకువీరుడు.

మగవాడు అంటే పిల్లల్ని కనేందుకు తోడ్పడేవాడే కాదు. మగధీరుడు అయి వుండాలి. కన్నెపిల్ల కలలుకనే నాయకుడు అటువంటివాడు.

శరీరానికి వయసు వచ్చి ప్రభావం చూపించినా మనసుకే వయసు అంటదు. కనీసం తనలాంటి వాళ్ళకి. అయితే 'అమ్మ' అక్కడే 'వైష్ణవి' దగ్గర వుండిపోతుందా? పరశురామ్ పట్టుదల తనకి తెలుసు. అరవిందని తీసుకుని వెళ్లిపోతే తను ఈ యింట్లో...

చంద్రుడి కోసం చకోరిలా...

పూర్ణచంద్రావు కోసం ఎదురుచూస్తూ...

ఏది ఆశించి అతన్ని పెళ్ళాడింది?

ఒక ఆవేశం, కసీ ఈ నిర్ణయానికి దోహదం చేశాయా?

శ్రీమహాలక్ష్మి గోడకి చేరగిలబడి శూన్యంలోకి చూస్తోంది.

డబ్బు... కొన్ని పరిమితులవరకూ అత్యంత విలువైనదీ మనిషిని శాసించేదీ అదే. కానీ మానవ విలువలూ, ప్రేమానురాగాలూ వీటిని గురించి కనీసం ఆలోచించేందుకు కూడా వ్యవధి ఇవ్వనప్పుడు ఆ మనిషి నడుస్తున్న శవంలా కనిపిస్తాడు.

చప్పున చెంపలు వేసుకుంది.

పాణిగ్రాహికీ తనకీ మధ్యవుండే సన్నని దారపుపోగులాంటి బంధం క్రమంగా తెగిపోయింది, ఇద్దరికీ తెలియకుండానే.

ఒక ఇంటి చూరుకింద రెండు జీవాలు బతుకుతున్నాయి. అంతే. శ్రీమహాలక్ష్మికి తెలియకుండానే చీకటి అయింది. ఆ చీకట్లో లేచి లైటు వేసింది. భోజనం చేయాలనిపించలేదు. ఆవేళ కానివేళ ఎప్పుడూ తినలేదు. ఇప్పుడసలే ఆ దృష్టి లేదు.

రాత్రి పదిగంటలకి పాణిగ్రాహి తలుపు కొట్టాడు.

కిటికీలో కూర్చున్న ఆమె వెళ్ళి తలుపు తీసింది.

"పిల్లలు ఇంకా రాలేదా?" అతను అడిగాడు. "ఊహుఁ" అంది.

అతను బాత్‌రూమ్‌వైపు వెళ్ళి మొహం కాళ్ళూ కడుక్కుని వచ్చాడు. అతనికి వడ్డించింది ఆమె. రెండు నిమిషాల్లో భోజనం అయిందనిపించాడు. వెళ్ళి చాప





మీద పడుకున్నాడు.

కొన్నిరోజులవరకూ పరశురామ్ రాలేదు. అతను తమ్ముడితో మద్రాసు వెళ్లాడు. ఆ విషయం తన కనీసధర్మం అనుకున్నాడో ఏమో ఉత్తరం రాసి తెలియచేశాడు. ఆ ఇంట్లో మనుషులున్న అలికిడి లేదు.

పాణిగ్రాహి ఇప్పుడు ఇంటికి రావడం తగ్గించేశాడు. శ్రీమహాలక్ష్మి అడగలేదు. తెలుసుకోవాలన్న ధ్యాస, ఆసక్తి రెండూ లేవు.

చాపమీద పడుకున్న పాణిగ్రాహి కూడా ఆలోచిస్తున్నాడు.

మొహంమీద చేతిని ఉంచుకుని కళ్లు మూసుకున్నాడు. చాలా చిన్నవయసులో మిడిమిడి జ్ఞాపకాలు అతన్ని లేపుతున్నాయి.

పది పన్నెండేళ్ల వయసులో వున్న మగ పిల్లలు. కాంపౌండ్‌లో వున్నవాళ్లే... అతనికి తలుచుకుంటూంటేనే ముచ్చెమటలు పోస్తాయి.

భయం... ఆ చిన్నవయసులో ఆరుగురు మగపిల్లలు... వారిలో సబిత తమ్ముళ్ళు కూడా వున్నారు. కరంసింగ్ పెదనాన్న పిల్లలూ వున్నారు. అంతా కలిసి చిన్నపిల్లని తీసుకువచ్చి గుడి వెనకాల రేప్ చేశారు.

ఆ పిల్ల మునెమ్మ కూతురు సుశీల. తను రెండు రోజులు బయటికి రాలేదు. పోలీసులు వచ్చి పట్టుకెళ్ళిపోతారని భయం. ఆ పిల్ల నేరం అంతా తనమీదికే తోసేస్తుందని భయం.

అతని గుండె ఆగిపోయినట్లయ్యేది.

కాలకృత్యాలు తీర్చుకుందుకు మాత్రమే లేచి మళ్ళీ ముసుగుతన్నేవాడు.

తల్లి "ఏమైందిరా" అని అడిగితే "జ్వరం అమ్మా" అని చెప్పాడు. ఈవిధంగా అతను చాలాకాలం భయపడ్డాడు. మునెమ్మ ఎటో వెళ్ళిపోయింది. ఇళ్లు కట్టడం అయిపోగానే అంతా వెళ్ళిపోయినట్లున్నారు.

అప్పుడు ఊపిరి పీల్చుకున్నాడు.

అందరూ తేలుకుట్టిన దొంగలే.

తిరిగి తను ఏదో కావాలనుకుంటున్నాడు. ఆ స్వభావం అంతర్లీనంగా వుండిపోయిందా?

గంటల తరబడి సబితతో, శ్రీమహాలక్ష్మితో మాట్లాడేప్పుడు లేని ఆలోచనలు ఒంటరిగా ఉన్నప్పుడు ఎందుకొస్తున్నాయి.

భయం అతన్ని సాహసం చేయనీయలేదు.

అవకాశం దొరక్కపోతే మంచివాడిగా మిగిలిపోతాడు.

తనకి కాంపౌండ్‌లో మంచి పేరు వుంది.

తనలో మరోవ్యక్తి ముసుగుచాటున వున్నాడు.

శ్రీమహాలక్ష్మి చూడకుండా సమయం దొరికితే చాలు ఆడవాళ్లని మింగేసేలా చూడాలనిపిస్తుంది. చూస్తాడు కూడా.

తన సంగతి బయటపడితే పురుగుకన్నా హీనంగా చూస్తుంది ఆమె. ఆమె అంటే చాలా ఇష్టం, ప్రేమ తనకి.

నవ్వు వచ్చింది.

ప్రేమ... అంటే ఎలా వుంటుంది?

తీయగా, మధురంగా ఆమె కష్టపడితే తను చూడలేదు. అలాగని తను ఆమెకోసం కష్టపడలేదు. బొమ్మవైపే చూశారీ మనుషులు. బొరుసువైపు వున్న పాణిగ్రాహి బస్సులో ఎక్కితే మరో ప్రపంచంలోకి వెళ్ళిపోతాడు.

రద్దీ బస్సులో ఏమీ ఎరగనట్లు ఆడపిల్లల్ని రాసుకుంటూ నిలుచుంటాడు. ఆ పిల్లలు తిడితే "సారీ" చెప్పి దిగిపోతాడు. లేకపోతే ఎన్‌జాయ్.

ఈ మనస్తత్వం నుంచి బయటపడడం అతనికి ఇష్టం వుండదు. అదో ప్రపంచం. అలౌకికమైన ఆనందంలో మునిగితేలుతూ వుంటాడు.

ఈ సంగతి నరమానవుడికి తెలీదు.

శ్రీమహాలక్ష్మిని ఒకవిధంగా తప్పించుకుని తిరగాలని వుంటుంది. ఆ పిల్ల ఖర్మానికి

ఒదిలేయకుండా తను పెళ్లి చేసుకుని ఓ విధంగా ద్రోహమే చేస్తున్నాడు.

ఇష్టపడి చేసుకున్నా ఇంట్లోంచి బయటప డ్డాక అతని మనసు అతనితో ప్రమేయం పెట్టుకోదు. అతను నిద్రలోకి జారిపోయాడు.

మర్నాడు శ్రీమహాలక్ష్మి అతనితో చెప్పింది! "మనోహరి స్కూల్లో చేయడం బాగుండదనే మానేశాను''

"మంచిపని చేశావు''

"మళ్ళీ నాకు జాబ్ దొరికేవరకూ కష్టపడాల్సివస్తుందేమో''

"పోనీ శ్రీమహాలక్ష్మి. తప్పకుండా జాబ్ దొరుకుతుంది. కొన్నాళ్లు ఓర్చుకుందాం"

"అంతేగానీ ఎందుకు మానేశావు? ఇబ్బంది అని తిట్టరేం"

అతను నవ్వేశాడు. "శ్రీమహాలక్ష్మి ఏం చేసినా నాకు సమ్మతమే''

ఆమె అక్కడినుంచి తప్పుకుంది.

వైష్ణవి పెళ్లికి ముందు వారంరోజుల్నుంచీ స్కూల్లో పనిచేసే పద్మమ్మ ఇంటిపనులు చేస్తోంది. ఆమె రావడంతో శ్రీమహాలక్ష్మికి కొంచెం విశ్రాంతిగా వుంది.

అంట్లు బయటవేసి లోపలికి వచ్చింది. పద్మమ్మ చీపురు తీసుకుని వాకిలి తుడిచి ముగ్గులేసి అంట్లు ముందు వేసుకొని కూర్చుంది.

పాణిగ్రాహి కిటికీ దగ్గర కుర్చీలో కూర్చున్నాడు. అతని కోసం కాఫీ తీసుకువచ్చిన శ్రీమహాలక్ష్మికి కాళ్లు బంధాలు వేసినట్లు ఆగిపోయాయి.

అతను తమకంగా ఆమెవైపు చూస్తున్నాడు. వుండి వుండి ఆమె కూడా అతనివైపు చూస్తోంది. శ్రీమహాలక్ష్మి చప్పున లోపలికి వెళ్ళిపోయింది.

అయినా ఆ ఇద్దరూ కనిపిస్తూనే వున్నారు. ఆమెకి జీర్ణం కావడంలేదు.

బాహాటంగా, ధైర్యంగా తప్పో, ఒప్పో చేయగల్గాలి. పైకి పెద్దమనిషిగా నటిస్తూ... ఇంత దిగజారిపోవడాన్ని ఏ ఒక్కరూ భరించలేరు.

మరి తనో?

శ్రీమహాలక్ష్మికి ఆ ఇంట్లోంచీ, పరిసరాల్లోంచీ, పరిగెత్తి పారిపోవాలని వుంది.

ఎక్కడికి?

ఎక్కడికైనా?

అయ్యో శ్రీమహాలక్ష్మి నువ్వీ గడప దాటలేవమ్మా!

ఎందుకు దాటలేను?

పాణిగ్రాహి కొండంత అండ అనుకుని జర్రున జారిపోయావు. తోడబుట్టినవాళ్ళ తోడు కన్నవాళ్ళ తోడు, కడుపున పుట్టినవాళ్ళ తోడు, ఎవరూ లేరమ్మా... నీకు ఎవరూ లేరమ్మా... శ్రీమహాలక్ష్మి నిస్సత్తువగా గోడకి చేరగిలబడి కూర్చుండిపోయింది. పాణిగ్రాహి అవతలివైపు ఊహకి అందీఅందకుండా జారిపోతున్నాడు.

పద్మమ్మ వెళ్ళిపోతూ "పోతున్నా'' అంది. పాణిగ్రాహి "కాఫీ ఏది?" అంటూ వచ్చాడు.

మొహంమీదికి నవ్వులాక్కుని అందించింది అతనికి.

★ ★ ★

పూర్ణచంద్రరావుకి ఆశ్చర్యంగా వుంది. ఎవరి ఎదుటైనా బుకాయించగలడేమోగానీ గురువారం బాబామందిరంలోకి వెళ్ళినప్పుడు మనస్ఫూర్తిగా రెండు చేతులూ ఎత్తి దేవుడికి దండం పెట్టుకుంటున్నప్పుడు మాత్రం యదార్థం వెళ్లగక్కుతాడు. అతనికి అతిచిన్నవయసప్పటినుంచీ గుడికి వెళ్ళడం అలవాటు. అదేవిధంగా పాపప్రక్షాళన చేసుకోవడం కూడా అలవాటు.

పెరిగిన వాతావరణం అతన్ని అంత తేలికగా మార్చలేకపోయింది. పండగలకీ, పబ్బాలకీ, చావుకీ అతను తనవాళ్ళు పెద్దా చిన్నా బేధం లేకుండా తాగడం చూశాడు. అందులో భాగంగా తనూ తాగేవాడు. పల్లె




టూళ్లు దేశానికి వెన్నెముకలే. అవి ఒంగిపో తే దేశం పునాదుల్తో కదిలిపోదూ.

నాగరికత వర్ధిల్లి బీడీ స్థానంలో సిగరెట్, నాటుమందు స్థానంలో విస్కీ, రమ్ వచ్చాయి. పల్లెటూళ్లల్లోకి ఆవిధంగా చైతన్యా న్ని తీసుకువచ్చారు. మందు వున్నచోట మగువ కూడా ఉంటే రాజసం. సత్తా వున్న వాడికి సరుకు బాగానే దొరుకుతుంది. మొ హమాటాలు లేవు, అర్థింపులు, వేడికోళ్ళూ ఏవీలేవు.

తీసుకో, పుచ్చుకో ఎక్కడివి అక్కడే వదిలేసుకుని బయటపడడం... అంతే. హై సొసైటీ ఘరానా(?)

ఆశ్రమానికి వచ్చిన వితంతువునీ, పిల్లల్నీ చేరదీసి వాళ్ళకో మార్గం చూపించాడు. పెరుగుతున్న పిల్లల ముందు బాగుండదని ఆవిడ 'సతీదేవి' అయిపోయింది. ఇలా పూర్ణ చంద్రరావు జీవితంలోనూ ఎన్నో మచ్చలు. అందుకే దేవునిముందు నిజం చెప్పుకుని పాపప్రక్షాళన చేసుకుంటూవుంటాడు.

అన్న ప్రకారం అతను శ్రీమహాలక్ష్మి బాధ్యతను భుజంమీద వేసుకున్నాడు. మెల్ల గా రాజుకున్న నిప్పులా బంధువర్గంలో శ్రీమహాలక్ష్మి పెళ్లి గురించి అందరికీ తెలిసింది.

చాలా సందర్భాల్లో చాలా సమయాల్లో బంధువుల ఉనికికి గుర్తింపు వుండదు. శ్రీమహాలక్ష్మి పుట్టి, పెరిగి పెద్దదయ్యేవరకూ వాళ్ళకి అవసరం రాలేదు.

గుట్టలు గుట్టలుగా పోసిన కంకర్రాళ్లు రోడ్డువార వుంటే ఆ దారిన పోయే పిల్లలూ పెద్దలూ రాయిని అక్కడే వున్న చెట్టుమీదకి విసురుతారు. అదంతే సహజం.

శ్రీమహాలక్ష్మి గురించి రాజుకుంది నిప్పు.

బంధువర్గం రాళ్లు రువ్వడం ప్రారంభించింది.

ఇద్దరితో వుంటుందా? ఒకడితోనా?

"ఈ వయసులో యిదేంజబ్బు?"

బస్సులో నిల్చున్న పరశురామ్‌కి విని పిస్తున్నాయి. అతను బస్సు ఆపితే దిగిపోవాలని చూస్తున్నాడు. కానీ బస్సు స్పీడుగా వెళ్లిపోతోంది.

"చెట్టంత పిల్లలు"

"డబ్బు... పాపిష్టి డబ్బు, చిటికెన వ్రేలి మీద తిప్పుకుంటుంది"

"పిల్లలైనా గడ్డిపెట్టద్దూ!"

పరశురామ్‌కి ముచ్చెమటలు పోశాయి.

కావాలనే పరశురామ్ వినాలనే అను కుంటున్నారు వాళ్లు. వైష్ణవి పెళ్ళిలో చూశా డు. ఎక్కడో బీరకాయ పీచు సంబంధాలు అమ్మమ్మ చెప్పిందని తనే వెళ్ళి పిలిచాడు. బస్సు ఆగింది. జనాన్ని తోసుకుంటూ దిగి పోయాడు. రద్దీలోంచి బయటపడగానే వూపిరి ఆడినట్లయింది.

దగ్గర్లో వున్న తమ్ముడి కాలేజీకి వెళ్ళి వాడిని తీసుకుని ఆశ్రమానికి వెళ్ళాడు. అర వింద్‌కి ఆశ్రమం చాలా నచ్చింది. మద్రాసు వెళ్ళినప్పటినుంచీ అన్నదమ్ముల్లో చాలా మార్పు వచ్చింది. పరశురామ్‌కి ఆవేశం ఎక్కువే అయినా వెనకనుంచి పగ్గాలు వే స్తుంటే నిగ్రహంగా వుండగలడు. అరవింద్‌కి కోపం వస్తే బయటికి వెళ్లిపోతాడు.

ఆశ్రమం చేరుకునేసరికి అందరూ మెడి టేషన్‌లో వున్నారు. అన్నదమ్ములిద్దరూ ఓ పక్కగా వెళ్ళి వాళ్ళతోబాటు కూర్చున్నారు.

గంటన్నర రెండుగంటల తర్వాత ఎవరి దారిన వాళ్ళు వెడుతుంటే సుధ అతన్ని కలుసుకుని 'మా యింటికి వస్తారా' అంది.

అతను తలెత్తి అర్థంకానట్లు చూశాడు.

"మిమ్మల్నే పరశురామ్"

ఆశ్చర్యంగా చూస్తుండిపోయాడు. తన పేరు కూడా ఈమెకు తెలుసు.

"గురువుగారు చెప్పారు" సుధ చనువుగా అరవింద్ చేతిని తన చేతిలోకి తీసుకుని "మా యింటికి వెడదాం రండి" అంది.

పరశురామ్ కాదనలేకపోయాడు. అర విండ్ కూడా సుధని సమర్థించాడు. "వెడ దాం అన్నా''

అటు తిప్పీ యిటుతిప్పీ సుధ యింటికి తీసుకువెళ్ళింది. తల్లిలేదు. తండ్రి ఏదో బిజి నెస్ చేస్తున్నాడు.

ఓ తమ్ముడు

రెండు కుర్చీలు వేసింది. గోడకి పాత కాలం మధుబాల ఫొటో, మరోవైపు ఆర్. కె. బేనర్ అదీ బ్లాక్ అండ్ వైట్ ఫొటో పె యింటింగ్స్ కొన్ని వ్రేలాడుతున్నాయి. టేబి ల్‌మీద తల్లిఫొటో వుంది. పాతకాలం హీరో యిన్‌లా పొడవాటి బొట్టు, ఆకర్ణాంతం కా టుక.

సుధ ఆల్బం చూపించింది.

బోల్డు ఫొటోలు అన్నీ నృత్యభంగిమలే.

"మీరూ నేర్చుకున్నారని..."

పరశురామ్ మొహం చిట్లించాడు.

మీ గురించి గురువుగారు నాకు 'సమ స్తం' చెప్పారు.

"ఓకే... అయితే ఏమిటి?" బస్సులో జనం మాటలూ రివైండ్ అయి తిరిగి విని పిస్తున్నాయి. ఇప్పుడు యీవిడ కూడా అదే అంటుందా...

సుధ నవ్వేసింది. నవ్వుతో మొహం కూడా వెలిగింది. "మీరు సీరియస్‌గా వున్నా నేను వుండలేను. మీరు కొంత సోషల్ వర్క్ చేయడం ప్రారంభిస్తే అన్నీ మరిచిపోతారు.

పరశురామ్ అనీజీగా కదిలాడు.

"సారీ'' సుధ బాధపడుతూ అంది. "మి మ్మల్ని కుర్చీకి కట్టేసి ఎడాపెడా వాయించే స్తున్నట్లున్నాను. గురువుగారు చాలాకాలం క్రితమే మెడ్రాసు వెళ్లినప్పుడు చెప్పారు పర శురామ్‌ని కలుసుకో అని. తీరికేదీ?"

"ఏం చేస్తావక్కా'' జూనియర్ యింటర్ అరవింద్ అడిగాడు.

సుధ వాడిపక్కనే మరో కుర్చీ వేసుకుని కూర్చుంది. కొంచెం ఆగి రివ్వున లేచి వంటింట్లోంచి ప్లేట్లో కారప్పూస తీసుకువ చ్చి టీపాయ్‌మీదపెట్టి "తీసుకోండి'' అంది.

పరశురామ్ ఆల్బమ్ చూస్తున్నాడు.

తల్లి తనకి చాలా నేర్పించింది.

గొంతు బాగుండదని డ్యాన్సు నే ర్పించింది.

వైష్ణవి డ్యాన్స్‌తోబాటు తమ్ముడితో సంగీ తానికి వెళ్ళేది. వాళ్ళ గొంతులు అచ్చం 'అమ్మ' గొంతే. తేనెటీగలా, తీయగా, మధు రంగా.

తను చాలా ప్రదర్శనలు యిచ్చాడు. కాళ్ళల్లో విద్యుచ్ఛక్తి ప్రవహిస్తుంది అనేవా ళ్ళు.

లలితకళలకీ, వృత్తివిద్యలకీ చుక్కెదురని మాన్పించేసింది. తనూ నేర్చుకుంది. గతం రెపరెపలాడుతున్న వెలిసిపోయిన గుడ్డలా... నెమరువేసుకుందుకు యిబ్బందిగా, అతను నిశ్శబ్దంగా వుండిపోయాడు.

"గురువుగారు మీ మంచి చెడ్డలు చూసుకో మన్నారు'' గతుక్కుమన్నాడు పరశురాం.

"మంచిచెడ్డలు అంటే..." అతను పైకి అనలేదు.

"ఇంతకీ నువ్వేం చేస్తావక్కా''

"సోషల్ వర్క్''

"అంటే ఏమిటి?"

"మన యింటి దగ్గర యిన్ని యిళ్ళు న్నాయి కదా. వాళ్ళ యిళ్ళల్లో చెత్తనంతా ఓ గోతిలో వేయించే ఏర్పాట్లు చేయడం. అది క్రమంగా ఎరువు అవుతుంది. దాన్ని మొక్క లకి వేయించడం"

చిన్నగా నవ్వాడు అరవింద్.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"వేరే పనీపాటా లేదా?"

సుధ తెల్లబోయింది. తనకంటే ఎనిమిదే ళ్ళు చిన్నవాడు. వాడి వ్యంగ్యం అర్థం అయి... వాడు తప్పు అర్థం తీసుకు న్నందుకు.

"ఎదురింట్లో అందరూ వూరికి వెళ్ళారు.

హఠాత్తుగా ఆ యింట్లో వున్న పెద్దమనిషికి జ్వరం వచ్చింది. ఆ రోజంతా కనిపించకపోతే నేను వెళ్ళాను. ఆ సమయంలో ఆదుకోకపోతే ఎలా..."

"ఓరి నాయనో" నవ్వేశాడు అరవింద్. "నావల్లకాదు, అన్నవల్ల కూడా కాదు"

పరశురామ్‌కి అక్కడ వుండాలనిపించలేదు. తమ్ముడిని తీసుకుని బయటపడ్డాడు.

ఇల్లు చేరుకునేసరికి యింటిముందు కారు వుంది. పరశురామ్ మొహం నల్లగా అయిపోయింది. అరవింద్ కూడా పక్కగదిలోకి నిశ్శబ్దంగా తప్పుకున్నాడు.

శ్రీమహాలక్ష్మి అతని గుండెల్లో తల దాచుకుంది. అతనామె వీపుమీద చేత్తో అనునయంగా రాస్తూ వుండిపోయాడు.

మాటలు చెప్పేందుకు రాక కూడబలుక్కున్నట్లు ఒకటొకటే పేర్చి అతనిముందు పరిచింది. "మీపక్కనే చోటు చేసుకోవడం తప్పు అనిపించలేదు. మీరు నాకో వుపకారం చేయండి"

"చెప్పు"

"మీ భార్యనని లోకానికి చెప్పండి"

"ఈ మాట చాలాసార్లు అడిగి వుంటావు. కొంత టైమ్ కావాలి"

"ఇక్కడ వుండండి"

"వీలుకాదు"

అతని సమస్యలు అతనివి. దారం చిక్కులు తీయాలంటే ముడిపడకుండా జాగ్రత్తగా తీయాలి. శ్రీమహాలక్ష్మికి అర్థం అయినా ఆమె ఆరాటంవేరు. ప్రేమవిషయంలో స్త్రీ చేసే త్యాగం పురుషుడిలో కనిపించదు. పుట్టుకతో ప్రేమా, జాలీ వీటిపాళ్ళు స్త్రీకే ఎక్కువ వుంటాయి.

ఆమె అతన్ని కోరుకుంది. కనీసం కొన్నిరోజులు, కొన్ని గంటలు అతను తనతో వుండాలనుకుంటోంది. అది ఆమె వైపునుంచే తప్ప పూర్ణచంద్రరావు నుంచి రావడం లేదు. అయినా అతను ఏ పనిచేసినా పునాది దిట్టమైన పనులే చేస్తాడు.

శ్రీమహాలక్ష్మికి కళ్ళనీళ్ళు వచ్చాయి. డబ్బు కావాలి. వ్యాపకం కావాలి. అతను వెళ్ళిపోయాడు. మళ్లీ స్కూలు వెతుక్కుంది. తప్పదు. పిల్లలు మాట్లాడరు. ఆమె కూడా పట్టనట్లు వూరుకుంటుంది.

ఒక్కోసారి వండిన వంటలు ఎక్కడవి అక్కడే వుండిపోతాయి. తన స్పర్శ కూడా ఇష్టంలేదా పిల్లలకి. తనను కన్నతల్లీ, తను కన్నపిల్లలూ క్రమంగా దూరం అవుతున్నారు.

పరశురామ్ కంచంపెట్టి తమ్ముడిని పిలుస్తున్నాడు.

శ్రీమహాలక్ష్మి కళ్లు వెళ్లిపోయిన కారుతో చాలాదూరం వెళ్లాయి. అక్కడ శూన్యం తప్ప ఏమీ కనిపించడంలేదు.

పాణిగ్రాహి సిగరెట్ వెలిగించి వుఫ్ వుఫ్ మని వూదుతూ గదిలోకి వచ్చాడు. పిల్లలు భోజనం చేస్తుంటే హాయ్ అన్నాడు. పిల్లలు కూడా "రండి డాడ్" అన్నారు.

చాలాకాలం తరువాత తండ్రీ పిల్లల మధ్య పలకరింపులు.

తండ్రి అండ కావాలనిపించిందో పిల్లలనే పేగు కదిలిందోగానీ తనూ ఓ కంచం తీసుకుని పిల్లలమధ్య కూర్చున్నాడు.

ఇప్పుడు ఘుప్పుమన్నా పరశురామ్‌కానీ అరవింద్ కానీ ఏమీ అనలేదు. "మీ అమ్మమ్మ అక్కడే వుండిపోతుందా పరశురామ్" అని అడిగాడు.

పరశురామ్ గొంతు సవరించుకుని "వైష్ణవికి బాగులేదుట. మార్నింగ్ సిక్‌నెస్. అందుకే వుండిపోయింది" అన్నాడు.

పాణిగ్రాహి సంతోషంగా అన్నాడు "అయితే రేపోసారి వెళ్లి చూసివస్తాను"

పరశురామ్‌కి ఇరుకునపడినట్లయింది. "మనకి వాళ్లింకా చెప్పలేదు. అప్పుడే వెడితే బాగుండదేమో" అన్నాడు



"నిజమే'' అనిపించింది పాణిగ్రాహికి.

'ఆ యతి అంకుల్‌కి ఇప్పుడు మీరంటే పెద్ద గౌరవంగానీ స్నేహితుడు అనే అభిమానంగానీ లేవు. అక్కడికి మీరు వెడితే అవమానం తప్ప ఏం మిగలదు. అసలు మీకేం తెలుసు డాడ్. మీ కోసం మేము మాత్రం అల్లాడిపోతున్నాం అనుకుంటున్నారా? లేదు. మేము నటిస్తున్నాం.'

పరశురామ్ మౌనంగా అనుకుంటున్నాడు. పైకి మాత్రం నవ్వుతూ "మనింట్లోకి కొత్త మెంబరు రాబోతోంది'' అన్నాడు. శ్రీమహాలక్ష్మి వులిక్కిపడింది.

ఈ విషయం తనకి తెలీదు.

తనకి చెప్పాలని వైష్ణవి అనుకోలేదా?

తను మలినమైపోయినట్లు చూస్తారేం వీళ్లంతా? ఇప్పుడు తను కానిపని ఏం చేసింది?

డైవోర్స్ తీసుకోలేదు. అంతేగా.

పాణిగ్రాహి డాబా మీదకి వెళ్లాడు. అతని వెనుకే శ్రీమహాలక్ష్మి వెళ్లింది.

చాపమీద వెల్లకిలా పడుకున్న పాణిగ్రాహి కాళ్లమీద చల్లగా పడడం చూసి వులిక్కిపడ్డాడు. అక్కడ శ్రీమహాలక్ష్మి తల పెట్టుకుని ఏడుస్తోంది. క్షణం అతనికి అర్థం కాలేదు. ఆమె కన్నీళ్లు వెచ్చగా తగులు తుంటే "శ్రీమహాలక్ష్మి'' అని చటుక్కున లేచి కూర్చున్నాడు.

వెన్నెల్లో శ్రీమహాలక్ష్మి మొహం మీద నీలినీడలు పడుతున్నాయి. కొబ్బరాకుల నీడలతోబాటు గుండెల్లో గుబులు కలిసిపోయింది.

తను ఇన్నాళ్లూ గమనించలేదు. బాగా చిక్కిపోయింది. కళ్లల్లో మునుపటి తేజస్సు లేదు.

"ఎందుకు? ఏం జరిగింది శ్రీమహాలక్ష్మి?"

వెక్కివెక్కి ఏడుస్తూ రెండు చేతులూ జోడించి చెప్పింది. "నన్ను క్షమించండి. తప్పు ఒప్పుల గురించి నాకు తెలీదు. నేను పూర్ణచంద్రావు గారిని పెళ్లి చేసుకున్నాను. నా జీవితంలోకి రావద్దు ప్లీజ్'

అతను నిశ్చేష్టుడయ్యాడు. అదీ కొద్దిసేపు. ఆ తర్వాత సర్దుకున్నాడు. "ఏడవకు. నీ మార్గం నువ్వు వెతుక్కున్నావు. ఓకే ఓకే ఇంక ఏడవకు. నువ్వు చెప్పినట్లే నీ ఇష్టప్రకారమే జరుగుతుంది. నేను నీ జీవితంలోకి రాను సరేనా''

"నీకు కోపం లేదా పాణిగ్రాహీ!"

ఇందుకు మనస్ఫూర్తిగా నవ్వాడు!"చిన్నప్పుడు మన స్నేహం చాలా గొప్పది. పటిష్ఠమైనది. మనం పెళ్లి చేసుకోకుండా వుండివుంటే బాగుండేది. దీనికి సాక్ష్యంగా పిల్లలున్నారు. లేకపోతే అప్పటికీ ఇప్పటికీ ఎప్పటికీ మంచి స్నేహితులం మనం"

"నువ్వు దేవుడివి పాణిగ్రాహీ''

"ఒద్దులే శ్రీమహాలక్ష్మి అంతంత పెద్ద బిరుదులు. తట్టుకోలేను కూడా. నీకు చెప్పడం మరిచిపోయాను. పిల్లల మధ్య భోజనం చేసి యుగాలైనట్లు అనిపిస్తే అటు వెళ్లాను. మా కంపెనీ బ్రాంచ్ ఆఫీసు తెరిచారు. నాకు ప్రమోషన్ మీద ట్రాన్స్‌ఫర్ అయింది. ఆర్డర్స్ జేబులో వున్నాయి''

శ్రీమహాలక్ష్మికి చెప్పలేనంత నీరసం ఆవహించింది. పాణిగ్రాహి వెళ్లిపోతే?

హాయిగా వుంటుంది. ఏ బెడదా వుండదు. ఇష్టమో, అయిష్టమో, తిరుగుబాటు తనమో లేదా అధికారం చెలాయిస్తూనో ఏ ఆరు నెలలకో తొమ్మిది నెలలకో పక్కలో చేరే అతను వెళ్లిపోతే.

హాయి హాయిగా మనసు తేలికై అంతరిక్షంలోకి వెళ్లిపోతోంది. మానసికంగా సిద్ధంకాని శారీరక కలయిక జీవంలేని కట్టె లాంటిది. తనకి స్వేచ్ఛ లభిస్తోంది. స్వేచ్ఛ అంటే?

ఒకళ్లు ఇస్తే తీసుకునేదా? నో... నో... నో... స్వేచ్ఛ జన్మతః వచ్చేది. స్వేచ్ఛా




భంగం అంటే పావురాయి రెక్కలు విరిచే యడం లాంటిది.

అతను వెళ్లిపోతున్నాడు. మళ్లీ నీరసం వచ్చేస్తోంది.

పాణిగ్రాహి లేచి కూర్చున్నాడు. ఆమె అతనికి తగులుతూ కూర్చుంది.

అతను చెప్పాడు, "శ్రీమహాలక్ష్మి నిన్ను తిట్టడం కొట్టడం నాకు చేతకాదు. మన పెళ్లి ఓ యాక్సిడెంట్. నీకు అవసరం అయినప్పుడు నేను వున్నానని మరిచిపోకు. ఈ పెళ్లిని నేను అంగీకరిస్తున్నాను. ఎక్కడ ఆనందం ఉందో అక్కడ జీవితం వుంది. పూర్ణచంద్రరావుని కలుసుకుంటాను''

శ్రీమహాలక్ష్మి దిమ్మెరపోయింది. "వేళాకోళం చేస్తున్నావా?"

పాణిగ్రాహి తల అడ్డంగా తిప్పాడు. "లేదు... అతను నాకు స్నేహితుడు. నీకు ఎవరూ లేరు నేను తప్ప. ఇప్పుడు అతనే నీ ప్రపంచం. అక్కడ ఏం జరిగినా నువ్వు తట్టుకోలేవు. నీకంటే ముందు నేను తట్టుకోలేను''

"మై గాడ్' అతను చూపించే ప్రేమకి తట్టుకోలేకపోతోంది ఆమె.

"ఎలా జరగాల్సింది అలా జరుగుతుంది. ఏది జరగాలో అది జరిగిపోయింది. నువ్వు జాగ్రత్త పిల్లలు జాగ్రత్త' అతని కంఠం వణికింది.

అప్రయత్నంగా ఆమె చేతులు అతన్ని చుట్టేశాయి. ఆమె భోరుమంది.

అతనూ నిశ్శబ్దంగా ఏడుస్తున్నాడు.

యిద్దరూ కౌగలించుకున్నారు.

శ్రీమహాలక్ష్మి ఆ చేతుల్ని వదలాలని అనుకోవడం లేదు. అతనూ అంతే.

"ఏ వూరు వెడతావు పాణిగ్రాహీ?"

"చాలా దూరమే''

"నన్ను తీసుకువెళ్ళు పాణిగ్రాహి''

అతను బుర్ర అడ్డంగా వూపాడు. "వీల్లేదు శ్రీమహాలక్ష్మి అతను నీకోసం ప్రాణం పెడుతున్నాడు. యంత్రానికి మనసు గురించి చెప్పావు. అతను నువ్వు లేకపోతే చచ్చిపోతాడు''

"మరి నువ్వో''

"నీ సుఖమే నే కోరుకున్నా..." నవ్వాడు పాణిగ్రాహి.

ఆ నవ్వు ఏడుపు పరిమితులు దాటింతర్వాత వచ్చేది. ఆ తర్వాత ఏడుపూ నవ్వూ రెండూ ఒకేలా వుంటాయి.

"నన్ను నీతో తీసుకువెళ్ళు పాణిగ్రాహీ. మళ్ళీ ఈ జన్మలో యిక్కడికి తీసుకురావద్దు. నాకీ హైద్రాబాద్, సికింద్రాబాద్‌లంటే చాలా ఇష్టం. నన్నో నిర్ణయానికి రానీయి పాణిగ్రాహి. నీతో రావడం జరిగితే నా నిన్నటినీ యీ రోజునీ పాతిపెట్టి వచ్చేస్తున్నా నన్నమాటే''

"నీ వల్లకాదు శ్రీమహాలక్ష్మి''

"నిజమే నావల్లకాదు. నేను ప్రార్థిస్తున్నాను నిన్ను. నిన్ను వదిలి వుండలేను. మన యింట్లో ప్రేమగా పెంచుకున్న చెట్టునీ, పిట్టనీ వదిలి బతకలేం అటువంటిది నిన్ను వదిలి నేను బతకలేను పాణిగ్రాహీ. మనిద్దరి మధ్యా సెక్స్ సంబంధం కాదు మనల్ని కట్టి ఒకచోట వుంచింది. మనం ముందు స్నేహితులం."

పాణిగ్రాహి ఆమెను మెల్లగా దూరం జరిపాడు.

"నేను అతని భార్యని నాతో తీసుకువెళ్ళను''

"పాణిగ్రాహీ..."

"పోనీ... నువ్వు రాలేవు అంతే'

"నన్ను తీసుకువెళ్ళు పాణిగ్రాహీ 'నేను చేసింది తప్పు' అని మాత్రం అనడంలేదు. ఈ ఘర్షణ తట్టుకోలేకపోతున్నాను. నీతో వచ్చి అక్కడవుండి క్రమంగా ఆ జీవితానికి అలవాటుపడి ..." శ్రీమహాలక్ష్మి రెండు చేతుల్తో మొహాన్ని కప్పుకుని ఏడుస్తోంది.

"శ్రీమహాలక్ష్మి'' అతను అనునయంగా

పిలిచాడు. రాత్రి బాగా పొద్దుపోయింది. వెన్నెల వెలావెలా పోతోంది. చల్లని గాలి క్రమంగా చిక్కబడుతోంది.

"ఇంక ఏ ఆలోచనలూ పెట్టుకోకు. నిద్రపో''

"నా మాటకి సమాధానం చెప్పు పాణిగ్రాహీ''

అతను వ్యర్థంగా నవ్వాడు. "ఇంత దూరం వచ్చాక యిప్పుడు నేను చెప్పేందుకేమీలేదు''

"నువ్వు... నువ్వు వంటరి వాడివైపోతున్నావు. భరించలేను పాణిగ్రాహీ. రంపపు కోత యిది''

అతనామె కన్నీళ్ళు తుడిచాడు. "పడుకో ప్లీజ్''

ఆమె అస్తవ్యస్తంగా సగంచాపమీదా, సగం నేలమీదా పడుకుంది.

పాణిగ్రాహి కళ్ళు మూసుకున్నాడో లేదో గాఢనిద్రలోకి జారిపోయాడు. ఆ విషయం అతని 'గురక' శబ్దం చెబుతోంది.

మర్నాడు ఈ వార్త విని అరవింద్‌తోబాటు పరశురామ్ కూడా బాధపడ్డాడు.

లోపం ఎక్కడ?

ఏమో?

పరశురామ్ కుర్చీలో కళ్ళు మూసుకుని కూర్చున్నాడు. ఇంతవయసు వచ్చినా తనని ముద్దుపెట్టుకుంటాడు డాడ్. అమ్మ అరవింద్ పుట్టినప్పుడు హాస్పిటల్‌లో వుంటే వైష్ణవికి స్నానం చేయించి 'జడ' కూడా వేశాడు.

డాడ్ ఎన్ని చేయలేదు?

ఈ రక్తం ఎందుకిలా మరిగిపోతోంది.

ఈ మనసు కాలిపోతోంది. భగభగమంటూ శరీరం పైనుంచి బయటికి వచ్చేస్తున్నాయి సెగలూ, పొగలూ.

ఈ రక్తం, ఆ రక్తం అన్నీ ఒకటే.

ఓ రక్తం ఆనందిస్తోంది. అమ్మరక్తం అది. నిజంగా ఆనందిస్తోందా? ఆమెలో పరకాయ ప్రవేశం చేసి చూస్తే తెలుస్తుందేమో?

ఓ రక్తం తల్లడిల్లిపోతోంది. డాడ్ రక్తం అది.

గొప్పవాడివి మిష్టర్ పాణిగ్రాహీ. నీ సొమ్ము నీకు తెలీకుండా లాక్కెళ్ళిపోయాడు. నీకు తెలిసి క్షమించి వదిలేశావ్. అతి మంచితనం చేతకానితనం... తల్లడిల్లిపోతూ నవ్వు నటిస్తున్నావు. ఎందుకీ నటన.

నేనే నీ స్థానంలో వుంటే 'దాన్ని' జుట్టుపట్టుకుని వీధిలోకి తోసేసేవాడిని. చేతకాని వెధవలా అలా సూర్యుడివైపు వెళ్ళిపోయేవాడిని కాదు.

ఆయన సామాను సర్దుకుంటున్నాడు.

కళ్ళు తడుస్తున్నాయి. ఆచెమ్మ బయటికి రాకుండా జాగ్రత్త పడుతున్నాడు పరశురామ్.

"ఒరేయ్ రామా!" పాణిగ్రాహి అప్పుడప్పుడు పిలుస్తాడు. "రాముడూ'' అంటాడు. శ్రీమహాలక్ష్మి కూడా.

కళ్ళు తెరిచాడు పరశురామ్.

పాణిగ్రాహి పర్సు తీశాడు.

రెండువందలు తీసి కొడుకు చేతికి యిచ్చాడు. "ఎందుకు డాడ్?"

"దాచుకో. వాడుకో''

"ఏం వాడుకోను డాడ్''

"నీ యిష్టం. ఏమైనా చేసుకో''

"సరే''

"అరే ఛోటూభాయ్'' చిన్న కొడుకుని పిలిచాడు. అరవింద్ తండ్రిపక్కనే కూర్చున్నాడు. పైకి చెప్పడంలేదు. చాలా భావాలు. వాటిని అమర్చడం రాదు.

అమ్మ మళ్ళీ పెళ్ళి చేసుకుంది.

పాపం! 'నాన్నగారు' ఎంతో చేశారు.

అందరూ తమవైపు వింతగా చూస్తున్నారు దేనికి?

అక్క రేపోమాపో అమెరికా వెళ్ళిపోతుందట.




బావకి మంచి జాబ్ వచ్చింది.

అక్క వెళ్ళిపోతుంది. అమ్మే అచ్చం. ఎత్తుకునేది. ముద్దాడేది. స్కూలుకి తీసుకువెళ్ళేది. అన్నం తినిపించేది. అక్క వెళ్ళిపోతుంది.

అన్న జాబ్ రాగానే వెళ్ళిపోతాడుట.

డాడ్ వెళ్ళిపోతున్నారు.

అరవింద్ గుండెభారం దిగేవరకూ ఏడుస్తూండిపోయాడు.

పాణిగ్రాహి వున్న రెండు రోజులూ యింట్లోంచి ఎవరూ బయటికి వెళ్ళలేదు. శ్రీమహాలక్ష్మి స్కూలుకి సెలవుపెట్టింది.

పాణిగ్రాహి ఆ ఉదయం శ్రీమహాలక్ష్మితో చెప్పి బయటపడ్డాడు. అతను తిన్నగా పూర్ణ చంద్రరావు ఆఫీస్‌కి వెళ్ళాడు.

తలుపు శబ్దం విని తలెత్తిన పూర్ణచంద్రరావు రెండుచేతుల్తో ఆహ్వానించాడు. పాణిగ్రాహి ఆ చేతుల్ని అందుకుని వదిలేశాడు.

అతని ఎదురుగా కూర్చున్నాడు.

పూర్ణచంద్రరావు కొద్దిగా జంకాడు. అయినా నిబ్బరాన్ని పోగొట్టుకోలేదు. 'కాఫీ' యా 'టీ' యా.

"రెండూ వద్దు. చల్లని బీర్ తెప్పిస్తే ఓ.కే."

పూర్ణచంద్రరావు ఆ ఏర్పాట్లు చేయించాడు.

"చెప్పు పాణిగ్రాహీ. ఇలా వచ్చావేం."

పాణిగ్రాహి అంతవరకూ నవ్వుతూన్నవాడు గంభీరంగా అయిపోయాడు.

మరోసారి చలి వేసినట్లు కొద్దిగా వణికి సర్దుకున్నాడు పూర్ణచంద్రరావు.

పాణిగ్రాహి గొంతు సవరించుకున్నాడు "రావ్... నాకు శ్రీమహాలక్ష్మి అన్ని విషయాలూ చెప్పింది''

పూర్ణచంద్రరావు కూర్చున్న భూమి కదిలింది. అతను రివాల్వింగ్ ఛెయిర్‌ని గట్టిగా పట్టుకున్నాడు. ముచ్చెమటలు పోస్తున్నాయి. ఎయిర్‌కండిషన్డ్ రూమే అయినా అతను వేసుకున్న చొక్కా తడిసిపోయింది. కళ్ళజోడు జారింది.

"ప్లీజ్ రిలాక్స్'' పాణిగ్రాహి చాలా నెమ్మదిగా ఇంచుమించు రహస్యం చెబుతున్నట్లు అన్నాడు. "నిన్ను తిట్టీ, కొట్టీ, అరిచీ, ఆర్భాటం చేసీ నీ పరువుప్రతిష్ఠల్ని మంట కలిపేందుకు రాలేదు. శ్రీమహాలక్ష్మి నాకు చిన్ననాటి స్నేహితురాలు. ఆమెకి నేను భర్తలా తృప్తిని యివ్వలేకపోవడంవల్ల నిన్ను ఆశ్రయించి నీ నీడలోకి వచ్చింది''

పూర్ణచంద్రరావు వింటున్నాడు.

తప్పంతా నాదేనేమో తెలీదు.

"ఆమె ఆశల్నీ, ఆశయాల్నీ గొంతెమ్మ కోర్కెలని చెప్పాల్సింది నేను. అలా చేయలేదు. ముద్దుచేశాను. గారాబం చేశాను. ఆమె అభిప్రాయాల్ని ఖండించలేదు స్త్రీ స్వేచ్ఛని కాలరాస్తున్నానని అనుకుంటుందని. శ్రీమహాలక్ష్మికి సుఖమైన జీవితం కావాలి. ఆ జీవితాన్ని నేను ఇవ్వలేకపోయాను

"వింటున్నావా?"

"చెప్పు పాణిగ్రాహీ''

"రావ్! నువ్వూ, నేనూ, శ్రీమహాలక్ష్మి యించుమించు ఒకే యీడువాళ్ళం. మన పిల్లలకి పిల్లలు పుడుతున్నారు. ఫరవాలేదు. జరిగిందానికి విచారించొద్దు. కానీ..."

అతనేం చెప్పబోతున్నాడో అని ఉత్కంఠతో ఎదురుచూస్తున్నాడు పూర్ణచంద్రరావు.

"శ్రీమహాలక్ష్మి కంటతడి పెడితే జయంకాదు. నాకా క్షోభ తగిలి వుంటుంది. ఆమెని జాగ్రత్తగా చూసుకో." పాణిగ్రాహి పిడికిళ్ళు బిగుసుకుంటున్నాయి. ఒక మగవాడు మరో మగవాడి ఎదుట నిబ్బరాన్ని కోల్పోవడం, కంట తడిపెట్టడం జరిగితే అది నిజంగా దౌర్భాగ్యస్థితే. ఆ స్థితిలోంచి బయటపడేందుకు విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

"నాకు ఒరిస్సా ట్రాన్స్‌ఫర్ అయింది''

పూర్ణచంద్రరావు మొహం పాలిపో

యింది. అతనికీ బాధగా వుంది. ఎందుకు?

అతని భార్యని పెళ్ళిచేసుకున్నందుకా?

అతని స్థానంలో తనే వుంటే చంపేసేవాడు.

పాణిగ్రాహి చేతిని ముందుకు చాపాడు. "శ్రీమహాలక్ష్మిని జాగ్రత్తగా చూసుకుంటానని మాటివ్వు''

చాపిన అతని చేతిలో చేయివేశాడు పూర్ణచంద్రరావు. "మళ్ళీ ఎప్పుడు వస్తావు?"

"చెప్పలేను'' పాణిగ్రాహి మొహం ప్రశాంతంగా వుంది. మండిపోతున్న గుండెల్లోకి ఛిల్డ్ బీర్ పంపాడు. అది చల్లబరుస్తుందా!

పూర్ణచంద్రరావు కళ్ళు ఎరుపెక్కాయి. అతనికీ గుండె వుంది. అది స్పందిస్తుంది. దానిక్కూడా కలవరం తెలుసు. శరీరంలో జరుగుతున్న సంఘర్షణలకి గుర్తుగా కళ్ళు కెంపులయ్యాయి. వాటిలోంచి రాలబోయే నీళ్ళని 'మగ'తనం చాకచక్యంగా రెప్పల వెనక్కి తోసేసింది.

"'నా' సారీ 'మన' ఎక్స్ట్రీమ్‌లీ సారీ శ్రీమహాలక్ష్మి జాగ్రత్త."

అతను తన ఛెయిర్‌లోంచి పాణిగ్రాహి దగ్గరికివచ్చి అతన్ని చుట్టేసి "సారీ... శ్రీమహాలక్ష్మిని బాగా చూసుకుంటాను'' అని చెప్పాడు.

పాణిగ్రాహి అక్కడనుంచి లేచాడు.

పాణిగ్రాహి ఆటో ఎక్కేముందు సబితా, చలపతీ వచ్చారు. సుభద్రమ్మ కూడా వచ్చేసింది. వైష్ణవి మాత్రం రాలేకపోయింది. మనోహరీ, యతీ కూడా అనుకోకుండా మెడ్రాస్ వెళ్ళాల్సివచ్చింది.

అతను ఆటోలో కూర్చున్నాడు.

కొడుకులిద్దరూ స్టేషన్ వరకూ వెడుతున్నారు.

పాణిగ్రాహి పేరుపేరునా చెప్పాడు. "శ్రీమహాలక్ష్మి జాగ్రత్త'

చలపతీ, సబితా నవ్వి "పాణిగ్రాహీ! దేశాంతరాలు వెళ్ళిపోతున్నట్లు చెబుతున్నావేమిటి? ఇంతపెద్ద నగరంలో ఆమెకేం భయం... అయినా మేమున్నాం" అన్నారు.

సుభద్రమ్మవైపు చూసి రెండు చేతులూ జోడించాడు. 'జాగ్రత్త' అని సైగ చేశాడు.

శ్రీమహాలక్ష్మి అతనికి దగ్గరగా వెళ్ళింది. "నన్ను కూడా తీసుకువెళ్ళు పాణిగ్రాహి'' ఆమె నోటిని సున్నితంగా మూసేశాడు అతను.

ఆటో వెనుకే చలపతి, సబితా స్కూటర్ మీద వెళ్ళిపోయారు. సుభద్రమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

యింట్లోకి అడుగుపెట్టాక శ్రీమహాలక్ష్మికి ఏడుపు వచ్చింది. గట్టిగా గుండె బద్దలయేలా ఏడవాలనుకుంది. ఆమెకి తల్లి అడ్డువచ్చింది. ఆమె తనవైపు చూసే చూపుకి జవాబు యివ్వలేదు.

డాబామీదకి వెళ్లినా తనవెనకే వస్తుంది.

అందుకే గుమ్మంలో కూర్చుండిపోయింది.

సుభద్రమ్మ మొహం చిన్నది చేసుకుంది. ఏదో విపరీతం జరుగుతోంది. తెలీడంలేదు. పాణిగ్రాహి వెళ్ళిపోతున్నాడని వచ్చింది. తిరిగి అక్కడికి వైష్ణవి దగ్గరకి వెళ్ళాలనిపించలేదు. పాణిగ్రాహి వెళ్ళడంతో యిల్లు మరీ చిన్నబోయింది. చాలా సేపు గుమ్మంలో కూర్చున్న శ్రీమహాలక్ష్మి తల్లి పిలిస్తే లోపలికి వెళ్ళింది.

...స్టేషన్‌లో పాణిగ్రాహి కాడ్‌బరీస్ చాక్లెట్లు రెండు తీసుకున్నాడు. కొడుకులిద్దరికీ యిచ్చి తిరిగి షాపు దగ్గరకి పరిగెత్తి మరొకటి తీసుకున్నాడు.

పరశురామ్ తండ్రివైపు చూస్తున్నాడు.

అంతెత్తువుండే అతను కుంగినట్లు కన్పిస్తున్నాడు.

మొహంమీద నీడలవల్ల వున్నట్లుండి పెద్ద వయసు మీదపడ్డట్లు కనిపిస్తోంది. అయినా పరిగెత్తి పిల్లలకోసం చాక్లెట్లు తెస్తుంటే ఆ దృశ్యం కరిగిపోతుందేమో అన్నట్లు అన్నద





మ్ములిద్దరూ రెప్పవేయడం మానేసి తండ్రిని చూస్తున్నారు.

"లెటర్స్ రాయండి డాడ్" చిన్నవాడు అన్నాడు.

రైలు రాగానే అతను గబగబా సామాను తీసుకుని పరిగెత్తాడు. పిల్లలు కూడా తండ్రివెనకే కంపార్టుమెంట్‌లోకి వెళ్ళారు.

"డాడ్ వి ఆర్ మిస్సింగ్ యూ" యిద్దరికళ్ళల్లో నీళ్ళు.

పాణిగ్రాహి కొడుకులిద్దరిమధ్యా కూర్చుని జేబులోంచి చాక్లెట్‌తీసి పరశురామ్‌కి యిచ్చాడు. "ఇంటికి వెళ్ళగానే వైష్ణవికి యివ్వు. అడిగానని చెప్పు. అమ్మ, మీ అమ్మ జాగ్రత్త"

"డాడీ..." యిద్దరూ అతని చేతులు పట్టుకున్నారు. రైలు గట్టిగా కూతవేయగానే "యింక వెళ్ళిరండి. రామా! జాబ్ రాగానే వుత్తరం రాయి. డబ్బు పంపుతాను. ఛోటూ... అన్నా నువ్వూ జాగ్రత్త. అక్క జాగ్రత్త" అతను చెప్పాడు. చాలా జాగ్రత్తలు. పిల్లలు ప్లాట్‌ఫామ్ మీద కొంతదూరం కిటికీతో బాటే పరిగెత్తారు. రైలు స్పీడ్ అందుకుంది. కంపార్ట్‌మెంట్ దగ్గర నిలుచుని చేతిని గాలిలో వూపాడు పాణిగ్రాహి. అంతలోనే కనుమరుగైపోయింది రైలు.



పూర్ణచంద్రరావు శ్రీమహాలక్ష్మిని కనిపెట్టుకుని వుండాలన్నా అదతనికి సాధ్యం కావడంలేదు. లంకంత యిల్లు. నిత్యకళ్యాణం పచ్చతోరణంలా బంధుమిత్రులతో కిటకిటలాడుతూ వుంటుంది. ప్రపంచంలో సగభాగం శ్రీమహాలక్ష్మిని అతను పెళ్ళిచేసుకున్న సంగతి తెలిసినా యీ విషయం భానుమతిదాకా రాలేదు. వచ్చినా భయంవల్లనో మరే కారణంగానో ప్రస్తావించలేదు. పూర్ణచంద్రరావు ఈ విషయమే శ్రీమహాలక్ష్మితో అన్నాడు. వైష్ణవికి నెలలు నిండుతుంటే సుభద్రమ్మ వారానికోసారి వెళ్ళి ఆరాత్రి అక్కడవుండి వస్తోంది. పిల్లలు ఆశ్రమానికి వెళ్ళారు.

శ్రీమహాలక్ష్మి దగ్గరకు పూర్ణచంద్రరావు వచ్చాడు. అతని పక్కనే కూర్చుని కళ్ళు తుడుచుకుంది. "మీరు నన్ను తీసుకువెళ్ళండి"

అతను తెల్లబోయినట్లు చూశాడు.

"అదేం మీ భార్యని కానా, తీసుకువెళ్లరా?"

అతను నెమ్మదిగా చెప్పాడు. "తప్పకుండా తీసుకువెడతాను. కొంచెం ఓపికపట్టు"

"ఎందుకు?"

"శ్రీమహాలక్ష్మీ! పిల్లలకి పెళ్ళికాదు! రెండేళ్ళల్లో వాళ్ళ బాధ్యతలు తీర్చుకుంటాను. నీకు అన్యాయం జరగనీయను"

ఆమె నవ్వింది.

సుభద్రమ్మకి హఠాత్తుగా పక్షవాతం వచ్చింది. శ్రీమహాలక్ష్మి స్కూలునుంచి రాగానే రోజూలా ఆవిడ కాఫీ తీసుకురాలేదు. వంట ఇంట్లోకి తొంగిచూసింది శ్రీమహాలక్ష్మి. ఆమెగానీ పిల్లలుగానీ కనిపించలేదు. మూలవైపువున్న గదిలోకి చూసింది.

అక్కడ నేలమీద పడిపోయి వుంది సుభద్రమ్మ.

ఆమె కళ్ళు చూస్తున్నాయి. మూలుగు

తోంది.

బయటికి వచ్చేసి మూడో నెంబరు ఇంట్లో కొత్తగా దిగిన బాషాని పిలిచింది.

బాషాది రాయలసీమ. అతను వడ్రంగం చేస్తాడు. అతి తక్కువ పరిచయం. అతను రాగానే చెప్పింది. "అమ్మకు బాగాలేదు భాయ్. పరశురామ్, అరవింద్ కూడా ఇంట్లో లేరు. డాక్టర్ని పిలవాలి''

"అట్లాగే అమ్మా'' అని సైకిల్ తీసుకుని పరిగెత్తాడు.

డాక్టరు వచ్చాక అప్పుడు తెలిసింది ఆమెకి పక్షవాతం అని.

"తగ్గుతుందా డాక్టర్' శ్రీమహాలక్ష్మి అడిగింది.

"పెద్దావిడ. చెప్పలేం" అని మందులు రాసి ఇచ్చాడు.

ఆవిడ "ఆc ఆc..." అంటోంది. ఏదో చెప్పాలని తాపత్రయం. చెప్పలేకపోతోంది.

పరశురామ్ వస్తూనే అమ్మమ్మ పరిస్థితి చూశాడు. అతను వెంటనే గ్రహించాడు. శ్రీమహాలక్ష్మి కాఫీ తీసుకువచ్చి కొడుకు ముందు పెట్టింది.

మరో గ్లాసులో వున్న కాఫీని స్పూన్‌తో తల్లి గొంతులో పోసింది. సుభద్రమ్మ రెండు చేతులూ దగ్గరకి తీసుకు రావాలని ప్రయత్నం చేస్తోంది వీలుకాలేదు.

ఆమెని బాషా సాయంతో మంచంమీద పడుకోబెట్టాడు పరశురామ్. చాలా సేపు ఆవిడ దగ్గర స్టూలు వేసుకుని కూర్చుని ఆవిడ కాళ్ళూ, వీపూ నొక్కాడు. ఆవిడ నిద్రపోయిందని గ్రహించి తన గదిలోకి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత అరవింద్ వచ్చాడు.

శ్రీమహాలక్ష్మికి చాలా కోపంగా వుంది. అరవింద్ ఈమధ్య ఇంటికి ఆలశ్యంగా వస్తున్నాడు. ఎక్కడికి వెడుతున్నాడు?

శ్రీమహాలక్ష్మి నిస్సహాయంగా 'స్వామీ నా బిడ్డల్ని కాపాడు' అనుకుంది. పిల్లలు దారి తప్పుతున్నారా? వీల్లేదు స్వామీ వీల్లేదు. తన పిల్లలు మరొకరికి ఆదర్శప్రాయం కావాలి. తన ఒడుదుడుకులూ తల రాతలూ తనవి. అవి కేవలం తన వరకే.

★ ★ ★

సబిత చాలా రోజుల తర్వాత వీలుచూసుకుని వచ్చింది. ఎప్పటికప్పుడు రావాలని ప్రయత్నం చేసినా వచ్చేపోయే బంధువుల్తో పిల్లలకీ, అత్తగారికీ, పతిదేవుడికీ అమర్చి పెట్టడంతో శ్రీమహాలక్ష్మిని చూడలేకపోయింది.

సబిత పెళ్ళై పాతికేళ్ళు దాటిపోయాయి. ఆ ఇంట్లో ఇప్పుడు ఎవరో కొత్తవాళ్ళు చేరారు.

సబిత లోపలికి వచ్చింది. మంచంమీద వున్న సుభద్రమ్మని పలకరించింది. "ఎవరూ?" మాట ముద్దముద్దగా వస్తోంది.

"సబితని'' అంది ఆమె ఒంటిమీద చేయి వేసి. ఒడిలిపోయిన మామిడి పండులా వుందావిడ. మాట అర్థం అవుతోంది. వినగల్గుతోంది. చెబుతోంది.

చేత్తో శ్రీమహాలక్ష్మిని చూపించింది ఆవిడ. సబిత అటు చూసింది. కూతురు అటు వెళ్ళగానే చేత్తో తప్పు అనో మరేమని చెప్పాలనుకుందో చెంపలు వేసుకుంది. సరిగ్గా అప్పుడే వచ్చింది శ్రీమహాలక్ష్మి. తల్లి మెడ చూపిస్తూ సైగ చేసింది. తల్లి ఆవిధంగా చెబుతుంటే గొప్పగా వున్న మనిషి దిగజారిపోతున్నట్లు అనిపించింది.

తిన్నగా తల్లి దగ్గరకి వచ్చేసింది. సబిత నిర్ఘాంతపోయి చూస్తుంటే శ్రీమహాలక్ష్మి రెండు చేతులూ ఎత్తి సబితకి దండంపెట్టింది. "నువ్వు కూర్చో సబితా! ఎప్పటి నుంచో కబురు చేయాలనుకుంటూనే వీలు పడక చేయలేదు. వెళ్ళిపోకు'' అని తల్లివైపు తిరిగింది. "నువ్వు కదమ్మా అక్షింతలు వేశావు నామీద. ఎవరో ఏదో అంటున్నారని పనిగట్టుకుని వచ్చి చెప్పావు. అప్పుడు నీకు తప్పు అనిపించలేదామ్మా? నా ఇష్టం. ఈ జీవితం నాది. నేనాయన్ని పెళ్ళి చేసుకున్నాన





మ్మా. ఈ విషయం పాణిగ్రాహితో చెప్పాను. నీకు జ్ఞాపకంవుందా? నేను కుమిలికుమిలి ఏడ్చేవాళ్లని అసహ్యించుకునేదాన్ని. ఇప్పుడో క్షణక్షణం చస్తూ బతుకుతున్నాను''

సబిత నిర్ఘాంతపోయింది. వెంటనే తేరుకుందికూడా. శ్రీమహాలక్ష్మి లాంటి వాళ్లు తమకి ఏది ధర్మం అని తోస్తేఅది చేస్తారు. కానీ...

సబిత లేచి శ్రీమహాలక్ష్మి పక్కనే కూర్చుంది.

"నువ్వు హాయిగా వుండు. ఓ మార్గం వెతుక్కున్న తర్వాత అది మంచోచెడో అనుకుంటూ కూర్చోకు. నీకు నచ్చిందని చెప్పావు. సరే. అందులోనే సంతోషాన్ని వెతుక్కో. శ్రీమహాలక్ష్మీ! పెద్దావిడ ఆవిడకి మొదటినుంచీ నువ్వో ప్రశ్నార్థకానివే. అవునా కాదా!" నవ్వుతూ ఆమె మొహాన్ని తన వైపు తిప్పుకుంది.

శ్రీమహాలక్ష్మికి ఆవేశం పూర్తిగా తగ్గిపోయి చిన్నగా నవ్వింది.

"నువ్వూ రావడం మానేస్తావా?"

సబిత తల తిప్పింది. "లేదు. నువ్వు నా ప్రాణ స్నేహితురాలివి. అయినా ఎందుకు నువ్వందరి గురించీ ఆలోచిస్తున్నావు. మనోహరీ యతీలాంటి వాళ్లంతా రావడంలేదు. అవునా... అది వాళ్లిష్టం శ్రీమహాలక్ష్మీ. నువ్వు కోరుకున్న జీవితాన్ని నువ్వు అనుభవించు. నీ సిద్ధాంతాల్ని అందరి నెత్తినా రుద్దకు''

"నాకోసం ఎవరూ రారు. పిల్లలు మాట్లాడరు. పాణిగ్రాహి లేనేలేడు. ఎప్పుడో ఓసారి వచ్చే రావుగారి కోసం కళ్లల్లో ఒత్తులు వేసుకుని ఒంటరిగా దిక్కులేని దానిలా బతుకుతున్నాను సబితా''

సబిత చప్పున కౌగలించుకుంది. "ఏడవకు. ధైర్యంగా వుండు. నిన్ను నేను చూసుకుంటాను. నిన్ను బాగా చూసుకోమని పూర్ణచంద్రరావుగారితో చెబుతాను. బాధపడకు. చేసిందాన్ని గురించి విచారించకు. అడుగు ముందు వేసేప్పుడే ఆలోచించాలి. ఆ తర్వాత ఆ అడుగుల్ని తడబడేట్లు చేసుకోకూడదు. కాలమే అన్నీ సర్దుకునేట్లు చేస్తుంది''

సుభద్రమ్మ ఏడుస్తుంటే అటువైపు చూసింది సబిత.

ఆవిడ కూతుర్ని దగ్గరకి పిలిచింది. శ్రీమహాలక్ష్మికి తల్లి మీద ఇంకా కోపం తగ్గలేదు. సబితే నచ్చజెప్పి ఆ పెద్దావిడ పక్కన కూర్చోబెట్టింది.

ఆవిడ కూతుర్ని దగ్గరకి తీసుకుంది. ఏడుస్తూంటే గుంటలు పడ్డ చెంపల్లో నీళ్లు నిండుతున్నాయి. "మా బంగారు తల్లి శ్రీమహాలక్ష్మి. సబితా! నా కూతురు గంగాభవాని తల్లి. గంగకి దోషం లేదమ్మా'' అని ఘొల్లుమంది. వూపిరి తీసుకోవడమే మోయలేనంత బరువుగా వుంది ఆవిడకి. ఏడుస్తుంటే ఆ ప్రాణం గాల్లోకి వుఫ్‌మని ఎగిరిపోతుందేమో అన్నట్లుంది.

"ఏడవకమ్మా ఏడవకు'' అంది సబిత ఆవిడ బట్టతో కళ్లు తుడుస్తూ.

"ఓసారి రావుగారికి కబురు చేస్తావామ్మా'' సబితా, శ్రీమహాలక్ష్మి మొహమొహాలు చూసుకున్నారు.

ఆమె నిస్సహాయంగా అతికష్టంమీద ఎడమచేతిని పైకెత్తి సబిత గడ్డం పుచ్చుకుని బతిమాలింది.

"రేపు కబురు చేయనా''

"వుహూఁ ఇప్పుడే'' ఆమెకి ఆయాసం వస్తోంది.

సబితకి అర్థం అయింది. ఆమెకి చేతివాచీ అవసరంలేదు. టైమ్ అవుతోందని తెలుస్తోంది. అసౌకర్యంగా వుందామెకి. సబిత వీధిలోకి వెళ్లింది.

సబిత తిరిగి వచ్చేసరికి ఆవిడ మంచంమీద పడుకుని ఆయాసపడుతోంది.

పది నిముషాల్లో పూర్ణచంద్రరావు కారు వాకిలి ముందు ఆగింది. అతని వెనుక



పిల్లలు వచ్చారు. ఆశ్రమం నుంచే వచ్చి వుంటారు అనుకుంది శ్రీమహాలక్ష్మి.

అక్కడ ఏం జరుగుతోందో ఎవరూ చెప్పక్కర్లేకుండా తెలుస్తోంది. సబిత ఫోన్ చేయడం ఆలస్యం పూర్ణచంద్రరావు రెక్కలు కట్టుకుని వాలాడు. శ్రీమహాలక్ష్మి తల్లికి ఏది ఇష్టమో మాటల సందర్భంలో చెప్పింది. అతను జిలేబీ, మిఠాయి తీసుకు వచ్చాడు.

శ్రీమహాలక్ష్మి తల్లి నోటికి అందించింది. ఆమె 'ఆ..గు' అంది. ఆ తర్వాత పూర్ణ చందరావు వైపు తిరిగి రెండు చేతులూ జోడించింది. 'శ్రీమహా... లక్ష్మి... పిల్ల... లూ జాగ్రత్త..."

అర్థం అయింది అతనికి. పిల్లల్నీ శ్రీమహాలక్ష్మినీ దగ్గరకి తీసుకుని "నేను చూసుకుంటాను. మీరు నిశ్చింతగా వుండండి'' అన్నాడు.

ఆమె కళ్లు వెలిగాయి. వెలుగులో తడిశాయి. దీపం కాంతికి అవి మెరుస్తున్నాయి. క్రమంగా ఆవిడ నోరు తెరిచింది. శ్రీమహాలక్ష్మి ఆమె నోరు తీపి చేసింది. ఆపైన భార్యాభర్తలిద్దరూ ఆవిడ కాళ్లకి నమస్కారం చేశారు.

"శతమానం..." ఆవిడ పెదవులు ఆగిపోయాయి. "సాయిరాం... సాయిరాం" పూర్ణ చంద్రరావు ఆమె ఒంటిమీద చేయివేశాడు.

శ్రీమహాలక్ష్మి అచేతనంగా వుండిపోయింది. రెండు నిమిషాల క్రితం శతమానం... అన్న ఆమె అంతలోనే ఏమైపోయింది.

సబిత అతనివైపు తిరిగింది. "శ్రీమహాలక్ష్మి ఏం చేస్తుంది చెప్పండి? పిల్లలు చిన్నవాళ్లు. పాణిగ్రాహి లేనేలేడు. అతనికి కబురు అంది వచ్చేసరికి పరిస్థితి బావుండదు. మీరు ఈ కర్మకాండ సంగతి చూడండి''

అతను కంగారుపడ్డాడు. వెంటనే నిలదొక్కుకున్నాడు. "ఈ విషయం నా వాళ్లెవరికీ తెలీదు. ఇప్పుడు కర్మ చేస్తే పబ్లిసిటీ అయిపోతుంది. నేను శ్రీమహాలక్ష్మితో చెప్పాను కూడా. కొంత టైమ్ పడుతుంది అని. మీరు నన్ను అర్థం చేసుకోండి''

ఈసారి తెల్లబోవడం సబిత వంతయింది. "చాలా చిత్రంగా మాట్లాడుతున్నారు. శ్రీమహాలక్ష్మి మీ భార్య అని మరిచిపోతున్నారా?"

"సారీ... నా సమస్యలు ముందే చెప్పాను. మీరు పొరబడుతున్నారు''

సబితకి కోపం వచ్చింది. "ఇదోరకం ఎస్కేపిజం. ఎక్కడా పెళ్లి అనే క్రతువులో అగ్రిమెంట్స్ వుండవు పూర్ణచంద్రరావుగారూ. మా శ్రీమహాలక్ష్మికి అమితంగా ప్రేమించడం తప్ప ఏమీ తెలీదు. ఆమెది చిన్నపిల్లల మనస్తత్వం. చాలా విషయాల్లో పాదరసంలా పనిచేసి ఓ నిర్ణయానికి రావడం, న్యాయం ఆలోచించడం, తెలివి తేటలు వుపయోగించడంలాంటి సజషన్స్ ఇచ్చే మెదడు తన వరకూ వచ్చేసరికి మెంటల్లీ రిటార్డెడ్‌లా అయిపోతుంది. అది మిమ్మల్ని తెలుసుకోకుండా మనసు పారేసుకుంది''

"సబితా!" కంగారుగా ఆమె చేయిపట్టుకుంది శ్రీమహాలక్ష్మి. పూర్ణచంద్రరావు టైమ్ చూసుకుంటూ అన్నాడు. "మీరు నా స్థానంలో వుంటే అర్థం అయేది. ఇందులో నా తప్పుకొంచెం కూడా లేదు. నేనెంత బిజీ వ్యక్తినో శ్రీమహాలక్ష్మికి తెలుసు. ఆమెకి నేను అన్యాయం చేయను. ఇప్పుడీ విషయంలో నేను అశక్తుడిని. డబ్బు ఇచ్చి వెడతాను''

సబిత ఏడవలేని నవ్వు నవ్వింది. "డబ్బు నేనూ ఖర్చుపెట్టగలనండి. మీరు ఆమెకి అల్లుడు అయితే నేను కూతురికంటే ఎక్కువే. మా స్నేహం రక్తసంబంధంకన్నా గొప్పది. డబ్బు పడేస్తే అనాథ శవాన్ని కూడా రాజవీధితో సాగనంపుతారు వెట్టివాళ్లు. డబ్బు మీరిచ్చేదేమిటి?"

"సబితా! ప్లీజ్... నువ్వు ఘర్షణపడకే' శ్రీమహాలక్ష్మి సబిత చేయిపట్టుకుని బతిమిలాడింది.




సబిత ఆ చేతిని విసిరికొట్టింది. "ఉన్న మాట అంటే భయందేనికి? నువ్వు భయపడాలి ఆయన ఎక్కడ వెళ్లిపోతాడో అని. నాకెందుకు భయం? పాణిగ్రాహికి డబ్బు లేదు. ఈయన డబ్బుతో అన్నీ కొనగలం అనుకుంటున్నాడు''

పూర్ణచంద్రరావు మరోసారి టైమ్ చూసుకుంటూంటే "మీరు వెళ్లిరండి'' అంది శ్రీమహాలక్ష్మి.

సబిత అతన్ని వుద్దేశించి అంది "బాధ్యతలు వేరు, అఫెక్షన్ వేరు. మీరు వచ్చినప్పటి నుంచీ పదిహేనుసార్లు టైమ్ చూసుకున్నారు. టైమ్‌నీ డబ్బునీ జోడించి దానిమీద సవారీ చేస్తున్నప్పుడు ఈ బంధాలేవీ గుర్తురావు. మనిషి విలువా, మానవత్వం, ప్రేమ ఇవి తెలిసే సమయానికి అవి దక్కకుండా పోతాయి. సారీ... ఎందుకు చెబుతున్నానంటే శ్రీమహాలక్ష్మి నా ఫ్రెండ్. ఆమె భర్త మీరు. ఆ చొరవతో అన్నాను''

అతను "ఫరవాలేదు'' అని వెళ్లిపోయాడు. వెళ్లేముందు గోడకి ఆనుకుని నిశ్శబ్దంగా ఏడుస్తున్న పిల్లల్ని దగ్గరకి తీసుకున్నాడు. వాళ్లు ఆ సమయంలో అతని గుండెల్లో ఒదిగిపోయారు. అతను పరశురాంకి డబ్బు ఇచ్చాడు. జాగ్రత్తలు చెప్పి గడపదాటాడు.

సబిత మరి ఇంటికి వెళ్లలేకపోయింది. పరశురాం చేత ఇంటికి ఫోన్ చేయించింది. చలపతి పది నిమిషాల్లో అక్కడ వున్నాడు.

"పాణిగ్రాహిని పిలిపిస్తే'' అన్నాడు.

"ఒద్దు'' అంది సబిత.

మర్నాడు ప్రొద్దున్నే కర్మ కాండలన్నీ త్వరత్వరగా జరిపించారు. యతీ, మనోహరీకి కబురు చేయలేదు. చలపతి "అదేం?" అని అడిగాడు. సబిత జవాబు చెప్పలేదు.

పరశురాం చేయకూడదని మరో బ్రాహ్మణుడు చేత చేయించాడు. సుభద్రమ్మ వెళ్లిపోయింది. శ్రీమహాలక్ష్మి ఏడుస్తూంటే "నేను వున్నాను'' అంది సబిత ధైర్యం చెబుతూ.

★ ★ ★

ఆ ఇరుకు ఇంట్లో ఇరుకుగా, వూపిరి ఆడనట్లు బతుకుతోంది శ్రీమహాలక్ష్మి. తనని ముట్టుకుంటే మైలపడిపోతామన్నట్లు దూరంగా జరిగి, జరిగి నడుస్తున్నారు పిల్లలు. ఇప్పుడు తల్లి కూడా లేదు.

పిల్లలు రాత్రిళ్లు తనని గట్టిగా వాటేసుకుని కదిలేందుకు వీల్లేకుండా బంధించి అమ్మ నాది అని దెబ్బలాడుకుంటూ తన పక్కనే పడుకునేవాళ్లు. ఇప్పుడు ఇద్దరే మాట్లాడుకుంటారు. ఇద్దరే నవ్వుకుంటారు. పూర్ణచంద్రరావు రాగానే "హలో నాన్నగారూ'' అంటారు. ఆయనతో ఐదు నిమిషాలు ఆత్మీయంగా మాట్లాడతారు.

అదంతా నటన అనిపిస్తుంది శ్రీమహాలక్ష్మికి. అతను గడపదాటగానే ఆముదం తాగిన మొహాల్లా కనిపిస్తారు. తను గదిలో ఒంటరిగా నేలమీద తలగడ కూడా లేకుండా ఘోర తప్పిదం చేసి శిక్ష అనుభవిస్తున్నదానిలా ఏకాకిలా దుర్భరమైన ఒంటరితనం... అర్ధరాత్రి మెలకువవస్తే నిద్రపట్టదు.

తెల్లవారు ఝామున లేచి కూర్చుంది శ్రీమహాలక్ష్మి. నాలుగుగోడలు... జైలే... 'పాణిగ్రాహి ఎక్కడున్నావ్. నిన్ను మళ్లీ చూడగలనోలేనో? చచ్చిపోతున్నాను. నేను పోయాక నువ్వు పిల్లల్ని బాగానే చూస్తావు. నాకా నమ్మకం వుంది'

శ్రీమహాలక్ష్మి కళ్లు తుడుచుకుంది. 'మీ వరకూ మీరూ కరెక్టే. ఏం చేయను? మీరు ఎదుర్కొంటున్న అవమానాలు మీ శత్రువులక్కూడా ఎదురు కాకూడదు. వైష్ణవీ నిన్ను మళ్లీ కళ్లారా చూడనేలేదు. ఎలా వున్నావోనమ్మా!'

ఆమె చేతిలో చీరవుంది. అది మెడను చుట్టేయబోతోంది. అప్పుడు వచ్చాడు పరశురాం.

తల్లిచేతిలో చీర తీసి దూరంగా విసిరేశాడు. ఆమె ఆ చీర తీసుకోబోయింది. ఆమె ఒడిలో తల దూర్చి ఏడుస్తున్నాడు పరశురామ్. అలికిడి విని అరవింద్ కూడా

వచ్చాడు. తల్లిని పెనవేసుకున్నాడు.

పరశురామ్ తల ఎత్తి తల్లి మొహంలోకి చూసి చేతిని అందుకుని పక్కనే కూర్చోబెట్టు కున్నాడు.

"అమ్మా నువ్వు చచ్చిపోకూడదమ్మా! నాకు తెలుసు ఎప్పుడో ఓరోజు ఇలాంటిపని చేస్తావని వూహిస్తూనే వున్నాను. అంత ధై ర్యంగా ఆయన్ని పెళ్లి చేసుకున్నావు. ఇంకా ధైర్యంగా బతకడం నేర్చుకో. నీ తల ఒంగి పోయేట్లు చేసుకోకు''

శ్రీమహాలక్ష్మికి బెంగగా వుంది. భయంగా వుంది. జరుగుతున్నది నిజమో కాదో తెలియడం లేదు. ఈ కల చెదిరిపో తుందేమో అని భయం. మళ్లీ పిల్లలిద్దరూ దూరం అయిపోతారేమో అని బెంగ. ఏడ్చే వాళ్లంటే అసహ్యంగా వుండేది ఆమెకి. ఇప్పుడు ఏడుపే జీవితం అయిపోయింది.

ఎందుకు ఏడుస్తోంది? ఏడవడం దేనికి?

సాంఘిక వెలి.

ఎవరన్నారలా?

వైష్ణవి కంటికే కనిపించడంలేదు.

నిండు గర్భిణి. అసలే పసిడి బొమ్మ. కడుపుతో వుండడంతో 'అందాలభరిణి' లా వుందంటున్నారు.

పరశురామ్‌తో అది ఏం చెప్పింది?

"నా బతుకు నన్ను బతకనీయమని చె ప్పు అన్నా. ద్వారక చుట్టూ బోలెడు మంది బంధువులూ స్నేహితులు. అమ్మ చేసిన పని నాగరికం కాదని చెప్పు. తరతరాలు తల ఒంపులు తెచ్చిపెట్టే పని..."

అందుకే దుఃఖం తనకి.

తన ఇంటికి ఎవరూ రారు. తనని ఎవ రూ పిలవరు. చాలా రోజుల తర్వాత పిల్లలు ఇప్పుడు ఆమెని దగ్గరకి తీసుకున్నారు. పర శురామ్ దీర్ఘంగా నిట్టూర్చి ఆమె ఒళ్లోంచి లేచి కూర్చున్నాడు.

"నువ్వంటే మాకు చాలా ఇష్టం అమ్మా. ఏ తల్లీ తన బిడ్డలకోసం ఇంత కష్టపడదు. సంఘంలో స్టేటస్‌కోసం మంచి చదువులు చెప్పించావు. మేమూ సొసైటీలో మనుషుల మే. నేను వెడుతుంటే 'సబ్‌కూ ఏక్ బాప్ రహతారే లేకిన్ పరశురామ్‌కూ దో బాప్ హైరే కిస్మత్‌వాలా' (అందరికీ ఒకే తండ్రి వుంటాడురా కానీ పరశురామ్‌కి ఇద్దరు తండ్రులున్నారురా. అదృష్టవంతుడు) అంటా రు. కోపం రాదామ్మా?"

శ్రీమహాలక్ష్మి తల వూపింది.

తల్లితండ్రుల చర్యలు పిల్లలమీద ప్రభావా న్ని చూపిస్తాయంటే ఇదే.

"అమ్మా! నువ్వు నాన్నగారి పక్కన వుండడాన్నే మా మనసు ఇష్టపడేది. అంత లోనే ఆయన పక్కన నువ్వుంటే కారం రాసుకున్నట్లు అనిపించేది. కనీసం ఇటు వంటి కథలు కూడా చదవలేదు మేము. ఎప్పుడో మహాభారతంలో ద్రౌపది గురించి వింటే అది ఆ యుగధర్మం అంటే వినగ ల్గాం. ఇప్పుడు వినలేం" పరశురామ్ చాలా ప్రశాంతంగా తల్లితో చెబుతున్నాడు.

అరవింద్ ఆమె చేతి గాజులు సవరిస్తు న్నాడు.

"నువ్వు హాయిగా వుండమ్మా'' అన్నారు పిల్లలిద్దరూ.

తెల్లవారిపోయింది.

తిరిగి కాలేజ్, స్కూలు వీటిమధ్యకాలం తెలియలేదు శ్రీమహాలక్ష్మికి.

ఆమె మనసు ప్రశాంతంగా వుంది. పిల్ల లు ప్రేమిస్తున్నారు తనని.

★ ★ ★

వైష్ణవికి నొప్పులు ప్రారంభంఅయాయి. సుభద్రమ్మ పోయిన వెంటనే ఆ ఇల్లు ఖాళీ చేశారు. వైష్ణవికి ప్రసవించే రోజులు దగ్గర పడుతున్నాయని 'ఫోన్'లో చెప్పగానే ద్వా రక రెక్కలు కట్టుకుని వాలాడు.

హాస్పిటల్‌లో ఓ వైపు యతీ, మనోహరీ నిలుచుని రాబోయే బిడ్డకోసం ఎదురుచూస్తు




న్నారు. ద్వారక ఆమె దగ్గరే వున్నాడు. డాక్టరు వచ్చి చూసి వెళ్ళింది.

వైష్ణవికి దుఃఖం ఆగలేదు. ద్వారక చప్పున ఆమె వీపుమీద చేయివేసి "ఈ టైమ్‌లో బాధపడకు'' అని చెప్పాడు.

వైష్ణకి పెదవులు కదిలాయి. "మా అమ్మ పిచ్చితల్లి. ఏం చేస్తోందో. నన్ను కనేప్పుడు చాలా కష్టపడిందిట"

"ప్రశాంతంగా వుండు వైష్ణవీ''

"అమ్మ అందరిలా వుంటే నాకు గాజులు తొడిగించేది. సారె పెట్టి ఇంటికి తీసుకువెళ్ళే ది. నాకేదికావాలో అన్నీ చేసిపెట్టేది. కానీ ఈ అమ్మతో బజార్లో నడుస్తూంటే తల్లి బాగుందా, పిల్లబాగుందా... ఎవరికిరా ఛా న్స్ అంటే చచ్చిపోవాలనిపించింది ద్వార కా''

"ఈ టైమ్‌లో ఏవీ తలుచుకోవద్దు వైష్ణవీ. అమ్మ నీక్కావలసినవన్నీ యివ్వలేదా చె ప్పు. నాన్నగారు నిన్ను స్వంత బిడ్డలా చూసుకున్నారు. యింకా నీకేం కావాలీ''

"సారీ... నేనా వుద్దేశ్యంతో అనలేదు. అమ్మని చూడాలనిపించింది. కానీ చూడలే ను కదా, సంఘం, మర్యాద..." కన్నీళ్ళు తుడుచుకుంది.

"ఆవిడా, నాన్నగారూ యిద్దరూ మొదటి వాళ్ళకి డైవర్స్ యివ్వాల్సింది''

"ప్లీజ్ వైష్ణవీ'' ద్వారక ఆమెని ఓదార్చా డు.

"అమ్మ'' వైష్ణవికి తల్లిగుర్తువచ్చింది.

నాన్న ఏరీ? ఎక్కడ వున్నారో? అసలు ఏ విషయాలూ తెలియవేం? అన్నకి పౌరుషం జాస్తి జస్ట్ చూసినా వుగ్రుడైపోతాడు. కానీ అన్నకి అమ్మ అంటే ఎంత ప్రేమో?

వైష్ణవి వుండీ వుండీ పెద్దగా అరిస్తే మనోహరీ, యతీ పరిగెత్తి వచ్చేశారు. 'అ మ్మా' వైష్ణవి పెట్టిన కేకకి మనోహరి కడు పులో పేగులన్నీ కరకరలాడాయి. ఏడుపు వచ్చేసింది. కోడల్ని దగ్గరకి తీసుకుంది. "నేనున్నాను తల్లీ!... ప్లీజ్ ఏడవకు... కొద్దిగా వోర్చుకో''

యతి ఆమె చేతిని ఆదరంగా తడిమి "ఏడవకు కొంచెం సేపట్లో మనింట్లోకి ఓ గొప్ప అతిథి వస్తాడు'' అన్నాడు.

వైష్ణవి మరోసారి "అమ్మా'' అంది బాధ భరించలేక.

"వచ్చేశానమ్మా. నేనూ అమ్మనే. నో క్రయింగ్'' సబిత వైష్ణవి జుట్టు నిమిరింది.

డాక్టర్ రాగానే ఎక్కడివాళ్ళు అక్కడికి తప్పుకున్నారు.

అరగంటసేపు వైష్ణవి పెట్టిన కేకలకి తల్లు లు బొమ్మరాళ్లై పోయారు. యతీ, చలపతీ, ద్వారకా రాబోయే కేకకి ఎదురుచూస్తూ చెవులు అటుపెట్టారు.

'కేరు'మంది కొత్తప్రాణి.

చైతన్యం వచ్చింది. అంతసేపూ వూపిరి, బిగపెట్టుకున్న వాళ్ళు హాయిగా శ్వాసపీల్చు కున్నారు. వైష్ణవి పక్కలో పాపని ఆనందంగా చూసింది. బుల్లిబుల్లి చేతులు, కాళ్లు 'అద్భుతం' అనుకుంది. ఆ వెంటనే నిద్రపట్టేసింది.

శ్రీమహాలక్ష్మికి 'గాస్' చెప్పాడు. "అ చ్చం మీలాగే వున్నాడు అక్కా?''

శ్రీమహాలక్ష్మి వుదాసీనంగా "వూ'' అంది.

"ఆవూరుకు ఈవూరు ఎంతో, ఈ వూరికి ఆవూరు అంతే. ఎవరికి ఎవరు? పెంచు కుంటే పెరిగేవీ, తెంచుకుంటే తెగేవీ ఈ మమకారాలు''

"నేను చూసివచ్చాను. అచ్చు నువ్వే'' పరశురామ్ తల్లి భుజాలచుట్టూ చేతులు వేశాడు.

విని వూరుకుంది. ఏ స్పందనాలేదు.

ఆ రాత్రి పూర్ణచంద్రరావు రాగానే చె ప్పింది. "మీ ముద్దుల కూతురుకి కొడుకు పుట్టాడు''



పూర్ణచంద్రరావు అద్భుతాన్ని చూస్తున్నట్లు పెట్టాడు మొహాన్ని! "వెళ్ళి చూసిరానా?"

చివుక్కుమంది శ్రీమహాలక్ష్మి మనసు. "తననీ రమ్మని పిలవచ్చు కదా''

"నేను రాకూడదా''

"కూడదు''

"చాలా పెద్దశిక్ష"

"తప్పదు శ్రీమహాలక్ష్మీ. కొంతకాలం ఓర్చుకోవాలి''

"ఇక్కడ వుండండి''

"వీలుకాదు''

శ్రీమహాలక్ష్మి మౌనంగారోదించింది.

కొద్దిసేపటికి సర్దుకుంది ఆమె.

"కొంచెం ఓపిక పట్టు'' అన్నాడాయన.

శ్రీమహాలక్ష్మి ఈ మాట వినివినీ విసిగిపోయింది.

పరశురామ్ ఆ గదిలోకి వచ్చి "వైష్ణవి పిల్లవాడిని నేను చూశాను నాన్నగారూ'' అన్నాడు.

పరశురామ్, అరవింద్ తండ్రిపక్కనే కూర్చున్నారు.

అప్పుడు చెప్పాడు పరశురామ్ "నేను పాండిచ్చేరి వెళ్ళిపోతున్నాను నాన్నగారూ! నాకు మంచి జాబ్ వచ్చింది''

"ఎప్పుడు''

"రెండు మూడురోజుల్లో వెళ్ళిపోవాలి''

"చెప్పలేదేం"

"సెలక్టయేవరకూ చెప్పకూడదనుకున్నాను''

"సెంటిమెంట్ అన్నమాట. డబ్బు కావాల్సివుంటుంది గదా!"

"పదివేలు జీతం 'క్వార్టర్' అన్నీ యిస్తారు. రిసెర్చ్, కూడా చేసుకోవచ్చు. అక్కడికి వెళ్ళాలంటే డబ్బుకావాలి నిజమే''

"నాకు చెప్పలేదేంరా'' అని అడిగింది శ్రీమహాలక్ష్మి.

"ఇద్దరూ వున్నప్పుడు చెప్పాలని'' ఆ తర్వాత... పరశురామ్‌గానీ, అరవింద్‌గానీ కొద్దిసేపు మాట్లాడలేదు.

శ్రీమహాలక్ష్మి... అతనికి యిష్టం అని అరటికాయ బజ్జీలు చేస్తోంది. ఓవైపు పాలు కాగుతున్నాయి. పూర్ణచంద్రరావు బయటకి వెళ్ళినప్పుడు మాత్రమే కాఫీ, టీలు తీసుకుంటాడు. ఇంట్లో అతను పాలు యిష్టపడతాడు.

పరశురామ్ అతనివైపు చూసి "నాన్నగారూ'' అని ఆగాడు.

"నాన్నగారూ! నేను వెళ్ళిపోతున్నాను. డాడీ ఎక్కడ వుంటున్నారో ఏం చేస్తున్నారో తెలియదు. ఆయనపట్ల అన్యాయమే జరిగింది''

శ్రీమహాలక్ష్మి కోపంగా అంది. "నువ్వా మాట అనకు రామూ! అతని నిర్లక్ష్యం బాగుందా''

"పోన్లేమ్మా. ఎంతైనా మాకు జన్మయిచ్చిన తండ్రి ఆయన. నాన్నగారికి అందరూ వున్నారు. బంధువులు, స్నేహితులు, తోడబుట్టినవాళ్ళు'' అని అతనివైపు తిరిగాడు.

"మళ్ళీ చెప్పాలంటే మీరు ఇంటికి వెళ్ళగానే మీకోసం ఎదురుచూసే భార్యాపిల్లలూ వున్నారు. మీతో ఆడుకునేందుకు అన్నయ్య కొడుకువున్నాడు. కానీ డాడీ..." అతని గొంతు గాద్గదికం అయింది. కొంచెం ఆగి మళ్ళీ చెప్పాడు. "పోనీండి ఆయనో నష్టజాతకుడు. మా అమ్మని మీకు అప్పజెపుతున్నాను. మీరావిడ మనసు నొప్పించనని మాట యివ్వండి. మీరు పేరుకే తండ్రిలా, ఆవిడకి తాళికట్టినందుకు పేరుకే మొగుడిలా ప్రవర్తించద్దండి. మీరు ఇక్కడ కూడా వుండాలి. మాతో కలిసి భోజనంచేయాలి. మీరేమాత్రం అమ్మని కష్టపెట్టినా నేను జాబ్ వదిలివచ్చేయాల్సి వస్తుంది''

పూర్ణచంద్రరావు కొడుకు భుజంమీద చేయివేశాడు. ఆ తర్వాత చేతిలో చేయి వేశాడు.





"తప్పకుండా నువ్వు చెప్పినట్లు చేస్తాను''

శ్రీమహాలక్ష్మి చకితురాలైంది. నమ్మలేక పోతోంది. క్షణం ఆగాక నమ్మింది.

పరశురామ్ వెళ్ళిపోయాడు. అరవింద్ క్షణం కూడా అన్నని వదిలి వుండడు.

పూర్ణచంద్రరావు టిఫిన్ పూర్తిచేసి "ఇటురా శ్రీమహాలక్ష్మి'' అని పిలిచాడు.

ఆమె అతని పక్కనే కూర్చుంది.

అతను విచిత్రమైన మనిషిలా అనిపిస్తాడు ఆమెకి.

"నీ మనసు నొప్పించను. ఈ ఇరుకు ఇంట్లో నేను వుండలేను''

ఆశ్చర్యపోయింది ఆమె.

"మరీ తెలివిలేనివాడిని కాను శ్రీమహాలక్ష్మి. ఈవాడలో నేను ఇబ్బందిగా ఫీల్అవుతున్నాను. పోష్ లోకాలిటీలో ఒకరిగురించి మరొకరికి పట్టింపు వుండదు. అక్కడ నీకోసం ఇల్లు తీసుకుంటాను. అప్పుడు పిల్లలతో కలిసి భోజనంచేస్తాను''

శ్రీమహాలక్ష్మికి కోపంవచ్చింది. "మనస్తత్వాల్ని వాడల్నిబట్టి అంచనావేయవద్దండీ. ఈ కాంపౌండ్‌లో పుట్టిపెరిగాను. ఈ కాంపౌండ్ ఒకప్పుడు పేదవాళ్ళ కాలనీయే. ఈ కాంపౌండ్‌లో కులం, మతం లేదండి. ఆ అవసరం రాలేదు ఇక్కడి వాళ్ళకి. ఒకరి కులాన్నీ మతాన్నీ మరొకరు గౌరవించే వాళ్ళు. ఎక్కువ తక్కువలు లేవు. అంతా కలసిమెలసి వుండేవాళ్ళం.

"సిక్కులు, మహమ్మదీయులు, పార్శీలు, క్రిష్టియన్లు, భారతదేశంలో వుండే ప్రజలూ, వారి మతాలూ అలవాట్లు జీవనవిధానం యివన్నీ ఒకచోట కూడాలంటే ఈ కాంపౌండ్ సరిపోయేది. అందరూ నావాళ్ళే. అందరి కష్టాలూ మనవే... సోషల్ స్టేటస్... మానవత్వపు విలువలు ఇక్కడి వాళ్ళకి తెలుసండి. ఈ నేల ప్రభావమో మరేమో పాతకాలం ఇళ్లు కొని మోడీఫై చేసుకుని వుంటున్నారు. ఎక్కడో కొంతమంది బదిలీ అయి వెళ్ళారేమో కానీ ఈ కాంపౌండ్‌ని వదిలిపెట్టలేదండి.''

పూర్ణచంద్రరావు నవ్వాడు. అతను గట్టిగా నవ్వడం సరిగా చూడలేదు ఆమె.

"ఒక్కమాట చెబితే సరిపోయేదిగా. నీకీ ప్రదేశం యిష్టం అని''

"పోష్ అంటే ఇవన్నీ చెప్పాను. ఇక్కడి మనుషుల హృదయాలు విశాలమైనవి. మీకున్న దురభిప్రాయాన్ని పోగొట్టాలని చెప్పాను అంతే!

పూర్ణచంద్రరావు సర్దుకుని కూర్చున్నాడు. "మనపెళ్ళి... విచిత్రమే. శ్రీమహాలక్ష్మి మా ఇళ్ళల్లో పెద్దగా ఎవరూ చదువుకోలేదు. ఆడవాళ్ళు భర్త పక్కనే కూర్చుంటే మాకు ఎబ్బెట్టుగా వుంటుంది. ఇప్పటికీ మా నాన్న వస్తే మా అమ్మ లేచి నిలుచుంటుంది. నువ్వు చాలా ఫాస్ట్ అనిపిస్తుంది. నీ స్పీడ్ చూస్తే నాకు భయం...''

ఆశ్చర్యపోయింది శ్రీమహాలక్ష్మి. "నేనేం చేశాను?''

"ఎక్కడో.. నాకే అర్థంకాదు. నీ ఆలోచనలు సామాన్య స్త్రీలా అనిపించనీయవు. సమాన హక్కులూ, పోరాటం యివన్నీ నాకు ఇష్టంవుండదు''

"ఓ అర్థంఅయింది''

"నేను టీచర్ని కాను ఎక్స్‌ప్లెయిన్ చేయలేను. అయినా ప్రయత్నిస్తాను. స్త్రీ సుకుమారంగా వుండాలి. ఈ హక్కులూ... స్వేచ్ఛ ఇవన్నీ అడుక్కుని సంపాదించాల్సిన పనిలేదు''

"స్త్రీ అనగానే లాలిత్యం కనిపించాలి. భర్తచాటున హాయిగా బతకాలి. ఆకుచాటున పిందెలా''

"అంటే మీరు స్త్రీలు చదువుకోవడం, రాజకీయాల్లో పాల్గొనడం...''

అవన్నీ నాకు గిట్టవనను. నా భార్య

అనే స్త్రీ గురించే నేను చెబుతాను. ఎండకి వడిలిపోయి అవసరం లేకపోయినా హైరాన పడుతూ జాబ్ చేయడం నాకు యిష్టంలేదు. ఇంట్లో పిల్లల్ని తీర్చిదిద్దుతే చాలు

అతను ఇంకేమీ చెప్పలేదు. "నువ్వు బెంగపెట్టుకోవద్దు'' అని లేచి "రామా" అని పిలిచాడు. "నీ ప్రయాణానికి ఏం కావాలో సిద్ధం చేసుకో. జాబ్ పెద్దదైనా చిన్నదైనా మనకి తిండిపెట్టేది. జాబ్‌ని గౌరవించు. బాస్ తిట్టాడనీ, జీతం సరిపోలేదనీ వచ్చేయద్దు. మనం నిలబడ్డచోట మన కాళ్ళు పటిష్ఠంగా వుండేట్లు చూసుకోవాలి. ఏ కంపెనీగానీ, ఆఫీసుగానీ, సంస్థగానీ మంచి వర్కర్‌ని వదులుకోదు. వర్కర్ ఆ విధంగా వుండాలి. అర్థమయిందనుకుంటాను. చిన్నపిల్లాడివి కనుక చెబుతున్నాను''

పరశురామ్ చిన్నగా నవ్వి "అలాగే'' అన్నాడు. "అన్ని ఏర్పాట్లకీ కావల్సిన డబ్బు ఆఫీసుకు వెళ్ళి తీసుకో. నేను ఫోన్ చేసి చెప్పివుంచుతాను'' అని చెప్పి బయలుదేరాడు. పిల్లలు బయటివరకూ వచ్చారు.

★ ★ ★

పాండిచేరి వెళ్ళేముందు అరవింద్‌ని తీసుకుని సుధ ఇంటికి వెళ్ళాడు పరశురామ్. అంతక్రితం వెళ్ళిన రెండుమూడు సార్లలోనే సుధ గొప్ప ఆత్మీయురాలైపోయింది.

ప్రేమ వేరు, సెక్స్‌వేరు, స్నేహంవేరు. ఈ మూడింటినీ దాటి మరేదో వుంది. దానికి పేరు లేదు. స్నేహంకంటే గొప్పది వుందా అని అడిగితే యస్... వుంది అని పకడ్బందీగా చెప్పగల బాంధవ్యం ఏదో వుంది. దాని పేరు నిఘంటువులో ఎందుకు లేదు? నిఘంటువు కూర్చిన పండితులకీ మనోభావం ఎదురవలేదా?

ఆ అద్భుతమైన మానసికానందాన్ని నిఘంటు కర్త అనుభవించలేడా? అటువంటిది జరిగినా అతను ప్రేమ, పెళ్ళి, స్నేహం వీటితో సరిపెట్టేశాడేమో.

తమ మధ్యవున్న ఈ బంధానికి పేరు పెట్టలేకపోయాడు పరశురామ్.

స్త్రీ పురుషుల స్నేహంలో ఆకర్షణ వుంటుందనే సూత్రం అతనికి తెలుసు. ఎందుకంటే పురుషుడు ఎదుటి అమ్మాయిలో ఫిజిక్ దగ్గర్నుంచీ గొంతులోపలి స్వరం వరకూ భిన్నంగా వుండడం గమనిస్తాడు కనుక.

తనలాంటి మరో బింబం తనకేం పూరట యివ్వగలదు? భిన్నత్వంలో వున్న ఆకర్షణ ధృవాలదగ్గరే ప్రారంభం అయింది.

బాగా అలసిపోయి ఎండవేడిమిని పగలల్లా భరించిన వ్యక్తి చల్లని సాగరతీరం... అని పరిగెత్తుతాడు. లేదా డాబామీదకి వెళ్ళి చల్లగాలిలో అని పాడుకుంటాడు.

అక్కడ సాగరతీరం అయినా, యిక్కడి చల్లని గాలి అయినా అతనికిచ్చేది ఉపశమనమే. అది సుధవంటి పిల్లల్లో పుష్కలంగా వుంటుంది.

పరశురామ్ మౌనంగా వుంటే "సో డాక్టరుగారు పాండిచేరి సుందరాలు చూపిస్తారన్నమాట" అంది గలగలా గవ్వలు కుమ్మరించినట్లు.

"తప్పకుండా'' అన్నాడు మనస్ఫూర్తిగా.

"అవునూ! ఆంధ్రదేశంలో వుద్యోగమే దొరకదా పరశురామా! అంతదూరం వెళ్ళిపోతున్నావు?"

పరశురామ్ చిన్నగా నవ్వాడు. "కాట్...పట్టుకున్నావు. సుధా! నేనా యింట్లో యిమడలేకపోతున్నాను. చదువు పూర్తయేవరకూ వూపిరి ఆడనట్లు ఫీలయ్యేవాడిని. కాలేజ్ లైఫ్ చాలా అద్భుతంగా వుంటుందని సినిమాల్లో చూశాను. నవలలూ, కథలూ చదివాను కానీ నేను నా కాలేజ్‌లైఫ్‌ని ఓ అరణ్యవాసమో, అజ్ఞాతవాసంలానో గడిపేశాను''

"ఛ... సుధ విసుక్కుంది. బతకడం చేతకాని వాళ్ళంతా యిలాగే మాట్లాడతారు.





నీ సంతోషాన్ని నలుగురికీ పంచిపెట్టు. నీ దుఃఖాన్ని వంటరిగా అనుభవించు. ప్రతి మనిషికీ తలకు మించిన సమస్య లుంటాయి. వాటిని యింట్లోనే వదిలేసి హాయిగా బతకాలి. కనీసం అలా నటించాలి."

"నో" తల అడ్డంగా తిప్పాడు పర శురామ్! "నాకు నటించడం రాదు. అలా నటించేవాళ్ళన్నా గిట్టదు. వున్నమాట చెప్పే యడం నా అలవాటు"

"అందుకే నీ ఫ్రెండ్స్ నీతో జీవితం చివరివరకూ రారని తెలుస్తూనే వుంది"

"అదెలా?"

"ఒక్కసారి కూడా నువ్వు నీ ఫ్రెండ్స్ సర్కిల్ గురించి చెప్పలేదు"

"అదా" నవ్వేశాడు పరశురామ్. "నా క్కూడా నిజాయితీగా ప్రేమించే ఫ్రెండ్స్ వున్నారు సుధా. వాళ్ళల్లో అతి ముఖ్యం అయినవాళ్లని కూడా యింటికి తీసుకురాలే ను. నేను వాళ్ళ యిళ్ళకి వెడితే వాళ్ళని మా యింటికి తప్పనిసరిగా పిలవాలి. అలా చేయనీయవు నా పరిస్థితులు"

సుధకి ఒళ్ళు మండిపోయింది. "అ ద్దంలో అందంగా కనిపించాలని మంచి మూడ్‌లో వున్నప్పుడే చూసుకుంటాం. అలా గే జీవితంకూడా సుఖమయం చేసుకోవాలని ప్రయత్నిస్తాం. వాళ్ళందరికీ మనగురించి 'టముకు' వేయఖర్లేదే."

"నువ్వు అర్థం కావు సుధా"

"అదేంకాదు. నా మాటలు పచ్చినిజాలు. వాటిని రిసీవ్ చేసుకునే గుండెధైర్యం లేదు నీకు"

"సుధా! నాకీ జాబ్ రావాలని గురువుగా ర్ని శతధా వేడుకున్నాను"

"సిగ్గులేకపోతే సరి. నీకు గురువుగారు తప్పించుకోమని చెప్పలేదు. వుండి ఎదుర్కోవడం నేర్చుకో పరశురామ్"

కొద్దిసేపు పరశురామ్ మాట్లాడలేదు.

సుధ కాఫీ తెచ్చి అన్నదమ్ములిద్దరికీ యిచ్చింది. అరవింద్ పాటలు వినడంలో నిమగ్నం అయిపోయాడు. కృష్ణానీ బేగానే బారో. కలోనియల్ కజిన్స్ ఎవిర్‌మాన్ ట్రైస్ టు... రిథమిక్‌గా పాడుతున్నాడు.

"భలే పాడుతున్నావు" సుధ వాడిని ముద్దుపెట్టుకుంది. వాడు ముందు తెల్ల బోయి తర్వాత నవ్వేశాడు. చెంపమీద ఎంగిలి తుడుచుకుందాం అనుకుంటే టీ షర్టు అందలేదు.

"వుంచుకో" అంది సుధ.

"సుధా! ఇక్కడ ఎంత బాగుంటుందో తెలుసా?" అన్నాడు పరశురామ్.

"తెలీదు" అంది నవ్వి.

"మా యిల్లు ఒకప్పుడు యిలాగే వుండేది. నవ్వులపువ్వులు ఏరుకునేవాళ్ళం. సంగీత విభావరి అమ్మామ్మీడూ చెల్లీ పాడు తూంటే... తిరిగి ఆ రోజులు వస్తాయా సుధా! కల, యిక రావు. ఇది కూడా ఓ శిక్షే"

సుధ విసురుగా చేయి ఎత్తి వెంటనే దించేసుకుంది. "ఆశావాదులకి చావులేదు. నిరాశావాదులు వుంటారు చూడు వాళ్ళు క్షణం క్షణం చస్తూ బతుకుతారు. నాకు తెలియక అడుగుతాను పరశురామ్. మీ అమ్మ గురించి నువ్వు తెగ ఫీలైపోయి నీనెత్తిన ఆకాశం విరిగిపడినట్లు కబుర్లు చె ప్పకు. ఆవిడ తీరని కోరిక డాక్టర్ని చేసుకో వడం అని. కొడుకు అయినా డాక్టరైతే ఆనందిస్తుందని కష్టపడి చదివావు. ఆవిడ నవ్వుతూ హాయిగా వుంటే చూడాలనుకునే వాడివి. అసలు ఆవిడ చేసిందాంట్లో నాకేం తప్పుతోచడంలేదు. మీరే... మీరందరూ కలిసి ఆవిడని చంపేస్తున్నారు"

"ఇక ఆ విషయం వదిలేద్దామా?"

పక్క స్టేషన్‌లో మరో శబ్దంలా "ఝూమ్ తీ చలీ హవా" అరవింద్ మధ్య మధ్య పాడుతూ, నవ్వుతూ "సుధా! యిటు విను" అని డిస్టర్బ్ చేస్తూ ఆ సాయంకాలానికి రంగులు దిద్దుతున్నాడు.



సుధ అద్దంలో మొహం చూసుకుని "యిప్పుడు సరిపోయింది'' అంది. పరశురామ్‌కి అర్థంకాలేదు.

సుధ చున్నీ వేలికి చుడుతూ తీస్తూ నవ్వూ ఏడుపూల మధ్య మొహంపెట్టి గొంతు సవరించుకుంది.

"ఎక్కడో కలకత్తాలో వుండేవాళ్ళం. అంత చిన్నపిల్ల పక్కనే చిన్ని తమ్ముడు. వూరు కాని వూరు. భాష మనదికాదు. మన వాళ్ళంటూ లేరు. నానమ్మగారు వచ్చారు. కొన్నాళ్ళు వుండి వెళ్ళిపోయారు. ఇంట్లో నేనూ తమ్ముడూ...''

సుధ సీరియస్‌గా అయిపోయింది. "ఇటు చూడు'' అని చున్నీ పక్కకి తప్పించి చేతిని చూపించింది. అక్కడ చర్మం బాగా కాలింది.

"పప్పు పడింది. గిన్నె బరువుకి తట్టుకోలేకపోయాను. తమ్ముడు 'ఆకలి' అని ఏడుస్తూంటే వంట చేసే ప్రయత్నం చేశాను. నాన్నగారు వచ్చి చాలా బాధపడ్డారు. మా కోసం నాన్నగారు మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు. అమ్మతోబాటు మా ఆనందం కొట్టుకుపోయిందనుకునేవాళ్ళం. దట్స్ నార్మల్... కానీ యిప్పుడు నవ్వొస్తుంది'' సుధ నవ్వింది.

"ఏయ్ అలా నవ్వకు సుధా! అంతకంటే ఏడిస్తేనే బాగుంటుంది''

"మేం వెర్రివాళ్ళం కదూ. 'జాతస్యమరణం ధృవం...పుట్టిన వాళ్ళు ఎప్పుడో ఒకప్పుడు పోవల్సిందే' వెలితిని కాలం పూడుస్తుంది. ఎన్నో పనులు, వ్యాపకాలు. అమ్మ అంత కదిలించదు యిప్పుడు. మా వ్యక్తిత్వాల్ని మేం కాపాడుకోవడం తెలుసుకున్నాం''

వింటున్నాడు పరశురామ్. "నీ వెచ్చని నీడా...'' అని యివాళ చాలా పాటలు గుర్తువస్తున్నాయి సుధా!''

"తప్పేం వుంది... యింకారానీ''

"సుధా మనం యిద్దరం కలిసి శివ తాండవం చేద్దాం ఎప్పుడైనా, ఎక్కడైనా ఛాన్స్ వస్తే కబురుచేయి''

"ష్యూర్. నువ్వు మనుషుల్లో పడతానంటే కాదంటానా? యింతకీ ఎప్పుడు వెడుతున్నావు''

"రెండు రోజుల్లో ఫోన్ చేస్తాను. వీలైతే స్టేషన్‌కిరా. అమ్మని చూస్తుందు. అమ్మ జాగ్రత్త సుమా''

కస్సుమంది సుధ. "నేనెందుకు చూడాలి మీ అమ్మని. నీ బాధ్యతని వేరేవాళ్ళ నెత్తిన రుద్దకు''

"సుధా! నీకు కోప్పడ్డం కూడా రాదు. మా యింటికి వెడదాం నిన్ను అమ్మకి పరిచయం చేస్తాను''

సుధ తల అడ్డంగా తిప్పింది. "రాను'' అంటూ.

"బలవంతంగా ఎత్తుకెడతాను'' పరశురామ్ అన్నాడు.

"టైమ్ వచ్చినప్పుడు నేనే వస్తాను'' అంది గంభీరంగా.

"మరి మేం వెళ్ళొస్తాం'' అని లేచారు యిద్దరూ.

వీధిగుమ్మంవరకూ వచ్చి అక్కడ కాస్సేపు ఆపింది పరశురామ్‌ని. "పరిస్థితులకి దూరంగా పారిపోకు పరశురామ్. ఈ బస్టాపు దగ్గరా, మార్గమధ్యంలో గోడలమీద చూడు ఎంత అసభ్యకరంగా రాశారో...పద నేనూ వస్తున్నాను'' అని తలుపు గడియపెట్టింది.

తోవలో చెప్పింది. "నేను ఏవిటో నాకు తెలుసు. ఈ గోడలమీద రాతలు చూసి నేనేం పారిపోను. అంత దిగజారడం అనేది సంస్కారాన్ని బట్టి వస్తుంది. ఒక మగపిల్లాడితో రెండడుగులు నడిస్తే అదో ప్రహసనం కింద మారిపోతుంది. లెక్కజేయను. మొరిగే కుక్కలు కరవ్వు''

పరశురామ్ గోడలవైపు చూశాడు. అన్నీ సుధ గురించే. ఆ తర్వాత చూడలేకపోయాడు. "సుధా! నువ్వు గ్రేట్ ఆడపిల్లవి''

"టైటిల్స్‌వద్దు. నేను నేనే. ఎవరికీ భయపడను'' యింతకీ ఎందుకు చెబుతున్నానంటే నువ్వుకూడా ధైర్యంగా తలెత్తుకుని తిరుగుతావని.





అప్పటికే అతనామెని చాలా అర్థం చేసుకున్నాడు. "తప్పకుండా'' నీ మాటల్లో నిజాలున్నాయి.

"థాంక్యూ'' అంది. అరవింద్ వైపు తిరిగి. "అన్న లేడని రావడం మానేయకు. ఆశ్రమానికి కలిసేవెడదాం" అంది.

అరవింద్ బుర్ర వూపాడు.



తనకి వచ్చిన వుత్తరాన్ని పదేపదే చదువుకుంటోంది శ్రీమహాలక్ష్మి. పది పేజీల వుత్తరం అది. వుత్తరంతోపాటు ఐదువేల రూపాయల చెక్ తన పేర పంపాడు. అతను పాండిచేరి వెళ్ళి ఆరునెలలు అవుతోంది.

ముందుగా పాండిచేరి వర్ణనలతో నాలుగు పేజీలు నిండిపోయాయి. అరవిందాశ్రమం గురించి, జిప్‌మర్ గురించి, పాండిచేరి శుభ్రతగురించి వర్ణించాడు. సముద్రపు అలలు రాళ్ళమీద ఎలా విరుచుకుపడతాయో కళ్ళముందు చిత్రించాడు. ఆ తీరంలో కాఫీ క్లబ్బుల్లో కాఫీ రుచి గురించి రాశాడు. తమ్ముడిని అడిగాడు. నాన్నగారిని పలకరించాడు. వైష్ణవితో వూహలు పంచాడు. సుధా యీజ్ యీక్వల్ టూ వసుధైక కుటుంబం అంటూ అభివర్ణించాడు పరశురామ్.

ఎంతో ఎత్తుకు ఎదిగిపోయిన వామనుడిలా అనిపించాడా తల్లికి.

"అమ్మా! ముదితల్ నేర్వగరాని విద్య కలదే ముద్దారగ నేర్పించగ... అనేదానివి కదమ్మా''

డాడ్ వెళ్ళిపోయారు కనుక ఈ ద్వంద్వ జీవితాన్ని ఎప్పుడో చాలించావని నా నమ్మకం. డాడ్‌తో నీ జీవితం నిన్నటి కల అమ్మా. ఆ కమ్మని కలకి మేం తీపిగుర్తులం. చాలు. యింకెందుకు బాధపడడం?

"ఇప్పుడు నాన్నగారు తరచు వస్తున్నట్లు తలుస్తాను. ఇదికూడా ఆయన యిల్లే... అంతటి బిజినెస్ మాగ్నెట్‌కి అక్షరాలు దిద్దించక్కర్లేదు.

"ఆయన వదిలేస్తారేమో, వీళ్ళు వెలివేస్తారేమో అనుకునే రోజుల్ని మరిచిపోమ్మా.

"ప్రతిమనిషీ ఓ నిర్దిష్టమైన లక్ష్యంకోసం బతకాలి. ఏ లక్ష్యమైనా చివరికి చదువు దగ్గరో, డబ్బుదగ్గరో ఆగాల్సిందే.

"నువ్వు ఎన్నోపనులు చేయగలవు.

"వాలంటరీ రిటైర్మెంట్ తీసుకో లేదా స్కూలే మానేసేయ్. నీకు వచ్చిన రుచికరమైన పచ్చళ్ళు పెట్టి విదేశాలకి పంపు. నువ్వు నేర్చుకున్న సాఫ్ట్ టాయిస్‌తో బిజినెస్ చేయి. నీకు అండగా నాన్నగారు వున్నారు.

"ఆయనకి యిష్టంలేని పనులు చేయద్దు.

"నిన్నాయన కట్టడి చేయలేదమ్మా. స్త్రీ సౌకుమార్యాన్ని బండబారనీయకూడదని చెప్పారు అంతే.

"ఇంట్లో వుండి ఈ రెండు పనులూ చేయి. ఆయన మార్కెటింగ్ ఏర్పాట్లు చేస్తారు. ఎవరో వచ్చి మనల్ని వుద్ధరించడం ఎందుకు? మనమే పదిమందిని వుద్ధరించుదాం... మా అమ్మ తన ఈ ప్రయత్నంలో సఫలీకృతం కావాలని గురువుగార్ని ప్రార్థిస్తున్నాను.

"అమ్మా ఈ ఐదువేలు నాన్నగారికి

యిచ్చి నీక్కావలసిన సామగ్రి తెప్పించుకో. నిన్ను నువ్వు మరిచిపో. కష్టం అనిపించినా ఆ తర్వాత సుఖమే సుఖం...

"ఏ మనుషుల గురించి అల్లాడిపోయావో, ఏ మనుషుల మధ్య వూపిరాడలేదో వారి పాలిట కల్పవృక్షానివి కావాలని కోరుకుంటున్నాను. నాన్నగార్కి నమస్కారాలు. ఆయనకీసారి రాస్తాను. ఫోన్ చేస్తాను. మన బడుద్ధాయి హెల్ప్ తీసుకో. అందుకు వాడికో 'బైక్' కొనివ్వమని నాన్నగారికి చెప్పు. నేను అంతవరకూ నీ నీడలా వుంటాను.

నీ ఉన్నతిని చూడాలని అభిలషించే నీ కొడుకునమ్మా...

-పరశురామ్"

శ్రీమహాలక్ష్మి కళ్ళు తడిశాయి. అక్షరాలు అలుముకుంటున్నాయి. కన్నీటిచుక్కలు కాగితంమీద పడి ముత్యాల్లా మెరుస్తున్నాయి.

ఈ జీవితం యింత అందమైనది కూడా నా? కేవలం దుఃఖం తప్ప ఏమీ లేదనుకున్నాను.

కానీ, తనను అమితంగా ప్రేమించే పిల్లలున్నారు. ప్రేమ భాష్యం తెలియకపోయినా, ప్రేమగురించి చెప్పలేకపోయినా తనను ప్రాణాతీతంగా ప్రేమించే భర్త వున్నారు. ఎప్పుడో చెదరని కలలా, తళుక్కుమనే నక్షత్రంలా స్నేహమాధుర్యానికి ప్రతీకలా పాణిగ్రాహి తలపులున్నాయి. నీడలా సబిత, స్నేహ సౌరభాల్ని పంపించడం తప్ప అందించలేని నిస్సహాయస్థితిలో మనోహరి వున్నారు.

గాఢనిద్రలోంచి లేచి వళ్ళు విరుచుకుంటున్నట్లు బద్ధకాన్ని పారద్రోలేట్లు, జువ్వలాంటి నిర్ణయం తట్టిలేపింది శ్రీమహాలక్ష్మిని.

రెండు వారాల్లో రుచికరమైన పచ్చళ్లని సీసాల్లో పాక్ చేసింది.

ఇల్లంతా వాటితో చక్కగా కొలువు తీర్చింది. ఇంట్లో అడుగుపెట్టబోయిన పూర్ణ చంద్రరావు కళ్ళు జిగేల్ మన్నాయి. జీవకళ వుట్టిపడుతున్నట్లున్నాయి అవి.

"ఇవన్నీ ఎక్కడివీ?" సంభ్రమాశ్చర్యాలతో అడిగాడు అతను.

"నేను చేశాను" మంచినీళ్ళు అందించి పరశురామ్ వుత్తరం చేతికి యిచ్చింది.

పూర్తిగా చదివి 'మంచిపిల్లాడు' వూహూ 'మంచి పిల్లలు' అన్నాడు.

"దీన్ని మార్కెటింగ్ చేయాలి మీరు"

"ఓ..." అతనికి అర్థం అయింది. "యూ వాంట్ టు డూ బిజినెస్"

తలూపింది ఆమె.

అతను గదిలో పచార్లు చేస్తూ "స్త్రీ పట్ల నాకు గౌరవం వుంది శ్రీమహాలక్ష్మీ. అఖండమైన తెలివితేటలు ఆమెకు వుంటాయని కూడా తెలుసు. ఎలుగెత్తి అరవడం, పోరాటం చేయడం యిష్టం వుండదు. కొన్ని సందర్భాల్లో ఆమె వుద్యోగం చేయాల్సి వస్తే ఓర్పూ, నేర్పూ వున్న టీచర్ జాబే యిష్టం" అన్నాడు.

"ఇప్పుడెందుకు చెబుతున్నారు?"

"ఎదుగుతున్న 'స్త్రీ'ని అణిచేయడం నేను చేయనని చెప్పడానికి"

నవ్వింది శ్రీమహాలక్ష్మి.

"మనం యిల్లు ఈ యిల్లే కొని మోడిఫై చేసుకుందాం!"

"ఇప్పుడెందుకు ఖర్చు అనవసరంగా"

శ్రీమహాలక్ష్మి అతనివైపు దీర్ఘంగా చూస్తూ "ఈ ఇల్లు నాకు యిరుకు అనిపించడంలేదండి. ఒక్కొక్కళ్ళే యీ యింట్లోంచి తమ జీవితాల్లోకి వెళ్ళిపోతున్నారు. రేపు ఇంజనీరింగ్ అయిపోతే చిన్నవాడు కూడా వెళ్ళిపోతాడు. అప్పుడు యిల్లు నా ప్రాణానికి చాలా పెద్దదిగానే అనిపిస్తుంది" అంది.

"ఇంకా వాడికి చాలా టైమ్ పడుతుంది"

'అంతేగానీ మనం వుండేందుకు యీ యిల్లు చాలదు అనరేం?' అంతలోనే గొంతులోంచి మాట రానీయకుండా జాగ్రత్తపడింది.





అతను అక్కడ వున్న మంచంమీద వెల్ల కిలా పడుకున్నాడు. నిప్పులమీద వున్న ట్లుండే పూర్ణచంద్రరావు అంత రిలాక్స్‌డ్‌గా వుండడం శ్రీమహాలక్ష్మి చూడలేదు. అతని పక్కనే కూర్చుని చెంపమీద చేయి వేసుకుని నిశితంగా చూస్తోంది.

రెండు చేతులూ తలకింద పెట్టుకుని "శ్రీమహాలక్ష్మి ఈ యిల్లు నీకు నచ్చినట్లు మోడీఫై చేయించు. షాజహాన్ అంతటివాడు తన భార్యకి తాజ్‌మహల్ కట్టించగా లేనిది నేను నీకోసం యీ యింటిని తిరిగి కట్టించలే నా చెప్పు" అన్నాడు.

ఆమె జవాబు చెప్పలేదు.

"మాట్లాడవేం?"

"మీరు న్యాయం తెలిసినవారు. వీలై నంత త్వరగా న్యాయవాదిగా ప్రాక్టీసు చేయా లని చూస్తున్నవాళ్ళు. మీకంటే నాకేం ఎక్కువ తెలుస్తుంది?"

"నీకు యిలాగే బాగుంటుందా?"

శ్రీమహాలక్ష్మికి వుక్రోషం వచ్చింది. "ఎంతసేపు శ్రీమహాలక్ష్మి నీకు బా గుంటుందా, నీకు నచ్చిందా, నీకోసం అంటారేగానీ 'మనం' అనరేమండి? మీకు ఎక్కడో బేధం కనిపిస్తోంది. నా కోసమే అయితే అవసరంలేదు'' అంతసేపూ గొంతులో అణచివేసిన మాటలు బయటికి వచ్చాయి.

"సరే మనకోసమే యీ యిల్లు. నీకోసం నేను ఏమీ చేయననా? అన్నీ... అన్నీ చేస్తా ను. ఈ స్టెప్ ఎందుకు వేశానో అని నువ్వు జీవితంలో బాధపడకుండా చేస్తాను. విజేతవి నువ్వు అనుకునేట్లు చేస్తాను సరేనా!"

ఆమె సంభ్రమాశ్చర్యాలతో చూస్తుండిపో యింది అతనివైపు. "ఈ మనిషికి యిన్నిమా టలు వచ్చునా. ఈయన గుండెకింద యింత తడి వుందా? భగవంతుడా చాలు నాకీ అదృష్టం. కళ్ళు అరమోడ్పులై, చేతులు కైమోడ్పులయ్యాయి. హృదయం ద్రవించి కృతజ్ఞతతో, యిష్టంతో, ప్రేమతో, మరెన్నో భావాలతో అతని గుండెలమీద వాలిపో యింది.

ఆమెని అతను హృదయంలోకి తీసుకు న్నాడు.

అతను లేస్తూంటే చేయి పట్టుకుని ఆపింది.

"చెప్పు" అన్నాడు. అతని చేతివాచీ తరి మికొడుతోంది.

ఆమె అతని చేయి విడవలేదు.

భుజాలమీద చేయివేసి "కూర్చోండి'' అంది.

"నేను వెళ్ళాలి''

"చాలా ఏళ్ళక్రితం దాదాపు యిరవై సంవ త్సరాలక్రితం నాకు ఓ జ్యోతిష్యుడు చెప్పిన విషయం నిజమైంది''

అతను లేచే ప్రయత్నాన్ని విరమించుకు న్నాడు. ఆసక్తిగా చూశాడు.

అతని వళ్ళో తలపెట్టి మొహంలోకి చూ స్తూ చెప్పింది. "చాలామంది జోస్యం నమ్మ రు. అలాగే ఎక్కువమంది నమ్ముతారు. మీ గురించి నాకు తెలియదు. ఈ విషయం పాణిగ్రాహికి కూడా తెలియదనుకుంటాను.

ఓ ప్రసిద్ధ జ్యోతిష్కునివద్దకు పాణిగ్రా హికి కూడా చెప్పకుండా వందరూపాయలు తీసుకువెళ్ళాను.

"మెడలో రుద్రాక్షలు, జామపండు రంగు, మొహాన విభూది రేఖలమధ్య ఎర్రని గుండ్రని కుంకుమబొట్టు, లాల్చీచాటున తొంగిచూసే జంధ్యం, తెల్లని పంచకట్టు. చూడగానే పాద నమస్కారం చేయాలని పించింది. చేసి ఆయనకి వందరూపాయలు దక్షిణగా యిచ్చాను.

ఆయన నా శిరస్సుమీద చేతిని వుంచి ఆశీర్వదించారు.

"నీకు కొడుకు పుడతాడు'' అన్నారా యన.

"నివ్వెరపోయాను నాకు కొడుకు పుట్టడం

ఏమిటి? వైష్ణవికి ఆరేళ్ళు వస్తున్నాయి''

"ఆగస్టు నెలలో నీకు ఒక వ్యక్తితో పరిచయం అవుతుంది. అతను నీ జీవితాంతం తోడు వస్తాడు''

నివ్వెరపోయాను. దుఃఖంతో నోట్లోంచి మాటరాలేదు. ఆయన పాదాల్ని గట్టిగా పట్టుకుని "వొద్దు అలా జరగకూడదు. సరిగా చూసి చెప్పండి'' అని ప్రార్థించాను. నా మనసు అధీనం తప్పింది. అల్లకల్లోలం అయిపోతున్నాను.

"పిచ్చిదానా! నేను తలరాతలు చదివేవాడినేగానీ అవి రాసేవాణ్ణి కానమ్మా'' అన్నారు. ఎంత వుత్సాహంగా వచ్చానో అంత దిగులుతో పుట్టెడు దుఃఖాన్ని మూటకట్టుకుని బయటపడ్డాను. ఈమధ్యకాలంలో ఎంతోమంది పరిచయం అయ్యారు. నా అంతరాత్మ నన్ను అనుక్షణం కావలికాసింది. ఏమరుపాటు ఎరగను. చాలా జాగ్రత్తగా గడిపేశాను''

పూర్ణచంద్రరావు రెప్పవేయడం మరిచిపోయాడు. ఆయన గవ్వల్లాంటి కళ్ళల్లో కూడా సన్నని నీటిపొర.

"తక్షకుడినుంచి రక్షించుకునేందుకు పరీక్షిత్తు ఎంత ప్రయత్నం చేశాడు? నేనూ అంతే! అలా ఆగష్టు నెల గడిచిపోయింది. నిశ్చింతగా వున్నాను. నా జీవితంలోకి ఎవరూ రాలేదనుకున్నాను'' దీర్ఘంగా నిట్టూర్చి నవ్వింది.

"డైరీ చూసుకుంటే ఆగస్టు నెలలో పరిచయం మీదే. ఆయన చెప్పిన ఆగస్టు నెల అది. ఇది జరిగిన పదహారేళ్ళకి మనం పెళ్ళిచేసుకున్నాం... విధిని ఆపలేం"

"పాణిగ్రాహి గురించి అడగలేదా?"

"తోచలేదు. అడగాలన్న ఆలోచనే రాలేదు. భయంతో బెంగతో తిరిగివచ్చాను''

"మరెందుకు భయపడతావు శ్రీమహాలక్ష్మీ?"

"ఇల్లు, వాకిలి, డబ్బు, నగలు యివేవీ సెక్యూరిటీని యివ్వవు. తోడుకావాలి. ఒక సందర్భంలో ప్రేమ తిండిపెట్టదు అనుకునే దాన్ని. డబ్బు మానసికానందాన్ని యివ్వదు. డబ్బు గడించాలీ అనే వ్యసనం కాన్సర్ కన్నా భయంకరమైంది. అది మనిషిని దోచేసినట్లే డబ్బు కూడబెట్టడం మనిషిని మరే ధ్యాస వైపూ మళ్ళనీయదు''

"ఇప్పుడు నీకు లోటేం చేశాను శ్రీమహాలక్ష్మీ''

"ఎడారిలో వున్నట్లున్నాను. తీరం కనిపించడంలేదు. ఇనేళ్ళల్లో ఒక్కసారి కూడా ఆమె గురించీ, పిల్లల గురించీ మిమ్మల్ని నేనేమీ అడగలేదు. నా జాతకమో, ఖర్మో, లేదా పాణిగ్రాహిమీద నేను పెంచుకున్న అయిష్టంవల్లో ఏదైతేనేం మిమ్మల్ని ప్రేమించాను. ఎక్కడో ప్రేమ భావం లేకపోతే యింత తెగింపు రాదు బహుశా. ఒక 'స్త్రీ'ని అయివుండీ పెళ్ళి, పిల్లలూ... వీటి అర్థం... అన్నీ... సమస్తం ఏర్పాటు చేసుకుని పాణిగ్రాహిని వదిలిపెట్టేసేయడంలో చాలా సాహసం చేశాను

"మీ తలపుల్తో, అప్పుడప్పుడు చుక్క పొడిచినట్లు మీరు రావడంతో రోజుల్ని గడిపేస్తూ, ఒక్కసారి రోజుకి ఒక్కసారైనా పాణిగ్రాహిని తలుచుకోవడంలేదు. కానీ మీరు సంఘం, పలుకుబడి, వీటిని నాకోసం వదులుకోవడం లేదు. స్త్రీ తాను వలచివస్తే చులకన అయిపోతుందనేది యదార్థం.

"పాణిగ్రాహి ఈ క్షణం కూడా నా కోసం ప్రాణం పెడతాడు. అయితే ఏం... మా మధ్య దూరం మరెప్పటికీ తరిగిపోదు. గంట తర్వాత మీరా యింటికి పరిగెడతారు. అక్కడ మీ వాళ్ళంతా వున్నారు. నిజం చెప్పాలంటే ఓ స్త్రీ చేరిక మీకు కొత్తకాదు. ఇదీ అందులో ఓ భాగమే అయివుంటుంది''

పూర్ణచంద్రరావు అసౌకర్యంగా కదిలాడు.

"నిజం చెప్పండి నేనంటే మీకు ప్రేమ వుందా?"

అతను బుర్ర అడ్డంగా తిప్పాడు. "లే





దు... అసలు ప్రేమ విషయం గురించి ఆలోచించడం, బుర్ర పాడుచేసుకోవడం నాకు యిష్టం లేదు. అసలు వీటికోసం నా 'టైమ్' పాడుచేసుకోను''

"పక్కా వ్యాపారవేత్త గదా''

"నీ యిష్టం, నువ్వే పేరుతో పిలిచినా నాకు అభ్యంతరం లేదు''

"మీరు ఆమెతో కూడా ఇలాగే వుంటారా?"

"నాకు రెండు ముఖాలు లేవు. ఆమె నాతో వాదించదు. తను తలెత్తదు. నీకు ఇచ్చినంత చనువు కూడా ఇవ్వను. ఎందుకో నీ సమక్షంలో కరిగిపోతాను. అందుకే మళ్ళీ వస్తాను. పిల్లలతో కూడా ఎక్కువగా టైమ్‌ని గడపలేను''

తెల్లబోయింది శ్రీమహాలక్ష్మి. ఈ వ్యక్తితో జీవితాంతం గడపాలి. మేల్ ఈగో... అహంకారం. అడుగు ముందుకు వేశాక వెనక్కి తీసుకోలేం. అసలా ఆలోచనే రాకూడదు.

పాణిగ్రాహిని వదిలేసినందుకు బాధ పడడం లేదు. తన ప్రేమ అనే స్వాతిచినుకు ముత్యపుచిప్పలో పడితే ముత్యమై వుండేది. కానీ అది ఓ శిలమీద పడింది. ఏమైంది? ఏమీ కాలేదు.

పెళ్ళికి విలువ యివ్వడంవల్లో, మాట నిలబెట్టుకుందుకో అతను వస్తున్నాడు. అంతేనా?

"చాలా పనులున్నాయి, నేను వెళ్ళాలి''

"ఆ ఇంట్లో గంటల తరబడి..."

"అదేంలేదు. అదో జంక్షన్. 'నావి' అనబడే సమస్తం అక్కడవున్నాయి. నాకోసం చాలామంది వస్తూంటారు. ఫోన్‌లు వస్తాయి. బిజినెస్. దట్సాల్..."

"మళ్ళీ ఎప్పుడు వస్తారు?"

"వీలునుబట్టి''

అతని కారు మెత్తగా వెళ్ళిపోయింది.

ఆమె అచేతనంగా చాపమీద కూర్చుండిపోయింది. అరవింద్ అప్పుడే వచ్చాడు. మళ్ళీ చేతనం. వాడుకూడా లేకపోతే... పరశురామ్‌ని చూడాలని చాలాకోరికగా వుంది.

పూర్ణచంద్రరావుతో సినిమాలేదు, షికారు లేదు. ఎప్పుడైనా చెప్పబోతే "ఈ వయసులోనా?" అంటాడు భృకుటి ముడిచి. మనసుకో వయసూ, తనువుకో వయసూ అంటే ఒప్పుకోడు. ఎక్కడికి వెడుతుంది? ఒంటరిగా... వెళ్ళలేదు.

ఈ నిరాశా నిస్పృహా వొద్దు... అవసరంలేదు. ఎందుకిలా మనసు నీరసించిపోతోంది? పక్షవాతం వచ్చినట్లు, విశ్రాంతి లేని జీవితం. విశ్రాంతిలో మనస్తాపం... ఆమె లేచి నిలదొక్కుకుంది. ప్రేమ విలువ పడిపోతోంది. బానిస కాదు తను? అత్యంత విలువ నివ్వాల్సిన ఆ భావానికి చెత్తకుండీలో పదార్థాలకున్నంత విలువ కూడా లేదు.

ఫోన్ మోగింది. 'హలో' అంది శ్రీమహాలక్ష్మి.

"నేనువస్తున్నా అత్తా'' సుధ కంఠం అది.

చిగురాకులలో చిలకమ్మ... చిన్నమాట వినేందుకు వస్తోంది.

అప్పుడప్పుడు మెరుపుతీగలా ఇట్టే వచ్చి అట్టే మాయమౌతుంది.

ఎడారిలో ఒయాసిసులా.

చీకట్లో చిరుకాంతిలా.

ఆ పిల్ల సాంగత్యం వెన్నెలగోదారి.

ఎంత హాయి... ఒక్కోవ్యక్తి వునికి ఎంత ఆహ్లాదాన్ని ఇస్తుంది. ఫోన్‌లో తరంగాలు సైతం ఆలశ్యం చేసినట్లు ఫోన్ యింకా క్రెడిల్‌మీద వుంచకముందే ఆటోలో ఝామ్మంటూ వచ్చేసి 'హలో అత్తా' అని శ్రీమహాలక్ష్మిని చుట్టేసింది.

ఆ గుండ్రటి మొహాన్ని తన చెంపకు చేర్చుకుని ఓ చిన్న ముద్దు ఇచ్చింది. "రాత్రి అవుతోంది. ఇప్పుడిలా వస్తే చీకట్లో ఎలా వెడతావు సుధా'' అని అడిగింది.

"అసలు ఇంటికే వెళ్ళేదాన్ని. సడన్‌గా మీరు గుర్తువచ్చారు. అంత గుర్తువచ్చారంటే నా అవసరం మీకేదో వుండి వుంటుంది అని వచ్చేశాను''

"థాంక్యూ''

"ఇంతకీ బావున్నారా?"

"బాగానే వున్నాను''

"మామయ్య వచ్చారా''

"వచ్చారు. వెళ్ళారు. కూర్చో కాఫీ, టిఫిన్ తెస్తాను'' అంది ఆమె.

"కూర్చోను. మీ వెనుకే. యింతకీ పరశురామ్ బావున్నాడా?"

"బాగున్నాడు'' శ్రీమహాలక్ష్మి గాస్‌మీద వేడినీళ్ళు పెట్టింది. పాలు మరోవైపు వుంచింది.

"వా...వ్' సంబరంగా కేకపెట్టింది సుధ. "రియల్లీ గ్రేట్. మీరు పికిల్స్ చాలా బాగా తయారుచేశారు. మార్కెటింగ్ చేసిపెట్టనా''

నవ్వింది శ్రీమహాలక్ష్మి. "కంటాను అనే కోడలు వుంటే, వద్దు అనే అత్తగారు వుంటుందా''

"చాలా బావున్నాయత్తా. కొన్ని ఇప్పుడు తీసుకువెడతాను సరేనా''

శ్రీమహాలక్ష్మి ఓ ప్లేట్లో కొంచెం మిక్చర్ వేసియిచ్చింది "ఈ చీకట్లో నిన్ను పంపలేను సుధా. ఆడపిల్లవి... అందులో చక్కని చుక్కవి''

"ఊరుకోండత్తా. మీరు కూడా ఆడపిల్లవి... అనకూడదు. ఆడపిల్లైతే ఏమిటట? చేదుమింగిందా? విషం కక్కిందా? లేదే గాంధీ మహాత్ముడన్నార్ట ఈ గోళ్ళూ, పళ్ళూ ఆయుధాలు అని''

"నిజంగా ఆయనే అన్నారా?"

"నేను వినలేదుగాని ఎవరో చెప్పారు'' చిలిపిగా నవ్వింది. అంతలోనే హఠాత్తుగా "నా పెళ్ళి కుదిరింది అత్తా'' అంది.

శ్రీమహాలక్ష్మి ముచ్చటగా చూసింది. "ఏం చేస్తాడతను?"

"బ్యాంకాఫీసరు. భాష మన్దికాదుట. మనవాళ్ళే. బానేవుంటాడుట. హృదయమే విశాలంట... పాపం?"

"అంటే?" భయపడింది శ్రీమహాలక్ష్మి.

"అయ్యో అత్తా! ఆయన చాలా గొప్పవాడుట"

"అన్నీ 'ట'లే నువ్వు చూడలేదా?"

"గురువుగారికి నచ్చితే నేను చూడ్డందేనికి అత్తా''

"గాడ్‌బ్లెస్‌యూ''

"థాంక్యూ'' అంది సుధ.

"బొమ్మలూ, పచ్చళ్ళూ తీసుకు వెడతానంటున్నావు. మధ్యలో నన్ను ముంచేయకు. తీరం చేర్చగలిగితేనే వాటిని తీసుకువెళ్ళు సుధా''

సుధ నవ్వింది. "ఆంధ్రా దాటినా, అమెరికా చేరినా ధోకాలేదత్తా నేనున్నాను ఇంతకీ మీరెలా వున్నారత్తా?"

"ఇదిగో యిలా'' కన్నీళ్ళ పొర అడ్డుపడుతూంటే సుధ విసుక్కుంది. "ఈ ఆడవాళ్ళింతే. చీటికీమాటికీ కన్నీళ్ళు,కళ్ళల్లో నీళ్ళు వుంటాయని అందరికీ తెలుసు. ఎందుకత్తా 'వృధా' చేస్తారు? అవసరం అయినప్పుడు 'చుక్క' కూడా దొరక్కపోతే ఎంత కష్టం?" అంది తన పక్కనే ఆమెని కూర్చోబెట్టుకుంటూ.

"సుధా, యిన్నేళ్ళల్లో మా ఇంటికి నువ్వూ సబితా తప్ప ఎవరూ రాలేదు తెలుసా?"

"అయితే ఏమైంది? ఎవరూ రాకపోయినా కాలం ఆగిపోదు. దాని పని అది చేసుకుంటూ వెళ్ళిపోతుంది దట్సాల్. అయినా అత్తా! మీకు నచ్చినట్లు మీరు గడుపుతున్నారు. అందరూ యాక్సెప్ట్ చేయాలనిగానీ రిజెక్ట్ చేయాలనిగానీ లేదే''

శ్రీమహాలక్ష్మి నవ్వి వూరుకుంది.





సుధ ఆమె చేతి గాజులు సవరిస్తూండిపో యింది. "అత్తా! మీరు నమ్ముతారో లేదోగానీ యింత దగ్గరగా ఎవరితోనూ వుండలేదు నేను. పరశురామ్ 'మా అమ్మ' అని గొప్పగా చెబుతూంటే 'చూడాలను'కునేదాన్ని. ఏదీ టైమ్ దొరకక ఆలశ్యం చేశాను. మొదటి సారి మీ ఇంటికి వచ్చినప్పుడు ఎలా మాట్లా డారో ఇప్పుడూ అంతే, తేడాలేదు''

"అమ్మలందరూ ఒకేలావుంటారు సుధా''

"పరశురామ్ అలా చెప్పలేదత్తా 'మా అమ్మలాంటి అమ్మ రేర్' అనేవాడు''

సుధ బయలుదేరుతూండగా వచ్చాడు అరవింద్. "హాయ్'' అంది సుధ. "నువ్వెప్పుడు వచ్చావు?"

అరవింద్ ఆవలింతకి చిటికెవేసి "నిద్రవస్తోంది సుధక్కా నీ గొంతు విని కలేమో అనుకున్నాను. నాన్‌స్టాప్ మిషీన్ని లేపి కూర్చోబెట్టావు'' అన్నాడు.

"సుధని డ్రాప్ చేసిరా అరవింద్'' అంది శ్రీమహాలక్ష్మి.

"నేను వెళ్ళగలను. వెళ్ళి ఫోన్ చేస్తాను. నాకు పిరికి మందు పోయద్దు అత్తా''

"వెళ్ళనీమ్మా''

"నీ యిష్టం" అంది.

వెన్నెల్లో ఆ పిల్ల చాలాదూరం వరకూ కనిపించింది.

★ ★ ★

ప్రతి సమస్యకీ ఓ పరిష్కారం తప్పకుండా వుంటుంది. కాకపోతే కాలం ఈ తీర్పుని యివ్వడంలో త్వరగా చేయవచ్చు ఆలశ్యమూ కావచ్చు.

పూర్ణచంద్రరావుతో పెళ్ళి అయిన ఐదేళ్ళు కృంగికృశించి బేలగా, నిస్సహాయంగా వుండిపోవడం మాత్రమే శ్రీమహాలక్ష్మికి అప్పట్లో తెలిసిన విద్య.

అనుకోకుండా ప్రారంభించిన పచ్చళ్ళూ, సాఫ్టాయిన్ వ్యాపారం క్రమంగా పుంజుకుంది. ఒక్కో చేతి మహిమ కూడా దానికి తోడైతే ఇక చెప్పనవసరమేలేదు.

డబ్బు సంపాదించడంలో, విద్యని ఆర్జించడంలో సంతృప్తి వుండకూడదనే నీతి చంద్రికలోది. పూర్ణచంద్రరావు ఈ విషయంలో తిరుగులేని స్వామాట్టు.

ఓవైపు పచ్చళ్ళ వ్యాపారం.

మరోవైపు సాఫ్టాయిన్.

ఆ ఇల్లు కొని అపార్ట్‌మెంటు కట్టాడు పూర్ణచంద్రరావు. మొత్తం పన్నెండు పోర్షన్లలో రెండు పోర్షన్లు తమకోసం వుంచుకున్నారు.

శ్రీమహాలక్ష్మి అడిగితే అతను నగరానికి నడిబొడ్డులో కట్టించి ఇవ్వగల సమర్థుడు.

ఇక్కడ భర్త అన్న పరిపూర్ణవిశ్వాసం, భక్తీ గౌరవం వున్నా ఎక్కడో శ్రీమహాలక్ష్మి తనకి 'యింతచాలు' అనే భావం వుంది. చెరకు తీయగా వుందని వేళ్లతోసహా తినేయడం అన్యాయం.

పూర్ణచంద్రరావు నెలలో పదిహేను రోజులు ఇక్కడ వుండడం పూరటగానే వుంది.

సుధ పెళ్ళిచేసుకుని బెంగుళూరు వెళ్ళిపోయింది. అయితే ఏం ఆ అమ్మాయి సర్కిల్ పెద్దది.

అరవింద్‌కి అనంతపురం ఇంజనీరింగ్ కాలేజ్‌లో సీటు వచ్చింది. అతను ప్రతీ సెలవులకీ వచ్చివెడుతున్నాను.

ఆ రాత్రి పూర్ణచంద్రరావు యింకా ఇంటికి రాలేదు.

శ్రీమహాలక్ష్మి బాల్కనీలో కూర్చుంది. ఖరీదైన కాటన్ చీర కట్టుకుంది. పైనుంచి చూస్తూంటే ఇప్పుడు రోడ్డు స్పష్టంగా కనిపిస్తోంది. చిత్రాల నర్సింలు తోటా, ఇల్లూ చాలా పాతబడిపోయాయి. పాత రోజులకి తీపిగుర్తులుగా మెడ తిప్పిచూస్తే చిన్నతనంలో తను పెరిగిన ఇల్లు కనిపిస్తుంది. అక్కడ ఆ ఇల్లు లేదు. ఎవరో రిటైర్డ్

జడ్జీగారు కొన్నారు. హాంగింగ్ గార్డెన్స్, రూఫ్ గార్డెన్స్, బోన్సాయ్ పైనంత హరితవనమే.

కింద కార్లూ, మోటర్‌సైకిళ్లూ పార్క్‌చేసి వుంటాయి. వెనుక "సబ్బుల కార్ఖానా'' వుండేది. ఆ స్థలం కూడా కొని కలిపేసుకున్నారు. ఇటు పడమరవైపు మైసయ్యదొడ్డి వుండేది అదీ కొని ఆ స్థలాన్ని విశాలంచేశారు.

పనసపళ్ళ భారానికి చెట్లు వొంగినట్లు కనిపిస్తున్నాయి. ఆ ఇల్లు సిరిసంపదలకి నిలయం ఇప్పుడు.

ఆ ఇంట్లోంచి ఎగిరి ఈ ఇంట్లో పడ్డ శ్రీమహాలక్ష్మి సిరినీ ఆమె కోడల్నీ గట్టిగా పట్టేసుకుంది. ఎమ్.ఎ. ఇంగ్లీష్ చేసింది. మార్కెటింగ్ మెళుకువలు తెలుసుకోవాలంటే ఎమ్.బి.ఏ. చేయలత్తా అంటూ సుధ ఫోన్‌లో వూదరకొట్టేస్తుంది. అదీ చేసింది.

ఫోన్ మోగుతూంటే శ్రీమహాలక్ష్మి పరుగున వెళ్ళి అందుకుంది. "నేనమ్మా''

శ్రీమహాలక్ష్మి ఆ గొంతు వింది. కానీ మెదడు గుర్తుపట్టడం లేదు.

"అమ్మా బావున్నావా?"

"ఆc"

"నేనూ, ఆదిత్యా, ద్వారకా వస్తున్నాం అమ్మా''

నెత్తిమీద మోదినట్లయింది ఆమెకి. "నువ్వా వైష్ణవీ. నిజంగా నిజంగా వస్తున్నావా? కలగనడంలేదుకదా''

"విష్ యూ హాపి న్యూ ఇయర్ అమ్మా''

"సేమ్‌టుయూ, థాంక్యూ, ఎప్పుడు వస్తున్నావు వైష్ణవీ''

"త్వరలో..."

"ఎక్కడ్నుంచీ''

"ఇక్కడినుంచే, పుట్టపర్తినుంచి''

"నిజంగా''

"నిజమే. వచ్చేముందు వయా తిరుపతి, మెద్రాస్. నాన్నగారు బావున్నారా? అన్న, తమ్ముడు, పెట్టేస్తున్నా''

క్లిక్‌మంది.

ఏడేళ్ళ ఎడబాటు తర్వాత యిప్పుడు కూతురుఫోన్ చేస్తే ఆమె గొంతు గుర్తుపట్టలేకపోయింది. గాప్... జీవిత విధానాన్నే మార్చేస్తుంది. యిప్పుడెలా వుండి వుంటుంది?

ఫోన్ మళ్ళీ మోగింది.

శ్రీమహాలక్ష్మి ఆలోచనలకి అంతరాయం కలిగింది.

"హలో'

"మీరా''

"హాపీన్యూయర్'

"సేమ్ టూయూ ఇంటికి ఎప్పుడు వస్తున్నారు?"

"వచ్చేస్తున్నా. న్యూ ఇయర్ గ్రీటింగ్స్ చెప్పనీ''

"త్వరగా వచ్చేయండి''

"యస్ కమింగ్..."

"చాలా పొద్దుపోయింది''

"బయలుదేరుతున్నాను''

"సర్‌ప్రైజింగ్ న్యూస్''

"ఏమిటది?"

"సస్పెన్స్''

"ఓ... కే... ఓ.కే'

క్లిక్‌మంది. శ్రీమహాలక్ష్మి నవ్వుకుంది. అంతవరకూ హాల్లో, కిచెన్‌లో, బాల్కనీలోనే లైట్లువుంచింది. ఇప్పుడు మొత్తం ఇంట్లో లైట్లన్నీ వేసింది.

సాయంత్రం వర్కర్స్ తయారుచేసి హాల్లో వ్రేలాడదీశారు హాపీ న్యూ ఇయర్ మెరుపు కాగితాల్తో. ఇల్లంతా డెకరేట్ చేశారు. పాకెట్లలో మిఠాయిలు, పళ్ళు. పళ్లతో రకరకాల జామ్‌లూ, స్క్వాష్‌లూ తయారౌతుంటాయి. వాటిని ఇంటికి కూడా పంపిస్తాడు పూర్ణచంద్రరావు.

ఫోన్ మ్రోగింది.

"హేపీ న్యూ ఇయర్"

"థాంక్యూ రామూ"

"వచ్చేస్తున్నాం"

"థాంక్యూ హౌఈజ్ అల్కా"

"ఓకే అమ్మా... నాన్నగారు బావు న్నారా... తమ్ముడూ"

"అంతా బాగున్నారు"

"వచ్చేస్తున్నాం"

ఉక్కిరి బిక్కిరి అయిపోతోందీ మనసు. తట్టుకోలేకపోతోందీ బేల మనసు.

మళ్లీ ఫోన్... "హేపీ న్యూయర్ అమ్మా"

అరవింద్ చెబుతున్నాడు "థాంక్యూ... సేమ్ టుయూ" మాటలు తడబడుతు న్నాయి.

ఒకళ్ల తర్వాత ఒకళ్లు.

గడిచిన ఏళ్లని గమ్మత్తుగా నెట్టేస్తోందీ కొత్త సంవత్సరం. ఎంత బావుంది. శాంత మూ లేక సౌఖ్యమూ లేదు... శాంతము... మనం నవ్వితే నవ్వే అద్దంలాంటి మనసుకి శాంతం కూడా తెలుసు.

పూర్ణచంద్రావుతో పంచుకున్న జీవితం మొదట్లో అశాంతినీ అలజడినీ సృష్టించింది. ఓ మంచిగానీ చెడుగానీ దాని పర్యవసానం కావాలనుకుంటే వేచి చూడాల్సిందే. పూర్ణ చంద్రావుని అర్థం చేసుకోవడం చాలా కష్టం. ఆ ప్రయత్నం ఫలిస్తే నల్లేరుమీద నడకలాంటిదే.

కారు హారన్ విని తృళ్లిపడి ఈ లోకంలోకి వచ్చింది శ్రీమహాలక్ష్మి. తలుపు తెరిచి ఓ వైపు నిలుచుంది. అతను మెట్లు ఎక్కివచ్చా డు. ఆ శబ్దం కూడా వినముచ్చటగా వుంది. అతను కావాలనే లిఫ్టు వాడడు.

అతను గదిలోకి అడుగుపెట్టగానే ఉద్వే గంతో ఆనందంతో అతని చేతులు పట్టేసు కుంది. వాటేసుకుంటే అతను కసురుకుంటా డు. చిన్నపిల్లలా ఇంత వయసు వచ్చినా అంటాడు. అప్పుడప్పుడు భర్తకి భయపడు తుంది చిన్నపిల్లలాగే.

"పిల్లలు వస్తున్నారా?" ఆ స్పర్శలో సందేశం తెలుసుకున్న వాడిలా అడిగాడు.

"ఎలా తెలుసు?"

"నీ హార్ట్ బీట్ చేత్తో సందేశాన్ని పంపించింది"

శ్రీమహాలక్ష్మి ధైర్యం చేసింది. అతని ఎడమచేతి వేళ్లమధ్య తన కుడిచేతి వేళ్లను వరుసలో బిగించి ఎడం చేతిని అతని కుడిభుజం మీదవేసి గుండెమీద తలవా ల్చింది.

ఈసారి అతను ఏమీ అనలేదు. కుడిచేత్తో ఆమె తల నిమిరాడు. ఆమె అతన్ని అలాగే నడిపించి సోఫాలో కూర్చోబెట్టింది. తను అతని దగ్గరగా కిందకూర్చుంది. అతని ఒళ్లో తలపెట్టుకుంటే నిశ్చింతగా, హాయిగా వుంటోంది. అతను చుట్టూ పరికించాడు. తనకి స్వాగతం చెబుతోంది శ్రీమహాలక్ష్మి. హేపీ న్యూ ఇయర్ చెబుతోంది.

"వైష్ణవి, పిల్లవాడు, అల్లుడు వస్తున్నా రండీ"

చప్పున తల తిప్పి ఆమె మొహాన్ని అంతే వేగంగా రెండు చేతుల్తో తనవైపు తిప్పుకున్నాడు.

"ఈజ్ ఇట్ ట్రూ"

"నిజం..."

"తపస్సు.. తపస్సే యిది. పిచ్చిదానా ఎంత అల్లాడిపోయావు. నీ శరీరంలో మాంసం ఎక్ దిల్‌కే టుక్‌డే హజార్ బన్‌కే కోయి యహాc గిరా, కోయి వహాc గిరా... (ఓ గుండె వేయిముక్కలై కొన్ని ఇక్కడా కొన్ని అక్కడా పడ్డట్లు) నీకేకాదు శ్రీమహాల క్ష్మి నాక్కూడా.

"ఎవరూ ఈ సిద్ధాంతాన్ని ఒప్పుకోరేమో. నేను నమ్ముతాను. నువ్వు నా భార్యవై నాలో సగం అయినపుడు నీ పిల్లలు నా పిల్లలు



కాకుండా ఎలా వుంటారు? అన్వయించుకుంటే ప్రతి చర్యకీ ఓ రీజన్ వుంటుంది. నీ శరీరం, ఆత్మా నాలో ఐక్యం అయినప్పుడు నీ ఆలోచనలూ, కదలికలు, మంచిచెడ్డలు, ఆశలూ, ఆశయాలూ ఒకటేమిటి నీ భావ ప్రకటనలన్నీ నాకూ తెలుస్తాయి.

"పాతికేళ్లు కాపురం చేసినా పదేళ్లు కాపురం చేసినా భార్యాభర్తల బంధం ఒకటే. అదీ ఇష్టపడి, కోరిచేసుకున్న వాళ్ల విషయంలో''

శ్రీమహాలక్ష్మి కళ్లు వెడల్పయాయి. అతని మాటలు ఆమె కర్ణేంద్రియాలకి విందు భోజనం పెడుతున్నాయి. ఆమె అతనివైపు ఆరాధనగా చూస్తోంది. ఎక్కడివి ఇన్ని మాటలు. మీకు ఇంత తెలుగువచ్చా? మీక్కూడా ఇన్ని స్పందనలు వుంటాయా, నమ్మలేకపోతున్నానండీ''

"న్యూ ఇయర్ అయిపోయింది. స్వీట్ పెడతావనుకున్నాను''

"ఓ" నొచ్చుకుంది శ్రీమహాలక్ష్మి. "సో... సారీ ప్లీజ్' అతనికి ఇష్టం అయిన జీడిపప్పు పాకం పెట్టింది.

"ఇంతింతై వటుడింతై ఈ పద్యం నేను మరిచిపోలేను. భగవంతుడు దయామయుడు. నేను కోరుకున్న జీవితం హాయిగా, దర్జాగా మీ నీడలో గడిపేయాలనుకున్న జీవితం ఇచ్చాడు. నాకీ అదృష్టం చాలు''

అతను నవ్వాడు. "కష్టేఫలీ. నువ్వు కష్టపడ్డావు. కష్టం లేకుండా డబ్బురాదు. టైమ్‌ని రూపాయల్తో కొలుస్తాననే దానివి. కానీ రూపాయల్ని కష్టంతోనే కొలవాలి శ్రీమహాలక్ష్మి''

"నిజమే'' మనస్ఫూర్తిగా అంది శ్రీమహాలక్ష్మి.

అత్తవారింటికి వచ్చాక తను కూర్చునే కిటికీ ఇప్పుడు విశాలమైన బాల్కనీ అయింది. డాబా ఫ్లోర్ అయింది.

సీజన్ వచ్చిందంటే ఆ వూరగాయల పెట్టె ప్రతి హాస్టల్‌కీ వెళ్లేది. అదృష్టవశాత్తు పచ్చళ్లు రుచిగా వుండడంతో వూపిరి సలపనంత ఆర్డర్స్ వచ్చేవి. అరిసెలు, కాజాలు వుష్ మనిపించేవారు.

ఓ స్కూల్లో టీచరు తను కొన్న స్థలాన్ని తెలిసిన వాళ్లకి అమ్మి పెట్టమని బతిమాలింది. మరో స్కూల్లో మరో టీచరు స్థలం కావాలని చెప్పింది.

ఒక్కొక్కప్పుడు కాకతాళీయమే.

పండు పండింది.

పక్షి వాలింది.

పండు రాలింది.

అదృష్టంపండింది.

ఆ స్థలం ఆవిధంగా మార్చడంతో ఇద్దరూ రెండు పర్సంట్ కమిషన్ ఇచ్చారు. ఈ వ్యాపారం కూడా శ్రీమహాలక్ష్మికి చాలా నచ్చింది.

కలసివచ్చే కాలానికి నడిచొచ్చే కొడుకు పుడతాడని సామెత. ప్లాట్లు అమ్మడం మొదలుపెట్టాక వచ్చిన కమిషన్ భర్త చేతిలో పెట్టింది.

అతను రెండూ ఇంటూ రెండూ ఈజ్ ఈక్వల్‌టూ నాలుగు అని వూరుకోడు. నాలుగూ ఇంటూ నాలుగు చేస్తాడు. భార్యచేత చేయించాడు.

స్కూలు మానేయలేదు శ్రీమహాలక్ష్మి.

అది పాలిచ్చే పాడి ఆవులాంటిది.

నెల తిరిగేసరికి ఠంచనుగా జీతం చేతిలోకి వస్తుంది. అరవింద్ చదువుకోసం అనంతపురం వెళ్లిపోయాక అదనంగా పనివాళ్లని పెట్టుకోవల్సి వచ్చింది. వూపిరి సలపని పని. హెూల్‌సేల్‌లో చవకగా వస్తున్నాయని ఓ వంద పాంటుపీస్‌లూ, షర్టుపీస్‌లు తీసుకుంది.

మధ్యతరగతి మందహాసాన్ని కాష్‌చేసుకునే ఈజీ పద్ధతి ఇన్‌స్టాల్‌మెంట్.

"మరీ అన్యాయమేమోనండీ'' అంది భర్తతో.

"వ్యాపారం అన్న తరువాత కాంప్రమైజ్ కావాల్సిందే తప్పదు'' అతను గురూపదేశం ఇచ్చాడు.

చాలు బిజినెస్ మెళుకువలన్నీ చిటికెలో అబ్బాయి శ్రీమహాలక్ష్మికి. గతం కరిగిపోయింది. దీపావళిలా టపాకాయల మోతలు వినిపిస్తున్నాయి.

తెల్లవారింది.

అతను "శ్రీమహాలక్ష్మి'' అన్నాడు ఆర్ద్రంగా.

ఆమె మంచంమీంచి లేవలేకపోయింది. "లే! శ్రీమహాలక్ష్మి పిల్లలు వచ్చే టైమ్ అవుతోంది''

కళ్లు విప్పింది ఆమె.

అతను కాఫీ కలిపి తీసుకువచ్చి ఇచ్చాడు.

అప్పుడప్పుడు ఎప్పుడో ఓసారి తన ప్రేమనంతా ఇలా కనబరుస్తాడు పూర్ణచంద్రావు. మొహం కడుక్కోలేదు. చప్పున లేచి బాత్‌రూమ్‌లోకి పరిగెత్తి రెండు నిమిషాల్లో వచ్చేసింది.

హాల్లో గోడగడియారం గంటలు కొడుతోంది.

అతను పేపరు తిరగేస్తున్నాడు. ఎడతెరపిలేని ఫోన్ కాల్స్. క్షణం తీరిక వుండదు. అతను తాపీగా ఫోన్లో జవాబు చెబుతున్నాడు.

శ్రీమహాలక్ష్మి అతనివైపు పరిశీలనగా చూస్తోంది. అతనో విచిత్రమైన వ్యక్తి. ప్రేమ మూర్తే ఏదో కాంప్లెక్స్. భార్య తను గీసిన గీత దాటి ముందుకు వెళ్లిపోతే అదిమాత్రం అతను తట్టుకోలేడు.

శ్రీమహాలక్ష్మి నవ్వుకుంది. అతను తన కోసం ఎన్నో చేస్తాడు. తను ఆ మాత్రం ఒదిగివుంటే ఏమైపోయింది?

మగవాళ్లంతా రాక్షసులూ కారు ఆడవాళ్లందరూ దేవతలూ కారు.

సంసారం పుచ్చపువ్వులా వుండాలి.

భార్యాభర్తా పాలూ నీళ్లమాదిరి వుండాలి.

ఇద్దరి అభిరుచులూ వేరు వేరైనప్పుడు ఒకరికోసం మరొకరు కొద్దిపాటి త్యాగాలు చేసుకుంటే తప్పులేదు. అంతలో కొంపలు అంటుకుపోవు.

చేతకాని మగవాడు భర్త పదవికి అనర్హుడే.

"ఏమిటి ఆలోచిస్తున్నావు శ్రీమహాలక్ష్మి'' పూర్ణచంద్రరావు ఆమె పక్కకి వచ్చి కూర్చున్నాడు.

"ఏమీలేదు'' అని "మీలో ఎంతమార్పు... ఒకప్పుడు మీ పక్కన కూర్చుంటే విసుక్కునేవారు. భార్య భర్తముందు చప్పున చనువుగా కూర్చోవడాన్ని భరించలేకపోయేవారు''

"నేను పెరిగిన వాతావరణం అది'' అతను గంభీరంగా చెప్పాడు. "మా నాన్నమ్మ తాత పక్కన కూర్చోవడం మేము చూడలేదు. అలాగే మా అమ్మ కూడా. మా నాయన వస్తే నిలబడే వుండాల్సివచ్చేది. మా నాన్నమ్మతోబాటు అమ్మకూడా రాత్రి చాలా పొద్దుపోయేవరకూ ఇంట్లో పనీపాటా చేసుకొనేది''

ఆశ్చర్యం శ్రీమహాలక్ష్మికి.

"మేము తొమ్మిది మందిమి ఎలా పుట్టామో ఆశ్చర్యం వేస్తుంది ఇప్పుడు''

శ్రీమహాలక్ష్మి సంకోచంగా అంది, "భానుమతిగారు ముగ్గుర్ని కన్నారుకదా?''

"యస్'' అతను ఒప్పుకున్నాడు. "సెక్స్ గురించి మాట్లాడడం అసహ్యమే. అదో యాంత్రికమైన అవసరం. అంతే. భానుమతిని ఆమడ దూరం వుంచేవాడిని''

"ఆమె ఎప్పుడూ బాధపడలేదా?''

"బాధదేనికి? ఆమెకులోటు ఏం చేశాను. ముగ్గురు పిల్లల్నిచ్చాను. బోలెడు డబ్బూ, నగా నట్రా, పొలం, మేడ సమస్తం ఇచ్చాను''

"మీరు మంచీ చెడూ మాట్లాడుకుంటారా!



"మనం మాట్లాడుకునేంత మాట్లాడుకో ము. అవసరం అయినంతవరకే'

శ్రీమహాలక్ష్మి చప్పున అతని చేతిని గట్టిగా పట్టుకుంది. "నాకు భయం వే స్తోందండీ. మీరు నాకంటికి చాలా క్రూరంగా కనిపిస్తారు. భార్య అంటే భర్తలో సగ భాగం. అర్ధనారీశ్వరుడు అని పరమేశ్వరు డిని అన్నారు. మీరు ఒక్కోసారి గొప్ప నియంతలా కనిపిస్తారు. కటువుగా వుంటే నాకు గుండె పగిలి చచ్చిపోవాలనిపిస్తుంది''

"ఛ! పిచ్చిదానా... నా స్వభావం అంతే. నిన్ను చేసుకున్నాక మనిషికి అర్థం కొంచెం అయినా తెలుసుకోగల్గాను.

శ్రీమహాలక్ష్మి బల్లిలా అతుక్కుపో యింది. అతనామెను ఈసారి దూరం జరప లేదు.

కాలింగ్ బెల్ మ్రోగింది. ఇద్దరూ తేరుకు న్నారు. పూర్ణచంద్రరావు వాకిలి తలుపుతీశా డు. ఎదురుగా అరవింద్. తరువాత వైష్ణవీ, ఆదిత్యా, ద్వారకా తలుపుతీసిన తండ్రిని అల్లుకుపోయింది వైష్ణవి.

ద్వారక చేయి చాపాడు.

వైష్ణవిని జరిపి ఆదిత్యని హత్తుకున్నాడు.

తలుపు వేయబోతుంటే పరశురామ్ వచ్చాడు. "హాయ్ నాన్నగారూ''

పూర్ణచంద్రరావు నవ్వి "హాయ్... ఏమిటీ పలకరింపు. నోటినిండా బావున్నారా నాన్నగా రూ అంటే ఎంత బాగుంటుంది'' అన్నాడు.

"నిజం నిజం.. తెలుగుదనం పుట్టిపడు తుంది'' విన్న గొంతు. జ్ఞాపకాల పొరల్ని చీల్చుకుంటూ అక్కడికి కొద్దిదూరంలోవున్న శ్రీమహాలక్ష్మి కూడా దిగ్గున లేచి వచ్చి సబితని చుట్టేసింది. ఆ వెనుక చలపతి.

భోపాల్ ట్రాన్స్ఫర్ అయిన తరువాత మనుషులు కలుసుకోలేదు. ఫోన్ మనసుల్ని పట్టివుంచింది.

శ్రీమహాలక్ష్మిని అభినందించాడు చల పతి.

"ఇంత వుండేది ఇంతైపోయింది'' అన్నా డు. చేతుల్ని అడుగునుంచి ఆరు అడుగుల వరకూ చూపిస్తూ.

వైష్ణవి తల్లి చుట్టూ చేయివేసింది. సబితని దగ్గరకి తీసుకుంది. జీవితకాలపు ఎడబాటు తర్వాత సంగమం ఇది. నిమిషాలు, గంటలు సరిపోవడంలేదు.

"సాయంత్రానికి మా అత్తగారూ మావ య్యగారూ వస్తారు నాన్నగారూ''

వంటావిడ టిఫిన్లూ కాఫీలూ సప్లై చే స్తోంది.

"పిల్లల్ని కూడా రమ్మని రాయాల్సింది. చాలాకాలం అయింది వాళ్లని చూసి'' శ్రీమ హాలక్ష్మి అంది.

సబిత నవ్వి "ఎక్కడా... అమెరికా, న్యూ జీలాండ్, అండమాన్ నికోబార్... అంతదూ రంలో వుంటున్నారు'' అంది.

మధ్యాహ్నం భోజనాలు అయాక అంద రూ కూర్చుని పేకాడుతున్నారు. శ్రీమహాల క్ష్మికి గానీ పూర్ణచంద్రరావుకిగానీ ఇష్టంలేదు. సబితా చలపతీ పిల్లలమధ్య పిల్లలైపోయా రు. సబిత మొహంలో వయసు కనిపించ డంలేదు. లేని అందం ఎక్కడినుంచోవ చ్చింది.

ఆత్మతృప్తిని మించిన సౌందర్యం మరె క్కడా వుండదు.

చలపతి కూడా అదే ధోరణి అదే ప్రేమా వాత్సల్యం.

'మేడ్ఫర్ యీచ్ అదర్' అని ఇటువంటి జంటల్ని చూసే అని వుంటారు.

ఆట పూర్తయింది. శ్రీమహాలక్ష్మి పక్కన కూర్చుని సబిత కళ్లు తుడుచుకుంది.

"ఇప్పుడిదేం సీను?" అంది శ్రీమహాల క్ష్మి.

వైష్ణవీ, ద్వారకా, అరవింద్, పరశురామ్ పిల్లవాడితో ఆడుకుంటున్నారు.

చలపతీ, పూర్ణచంద్రరావులు వాళ్లలో కంలో వున్నారు.





"మొత్తానికి పరమపద సోపానపటంలో వైకుంఠాన్ని చేరుకున్నావు. నాకు చాలా సంతోషంగా వుంది. శ్రీమహాలక్ష్మి ఇన్నేళ్లకి ఇప్పుడు నాకు చాలా రిలీఫ్‌గా వుంది''

సన్నగా నవ్వింది శ్రీమహాలక్ష్మి.

"ఓరోజు దినపత్రికలో చూశాను. మన అడ్వర్టయిజ్‌మెంటు మా శ్రీమహాలక్ష్మిదేనా? నమ్మకం కుదరలేదు. చలపతికీ నాకూ సంతోషం చెరువైందనుకో''

"సంతోషం చెరువు కావడం ఏమిటి సబితా''

"ఏమో? సంతోషం పట్టలేకపోతే అలా అంటే బావుంటుంది నాకు''

"పోనీ సముద్రం అనచ్చుగా''

"దుఃఖానికైతే సముద్రం" సబిత ఆమె వైపు అపురూపంగా చూస్తూ "రోజులెలా గడిచిపోయాయి? చిన్నప్పుడు మనం..." అని ఆపేసింది. మరీ అంత గతంలోకి వెళ్లి మనసుని కల్లోలం చేసుకోవాలనిలేదు.

శ్రీమహాలక్ష్మికి హాయిగా వుంది.

చాలా మంది తెప్పలుగా చెరువు నిండిన... అంటారుగానీ అందులో నిజంలేదు. సబిత తన ప్రాణ స్నేహితురాలు. తను కష్టంలో వున్నప్పుడు ట్రాన్స్‌ఫర్ల వల్ల రాలేకపోయింది.

తన పిల్లలు వాళ్లకి అమ్మ కావాలిగానీ అమ్మ డబ్బుతో పనిలేదు. వాళ్లకి డబ్బు కొదవలేదు.

ఆ సాయంత్రం మనోహరీ, యతీ వచ్చారు.

మనోహరి పుష్టిగా వుంది. యతి తెల్లగా దొరలా వున్నాడు. ఎన్నేళ్లకెన్నేళ్లకి?

యతి చేయిచాపి పూర్ణచంద్రరావు చేతిని అందుకున్నాడు.

రాత్రి పై అంతస్థు మీదకి వెళ్లారు. అక్కడ విదేశాలకి పంపించాల్సినవి నీట్‌గా పాక్ చేసి వున్నాయి. అవి మార్కెట్‌లోకి వచ్చినప్పుడే అందరూ కొని రుచి చూశారు. కానీ స్వయంగా శ్రీమహాలక్ష్మి అభివృద్ధిని చూడడం సంతోషం అనిపించింది.

వారం రోజులు చాలా త్వరగా గడిచిపోయాయి. ఎవరి ఇళ్లకి వాళ్లు బయలుదేరారు. శ్రీమహాలక్ష్మి అందరికీ బట్టలు పెట్టింది. ఆదిత్యకి గొలుసు చేయించి ఇచ్చారు.

పూర్ణచంద్రరావు ఈ వారం రోజులూ కోర్టుకీ, ఇంటికీ కేటాయించాడు.

ముందు సబితా భర్తా యతీ భార్యా వెళ్లిపోయారు.

ఆ తరువాత పరశురామ్ బయలుదేరాడు. వెళ్లేముందు తల్లి భుజం చుట్టూ చేతులు వేసి చాలా ఏళ్లకితంలాగే అమ్మా అని పిలిచాడు.

శ్రీమహాలక్ష్మి సోఫాలో వెనక్కి వాలినదల్లా ముందుకు ఒంగి కొడుకు మొహంలోకి చూసింది. వైష్ణవి వదినతో మాట్లాడుతున్నట్లుంది. అక్కడ తల్లీకొడుకులు తప్ప మరెవరూ లేరు.

"అమ్మా మా వూరు ఎప్పుడు వస్తావు'' అని అడిగాడు.

శ్రీమహాలక్ష్మి మొహం మీద కొరడాతో కొట్టినట్లయింది. లేని నవ్వు తెచ్చుకుని "నేను ఒక్కదాన్నీ ఎలా వస్తాననుకున్నావు?" అంది.

పరశురామ్ దిగ్గున లేచి కూర్చున్నాడు. "నిజమే నువ్వు ఒక్కదానివీ రాలేవు. నాన్నగారితో వస్తే ఏం బాగుంటుంది? నీ ఇష్టం అమ్మా'' ఆ తర్వాత అతనే చెప్పుకుపోయాడు. "నీకు చీరలంటే చాలా ఇష్టం అని ఓ చీరకొనాలని బజారుకి వెళ్లామమ్మా! ఆ చీర ధరెంతో తెలుసా'' శ్రీమహాలక్ష్మి బుర్ర తిప్పింది "నాకెలా తెలుస్తుంది?"

"పదకొండు వేలమ్మా. ఎర్రచీర. ఆ చీర కట్టుకుంటే నువ్వు అచ్చం అమ్మవారిలా వుంటావు''

"నిజంగానే'' ఏడుపు మొహం పెట్టడం బాగోదని ఆశ్చర్యంగా చూసింది.



"మా ఇంటికి వచ్చినప్పుడు పెట్టాలనుకున్నామమ్మా''

"థాంక్యూ'' అంది ఆమె. 'జీతేరహో... వర్ధిల్లు నాయనా వర్ధిల్లు. నీకు చాలా తెలివితేటలున్నాయి పరశురామ్. వాటిని నేను చదవగలను. ఎందుకంటే నేను నీకు తల్లినిగనుక

"నన్ను ఒక్కదాన్నీ రమ్మనడానికి నీకు బాధేయలేదా పరశురామ్. ఆయన వుండగా నేను ఒంటరిగా రావడం అశుభంలా అనిపించడంలేదూ. అసలు నన్ను పిలవకపోయినా నేను బాధపడనని గ్రహించకపోయావా? పిలిచి బాధపెట్టడం న్యాయంకాదురా... ఆమెగుండెల్లో ఘర్షణ పెదవి దాటలేదు.

"అమ్మా మరి మేం వెళ్ళివస్తాం" వాళ్ళు వెళ్ళిపోతుంటే శ్రీమహాలక్ష్మి కళ్ళు చెమ్మగిల్లాయి.

మనసులో దాచుకోలేక వైష్ణవితో చెప్పేసింది.

వైష్ణవి తల్లిపక్కనే కూర్చుని నిట్టూర్చింది. "అమ్మా! నీకు తోచినట్లు నువ్వు బతుకుతున్నావు. ఈ జీవితానికి అలవాటుపడేందుకు ఏళ్ళు పట్టింది. యిప్పుడూ యిన్నేళ్లకి మేం రాగల్గాం. మా తరఫునుంచి కూడా ఆలోచించమ్మా''

ఆమె మాట్లాడలేదు.

"ప్రతి ఒక్కరూ నువ్వు చేసిన పనికి విలువ యివ్వాలనుకుంటావు. సపోర్ట్ చేయాలనుకుంటావు. అది కుదరదమ్మా. ఎవరి నిర్ణయాలు వాళ్లవి. నువ్వు సంఘం అక్ఖర్లేదనుకున్నావు. కానీ మాకాసంఘం కావాలమ్మా''

పిచ్చిధానిలా కూతురివైపు చూసి నవ్వింది.

"నిజం నిష్ఠూరంలా వుంటుందమ్మా. నువ్వలా నవ్వితే అర్థంకాదా చెప్పు? ఎంత ఎదిగిపోయిందీ యిది? అనుకుంటున్నావు అవునా'' నిలేసింది వైష్ణవి.

భాషకీ, భావప్రకటనకీ అందని అయోమయస్థితిలో పడిపోయింది శ్రీమహాలక్ష్మి.

"నాచుట్టూ పరివారం. సమాజం కట్టుబాట్లు, నాతోబాటే తీసుకువెళ్ళే సంప్రదాయాలు వీటిని ధిక్కరించలేం అమ్మా. ఇది మన భారతదేశం. అప్పుడెప్పుడో జరిగిన ద్రౌపదీ, తారల కథలు వినేందుకే గానీ అవి ఆదర్శాలు కావు''

"స్టాప్'' శ్రీమహాలక్ష్మి వెర్రికేకపెట్టాననుకుంది. కానీ అలా చేయలేదామె. ఆమె మౌనం వైష్ణవిని నోరు మెదపనీయలేదు.

వైష్ణవి భర్తతో వెళ్ళిపోయింది. ఒక్కొక్కళ్ళు వెడుతుంటే మనసుకి ప్రశాంతత దొరికినట్లయింది శ్రీమహాలక్ష్మికి.

పూర్ణచంద్రావు యింటికి వెళ్ళాడు. అరవింద మరో రెండు రోజులు వుండాల్సివచ్చింది.

తల్లి మౌనం ఎక్కువగా చిన్నవాడినే బాధించింది. అరవింద్ విచిత్రమయిన వ్యక్తి.

"అమ్మా నువ్వు మాట్లాడక పోతే నాకు నచ్చదు''

"ఏం మాట్లాడాలి'' అంది. "ఏదైనా సరే మాట్లాడమ్మా. నిశ్శబ్దాన్ని నువ్వు భరించలేనట్లే నేనూ భరించలేను''

శ్రీమహాలక్ష్మి అతన్ని కూర్చోబెట్టుకుని చందమామ కథ మొదలుపెట్టింది.

★ ★ ★

పరశురామ్ తల్లితో తన అభిప్రాయాన్ని చెప్పడం అయితే చెప్పాడు కానీ ఆ తర్వాత అతనికి. రాత్రిళ్ళు నిద్రపట్టలేదు. పగలు భోజనం సహించలేదు.

అతను రోజురోజుకీ అనారోగ్యాన్ని కొని తెచ్చుకుంటున్నాడు. అల్కా అతన్ని నిలదీసింది. "అసలేం జరిగింది? ఎందుకిలా మౌనంగా వుంటున్నారు. సరిగ్గా నిద్రపోవడం లేదు. తిండికూడా తినడంలేదు''

ఆమె మహారాష్ట్రీయుల పిల్ల. గురువుగారే యీ పెళ్ళి కుదిర్చిచేశారు. ఆమె కూడా





ఆశ్రమం విద్యార్థినే.

"నీకు అర్థంకాదు అల్కా'' అతని గొంతు గాద్గదికం అయింది.

"దేనికి అర్థంకాదు చెప్పండి?"

"అమ్మని యిక్కడికి రమ్మని పిలిచాను''

"అయితే?"

"ఆమె ఈ నాన్నగారితో తప్ప రాదు. ఆమెని ఒక్కదాన్నే రమ్మని చెప్పాను''

ఆమె సీరియస్‌గా అయిపోయింది.

"ఆవిడ మిమ్మల్ని తీసుకువెళ్ళమని అడగలేదే. ఆమెను దేనికి బాధపెట్టారు? గుండె ధైర్యం వుంటే యిద్దర్నీ రమ్మని చెప్పాల్సింది''

"ఎలా... ఎలా మరిచిపోగలను? మా డాడీ మమ్మల్ని ఎత్తుకునేవారు. తమ్ముడికి డయేరియా అయినప్పుడు ఆయనే అమ్మకి సహాయం చేశారు. ఈ ఆకారాన్నిచ్చి, ఈ సర్‌నేమ్ యిచ్చి...ఓ గాడ్..." పరశురామ్ రెండుచేతులూ తలపైన పెట్టుకున్నాడు. "భరించలేని దుఃఖం వస్తోంది. అల్కా! ఎవరి కోణంలోంచి చూస్తే వాళ్ళే కరెక్ట్ అనిపిస్తుంది. అన్నిటికీ కాంప్రమైజ్ అవుతుంటే సడన్‌గా డాడీ గుర్తువస్తారు. ఆయనని ఆయన ఖర్మానికి వదిలేశాం

ఆయన ఎక్కడికి వెడతారు? ఎవరున్నారని వెడతారు? ఒకవేళ ఎక్కడికైనా వెళ్ళినా ఆయనేదో తప్పుచేసినట్లు చూస్తే తట్టుకోలేక కదా యిలా అజ్ఞాతంలోకి వెళ్ళిపోయారు''

ఏడుస్తున్నాడు పరశురామ్. చిన్నపిల్లాడిలా వెక్కివెక్కి ఏడుస్తున్నాడు. దయనీయమైన పరిస్థితి అతన్ని కౌగలించుకుంది. ఓ స్త్రీ ఎదుట ఏడవడం అంత దురదృష్టం మరొకటి వుండదు. అల్కా అతన్ని దగ్గరకి తీసుకుంది. "మీకు నచ్చినట్లు చేయండి. ఆ నిర్ణయానికి కట్టుబడి వుండండి. మీకు మీరే జడ్జిగా తీర్పు చెప్పుకోండి. యిప్పుడు నేను మీకేదైనా సలహా యిస్తే దానికి వ్యతిరేకంగా యింకెవరైనా మరో సలహా యిస్తారు. ఇది కాదు పరిష్కారం. మీ అంతరాత్మ మిమ్మల్ని శాసించినట్లు చేయండి''

అతను దుఃఖాన్ని దిగమింగాడు. సర్దుకుని లేచి హాస్పిటల్‌కి వెళ్ళేందుకు బయలుదేరాడు. వెడుతున్నవాడు ఆగి భార్యతో మళ్ళీ చెప్పాడు. "మా అమ్మ... అంటే ఆమె గురించి చెప్పనవసరంలేదు. నామాట మీద ఆమె అన్ని వ్యాపకాలు పెట్టుకుంది. సాంఘిక 'వెలి'నుంచి బయటపడే ప్రయత్నంలో యంత్రం అయిపోయింది.

"ఒకప్పుడు డబ్బు ఆమెకి కఠోర పరీక్ష పెట్టింది. ఇప్పుడావిడ చేతిలో డబ్బు నాట్యం చేస్తోంది. తనదైన వ్యక్తిత్వం అమ్మది. మా అమ్మ ధీశాలి. నో డౌట్ కానీ..."

"మళ్ళీ కానీ ఎందుకు చెప్పండి?"

"ఒకప్పుడు ఆమె చేరువలోవుండి హాస్పిటల్ పెట్టాలనుకున్నాను. యిప్పుడామెకి నా అవసరం లేదు''

అల్కా అతని చేతిని అందుకుని సోఫాలో కూర్చోబెట్టింది. "మీ ఆరోగ్యం, మూడ్ ఏవీ బాగోలేవు. మీరు మీ అసిస్టెంట్స్‌కి డైరెక్షన్స్ యివ్వండి''

అతను మరో చేతిలో ఉన్న బ్రీఫ్‌కేస్, తన పరికరాల కిట్ టేబిల్‌మీద పెట్టాడు. సోఫాలో ఆమె పక్కన చేరగిలబడ్డాడు.

"మా డాడీ గురించి తెలుసుకోవడం పెద్ద సమస్యకాదు. మనసుంటే మార్గం వుండక పోదు. నాకు మా డాడ్‌ని చూడాలని వుంది అల్కా. మీ స్త్రీ జనోద్ధరణ సంఘాలు ఏకమై గళమెత్తి తమకి జరిగే అన్యాయాల్ని టూర్పారపడతారు. మరి మా డాడ్ గురించి ఆలోచించద్దా''

అల్కా అతనివైపు విచిత్రంగా చూసింది. ఆమెకిటువంటివి తెలియవు. కొన్నిసందర్భాల్లో యివి కట్టుకథలనీ, యింపాజిబుల్ అనీ, కేవలం సినిమాల్లోనూ, కథల్లోనూ కనిపిస్తాయనీ అనుకుంది. అత్తగారు మళ్ళీ పెళ్ళి చేసుకుంది. అని గురువుగారు చెప్పినప్పుడు చరిత్ర చదువుకున్న పిల్ల కనుక పునర్వివాహ

లగురించి కొంత అవగాహన చేసుకోగల్గింది. సర్ విలియం బెంటిక్, రాజా రామ్మోహ నరాయ్, శ్రీ వీరేశలింగం పంతులుగారు వీరిపోరాటం తెలుసు కనుక 'పోనీ' అను కుంది చాలా యీజీగా...

అత్తగారు డైవోర్స్ తీసుకోలేదన్నప్పుడు వెంటనే జీర్ణం చేసుకోలేకపోయింది. తరువా త్తరువాత మళ్ళీ పోనీ అనుకుంది. అనుకో కుండా పరశురామ్ చెబుతూంటే ఆ మామగా రు అనే వ్యక్తిపట్ల ఎక్కడో జాలి కలుగు తోంది. అసలు అల్కా గుండె మరీ బేల. త్వరగా నీరైపోతుంది అని ఫ్రెండ్స్ వుడికించే వాళ్లు. ఆమె దిగులుగా చూస్తూ "నిజమే పాపం! ఆయనకి ఎవరూ లేకపోతే పెద్దత నంలో ఎంతకష్టం? మీరు ఆయన ఆచూకీ తెలుసుకోండి. పిల్లలుగా మీరు చేయాల్సిన కర్తవ్యం అది'' అంది.

"అయితే నేను రెండురోజుల్లో ఒరిస్సా వెడుతున్నాను'' అన్నాడు పరశురామ్. అల్కా బుర్ర వూపింది. ఆపైన అతనికి హాయిగా నిద్రపట్టింది.

★ ★ ★

మనిషికి తృప్తి ఓ వరం. చాలామంది ఈ విషయంలో రాజీపడరు. కానీ మనోహరీ, యతీ మాత్రం తమమార్గంలో తమ కృషికి తగిన ఫలితంరాగానే యిక సంపాదన చాల నే నిర్ణయానికి వచ్చారు.

కోడలైనా కూతురైనా వైష్ణవే వాళ్లకి సమ స్తం. ద్వారకతో, మనవడితో జీవితంలో 'సుఖం' అనే సింహాసనంమీద వున్నారు. అంతవరకూ తెరిచిన స్కూళ్ళూ, కాలేజ్‌లూ అమ్మేశారు. పాతది వదిలేసి కొత్త యిల్లు కొనుక్కున్నారు.

పైన కొడుకూ, కోడలూ వుంటారు.,

కింద అత్తామామలు వుంటారు.

"కలిసే వుందాం అత్తయ్యగారూ'' అంది వైష్ణవి అత్తగారు సామాను వేరు చేస్తుంటే.

మనోహరి ఆ పిల్ల బుగ్గమీద చిన్నగా దెబ్బవేసింది. "ఎక్కడికో వూళ్ళు వదిలి వెళ్ళిపోవడం లేదు వైష్ణవీ. ఒకే యింట్లో వెరైటీగా మీరు పైనా, మేం కిందా వుంటాం. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని గౌరవించాలమ్మా. మీరింకా చిన్నపిల్లలు. సినిమాలకీ, షికార్లకీ వెళ్ళానుంటుంది. మీ ఫ్రెండ్సి మీకోసం వస్తారు. ప్రైవసీ వుండదు. యిబ్బందిగా 'ఫీల్' అవుతూ బతకడం ఏం బాగుంటుంది చెప్పు"

"మనమధ్య రహస్యాలు ఏముంటాయి అత్తయ్యగారూ. ముఖ్యంగా మీవల్ల మాకు సమస్య వుంటేకదా?"

యతి అక్కడికి వచ్చి "ఏవిటబ్బా! అత్తా కోడళ్ళు మరో ప్రపంచంలో నిమగ్నం అయి పోయారు. కాఫీ, టీ ఏవీలేవా?" అని అడిగా డు.

రెండు నిముషాల్లో వైష్ణవి 'టీ' తెచ్చి యిచ్చింది. "ఇదేం బాగోలేదు మావయ్యగా రూ! మనం అందరం కలిసి వుండాలి గానీ..."

"ఓహ్ అది నేనే చెప్పాను వైష్ణవీ. ప్రేమా నుబంధాలు మనిషికీ మనిషికీ వారధు ల్లాంటివి. వాటిని భద్రంగా కాపాడుకోవా లంటే ఎవరికి వాళ్ళే స్వతంత్రంగా వుంటే బాగుంటుంది'' అన్నాడు.

వైష్ణవి పుట్టింటిని పూర్తిగా మరిచిపో యింది. వారిని అంతగా మరిపించిన అత్త మామలు వున్నారు మరి!

ద్వారక ఆఫీస్ నుంచి రాగానే చాలాసేపు కిందే వుంటాడు. ఆ టైమ్‌కి పిల్లవాడితో వైష్ణవి అక్కడ వుంటుంది. చాలాసేపు మా ట్లాడుకుని తిరిగి పైకి వెడతారు.

ద్వారక పైకి రాగానే భార్యవెనుకే వంటింట్లోకి వెళ్ళాడు. కింద ఆదిత్య తాత గారి దగ్గర హోంవర్క్ చేస్తున్నాడు. ద్వా రక ఎప్పుడూ లేనిది ఆమె చుట్టూ తిరుగు తుంటే "ఏవిటి విశేషం?" అని అడిగింది.

అప్పుడు అతను జేబులోంచి వుత్తరం తీసి యిచ్చాడు.





ఆమె డైనింగ్ టేబుల్‌దగ్గరికి నడిచి వుత్తరం యిటూ అటూ తిప్పి చూసింది. అది ద్వారక పేరుమీద పరశురామ్ రాసిన వుత్తరం.

ఆశ్చర్యంగా చూస్తూ "అవసరం అయితే ఫోన్ చేస్తాడే. ఏమైనా విశేషమా?" అంది కాగితాలు తీస్తూ.

తినబోతూ రుచెందుకు అనబోయి ఆగిపోయాడు. అనవసరంగా మాట్లాడాలన్నా విసుగు ద్వారకకి. అయితే సమయం వస్తే అనర్గళంగా కూడా మాట్లాడతాడు.

ఉత్తరం చదివింది. రెండు చేతుల్తో మొహాన్ని దాచుకుని నిశ్శబ్దంగా ఏడుస్తూండిపోయింది. ద్వారకకి కాళ్ళూ చేతులూ ఆడలేదు. పైనుంచే కిందికి కేకపెట్టాడు "అమ్మా నాన్నగారిని తీసుకుని వెంటనే పైకి రా'' అని.

పిలుపు వినడం ఆలశ్యం ఆదిత్యని తీసుకుని మనోహరీ, భర్తా పరుగులాంటి నడకతో వచ్చారు.

వైష్ణవి ఇంకా ఏడుస్తూనే వుంది.

మనోహరీ, యతీ ఆమెకి చెరోవైపూ చేరారు. యతి ఆమె తలమీద చేయివేసి "ప్లీజ్ కంట్రోల్ యువర్ సెల్ఫ్'' అంటూంటే రెండుచేతుల్తో చుట్టేసి తన గుండెల్లోకి తీసుకుంది మనోహరి. ఆమె దుఃఖం చల్లారలేదు. మనోహరీ, యతీ నిశ్శబ్దం అయిపోయారు. తుపానైనా భీభత్సం తర్వాత నెమ్మదిగా సర్దుకుంటుంది. మనోహరి గుండెల్లో వెచ్చని తల్లిప్రేమ. అల్లకల్లోలం అయిపోయిన వైష్ణవిని ఓదార్చింది. ఆమె గాఢంగా పెనవేసుకోగానే భద్రతాభావంతో వైష్ణవి ఆమెని గట్టిగా వాటేసుకుంది. క్రమంగా ప్రకంపనలు చల్లబడ్డాయి. మనోహరికి కారణం తెలీదు. అయినా చిన్నపిల్ల... ఆ యింట్లోంచి వూహించనంత గాయాన్ని మోసుకుని ఇక్కడికి వచ్చింది. గాయం మానిపోయినా మచ్చ అప్పుడప్పుడు గతాన్ని గుర్తుచేస్తుంది.

ఆ వుత్తరం అత్తగారికి యిచ్చింది.

"తప్పేమ్మా! మీకు రాసిన వుత్తరం" అంది మనోహరి.

"అదేం లేదు చదవండత్తయ్యగారూ'' అంది.

యతీ, మనోహరీ ఆ కాగితాల్ని తీసుకున్నారు.

★ ★ ★

"ఎవరూ'' కళ్ళద్దాలు సరిచేసుకుంటూ బయటికి వచ్చాడు పాణిగ్రాహి.

కారుదిగిన కొడుకుని వెంటనే పోల్చుకోలేకపోయాడు. పోల్చుకున్నాక దూరాన్ని తగ్గించేశాడు. రెండుచేతులూ చాపి "మై సన్... హౌ డూ యూ డూ? ఎలా వున్నావు? ఎలా రాగల్గావు?" అంటూ కౌగలించుకున్నాడు.

"మీరెలా వున్నారు డాడ్' పరశురామ్ తండ్రి భుజం మీదుగా ఆ యింటిని చూస్తున్నాడు.

ఖరీదైన డాబా యిల్లే. చుట్టూచెట్లు, పూల మొక్కలు యింటిని కప్పేస్తూ 'మొటాంగో ఫ్రూట్ తాలూకు తీగలు, మరో వైపు బోగన్‌విల్లా. అవీ చాలా రంగుల్లో వున్నాయి.

ఆయన్ని చూశాడు. అప్పటికీ యిప్పటికీ మార్పులేదు. అలాగే... అదేస్వరం... గలగలా మాట్లాడేస్తూ జుట్టు సగం నెరిసింది తెలుపూ నలుపూ కలిపిన నేతలా...

కొడుకు చేతిని గట్టిగా పట్టుకుని లోపలికి తీసుకువెళ్ళాడు. ఓ పక్క బజాజ్ వుంది. పోర్టికోని ఆనుకుని పెద్దహాలు. రెండు బెడ్ రూంలున్నాయి. వంట యింట్లో గాస్ స్టౌ గట్టుమీద వుంది.

ఓవైపు టి.వి. సెట్ పెద్దది వుంది. కొంచెం దూరంలో టూ ఇన్ వన్ వుంది.

డైనింగ్‌టేబుల్, సోఫాసెట్ పరశురామ్ కళ్ళు క్షణాలమీదా, సెకెండ్లమీదా గదుల్నీ, గదిలో వున్న ఫర్నిచర్ వగైరాల్నీ కొలుస్తున్నాయి. మెదడు అంచనావేస్తోంది. మంచి పొజిషన్‌లో వున్నారాయన.

పరశురామ్ దీర్ఘంగా శ్వాస పీల్చుకున్నాడు.

క్షణాలమీద ఫిల్టర్ కాఫీ తయారుచేసి రెండు కప్పుల్లో తీసుకువచ్చి డైనింగ్ టేబుల్ మీదపెట్టాడు. "కూర్చో" అని ఫ్రిజ్ తెరిచి మంచినీళ్ళు యిచ్చాడు.

డైనింగ్‌రూం కప్‌బోర్డ్‌లో పీటర్ స్కాచ్, రమ్ కనిపిస్తున్నాయి.

వార్డ్‌రోబ్‌లో ఫాంట్లూ, షర్టూ వున్నాయి. అవి ఖరీదైనవే.

పరశురామ్ మంచినీళ్ళు తాగి కాఫీ తీసుకున్నాడు.

తండ్రిచేతిని తన చేతిలోకి తీసుకుని గట్టిగా నొక్కి "ఐ లవ్‌యూ డాడ్. వి లవ్ యూ సోమచ్..." అంటూంటే కళ్ళు ముందు మసకబారాయి. తర్వాత తడిశాయి. ఆ తరువాత చెంపలమీద రాలాయి. పరశురామ్ కళ్ళు తుడుచుకోలేదు.

ఇది కలకాదు కదా.... ఈ కల చెరిగిపోనీయకు దేవుడా... యీజిట్ ట్రూ... నమ్మశక్యం కావడంలేదు.

పాణిగ్రాహి కూడా అదేస్థితిలో వున్నాడు.

"మీ అమ్మ కోరుకున్న జీవితాన్నివ్వడం నాకు చేతకాలేదురా రామా! ఆమెను నేను ప్రేమించాను. స్టిల్ ఐ లవ్ హెర్... పోనీ... వైష్ణవి మై డాల్... ఎలా వుంది అది. అరవింద్ ఏం చేస్తున్నాడు? ఆర్ యూ మారీడ్..."

"విత్ ఎ డాటర్..." నవ్వేందుకు ప్రయత్నం చేశాడు. నవ్వలేకపోయాడు.

"గాడ్ బ్లెస్ యూ మై సన్"

పరశురామ్ గ్రహించాడు. ఆయన ఇంగ్లీషు అనర్గళంగా మాట్లాడుతున్నాడు. గదిలో పెద్ద అల్మైరానిండా తెలుగు, ఇంగ్లీషు నవలలు...

"మీరెలా వున్నారు డాడ్?"

"ఇదిగో యిలా..." తనదైన నవ్వు.

"డాడ్ స్నానం చేసి వస్తానండీ చిరాకుగా వుంది"

"ష్యూర్" అతను కొడుకుని బాత్‌రూం వైపు తీసుకువెళ్ళాడు.

బాత్‌రూంలో గీజర్, షవర్, షాంపూలు అన్నీ... అన్నీ వున్నాయి. టర్కీ టవల్... పరశురామ్‌కి మనసంతా మొద్దుబారిపోయి నట్లయింది.

స్నానంచేసి బట్టలు మార్చుకుని వచ్చి తండ్రి ఎదురుగా కూర్చున్నాడు.

"నువ్వు పుస్తకాలు చూస్తూండు. నేను భోజనం రెడీ చేస్తాను" అతను వంటింట్లోకి వెళ్ళగానే పరశురామ్ పెదవులు సన్నగా విచ్చుకున్నాయి. "ఈ కారణంగానే అమ్మ మిమ్మల్ని హేట్ చేసేది. వంటిల్లంటే అంత యిష్టం ఏవిటి మీకు?" అనుకున్నాడు. తండ్రి పుస్తకాల అల్మైరా తీశాడు.

వరుసక్రమంలో వున్నాయవి. ముందు తెలుగు, తర్వాత ఇంగ్లీషు, చివర హిందీ.

కేసెట్లు కూడా వున్నాయి. ఈయనలో ఎంత లోతుగా దాక్కున్నాడు కళాప్రియుడు.

మంచో, చెడో... గజిబిజి బుర్ర పనిచేయదు. ఎలా గడుపుతున్నాడు.

కారం, వుప్పు, రమ్, విస్కీ, గోల్డ్‌ఫ్లేక్... ఎవ్విరిథింగ్ యీజ్‌నార్మల్... మామూలుగా, అతి సాధారణంగా అతీతంగా వూహూ... ఇంపాజిబుల్ అతనికళ్ళు డేగకళ్ళు అయాయి. కుతూహలంగా ఆ కళ్ళు పగిలిన గాజులకోసం, నలిగిన పూలకోసం వెతుకుతున్నాయి.

తప్పు పరశురామ్ తప్పు. కుసంస్కారం యిది.

ఒకరి వ్యక్తిగత జీవితంలోకి మరొకరు వెతికి చూసేహక్కు ఎవరికీ లేదు. "నో" అతను అంతరాత్మని జోకొట్టాడు.

తండ్రి కొడుకు ప్రవర్తనకి కాపలా.

ఇదీ అంతే... తండ్రికి కొడుకు కాపలా.

ఎందుకు కాపలా?

అదంతే.





వంటింట్లోంచి ఘుమఘుమలు నసాళాని కి అంటుతున్నాయి.

"అరేయ్ రామా! భోజనం రెడీ''

లుంగీ పైకి కట్టేసి రెండు చేతుల్తో తిండి పదార్థాలు తీసుకువచ్చి డైనింగ్ టేబిల్ మీద పెట్టాడు. "అరేయ్ పరశురామా! ఇక్కడికి వచ్చి కూర్చోరా''

నైట్ డ్రెస్‌లో వున్నాడు పరశురామ్. తండ్రికీ తనకీ మధ్య ఏళ్ళు గడిచాయి. అయినా ఆదూరం తెలీడంలేదు. ఇబ్బంది ఫీలింగ్ లేదు. మళ్ళీ రక్తం... జీన్స్ యివన్నీ గుర్తువస్తున్నాయి. అనాటమీ. సైకాలజీ... మిక్స్‌డ్ ఫాక్టర్...మెదడు మధ్యలో. నవ్వు వచ్చింది. మనసు ఓ చిన్న విషయాన్ని అనవసరంగా విశ్లేషిస్తోంది.

సాంబారు, ముద్దపప్పు, నెయ్యి, కారపు వంకాయకూర, టమాట పచ్చడి, అప్పడాలు, మజ్జిగ మిరపకాయలు, పెరుగు, వూరగాయలు... కళ్ళోసారి పరికించాయి.

"ఇవన్నీ నీకు యిష్టం అని చేశాను''

తమ యిష్టాయిష్టాల్ని మరిచిపోలేదు.

"నాకు దోసకాయ యిష్టంలేదని శ్రీమహాలక్ష్మి వండేదికాదు. తనూ మానేసింది. తనకి పొట్లకాయంటే భయం. ఆ భయంతో వండేదికాదు. అలా నేనూ మానేశాను. గోకరకాయలో ఏ పోషకపదార్థాలూ వుండవని తినేవాళ్ళం కాదు''

పరశురామ్ రెప్పార్చకుండా చూస్తున్నాడు.

మరిచిపోయేందుకు యిదేమైనా కలా. కలనైనా మరిచిపోలేం కదా.

భోజనాలయాయి. పాణిగ్రాహి డాబామీద చాప పరచాడు. రెండు తలగడలు వేశాడు. సావధానంగా సిగరెట్ వెలిగిస్తూ "విత్ యువర్ పర్మిషన్'' అన్నాడు.

పరశురామ్ నవ్వి వూరుకున్నాడు. పాణిగ్రాహి సినిమాల గురించీ, చిన్నతనంలో పరశురామ్ నవలలు చదవడం యివన్నీ చెబుతున్నాడు. ఇంకేం జ్ఞాపకం లేవా? అమ్మెలా వుంది? అని అడగడం లేదే ఈయన.

"డాడ్'' తీరికగా అప్పుడు గొంతు విప్పాడు. పాణిగ్రాహి తలతిప్పి కొడుకువైపు చూశాడు. పరశురామ్ వెల్లకిలా పడుకున్నాడు. గంభీరంగా వున్నాడు. పాణిగ్రాహి చేతిలో సిగరెట్ దూరంగా పడేసి "చెప్పు" అన్నాడు.

"మిమ్మల్ని నాతో తీసుకు వెళ్ళాలని వచ్చాను. ఎప్పటికీ మరెప్పటికీ నాతో వుండాలి మీరు. మీ కోడలు మరీమరీ చెప్పమంది. మీ ఇష్టాయిష్టాలకి అడ్డువుండదు. మిమ్మల్ని శాసించే వాళ్ళుండరు. మీ పెద్దతనంలో మీకు ఆసరాగా వుండేదుకు మిమ్మల్ని తీసుకువెళ్ళాలి... మా పిల్లలకి మీరు 'కాపలా' కోసం ఎంత మాత్రం కాదు. మా బజారు పనులు మీచేత చేయించుకుందుకు అసలేకాదు. మిమ్మల్ని మా కొడుకులా చూసుకుంటాం"

పాణిగ్రాహి నిశ్శబ్దం అయిపోయాడు.

ప్రపంచం స్థంభించినట్లు.

గాలి హెూరు, వాహనాలచప్పుడూ ఏవీ వినిపించడం లేదు. పరుశురామ్ లేచి కూర్చున్నాడు. తండ్రి రెండు చేతులూ పట్టుకున్నాడు. ఆ రెండు చేతుల్నీ మొహందగ్గరకి తీసుకువెళ్ళి "ప్లీజ్... ప్లీజ్..." అతని కంఠం రుద్ధమైంది. మాటలు రావడం లేదు.

"చాలా అలసిపోయావు. ముందు ప్రశాంతంగా నిద్రపో. రేపు పొద్దున్నే మాట్లాడుకుందాం" అన్నాడు.

ఇద్దరూ చాపమీద పడుకున్నాక చల్లగాలి జోగొట్టింది.

  

మర్నాటి సాయంత్రం 'తండ్రి ఎప్పుడెప్పుడు బయలుదేరుతాడా' అని ఎదురుచూస్తూ పగలు గడిపేశాడు. పాణిగ్రాహికి ఆ ఉదయం ఫోన్ వచ్చింది. అతను ఆదరాబాదరాగా వెళ్ళిపోయాడు. ఆ కారణంగా మర్నా

డు పొద్దున మాట్లాడుకుందుకు వీలులేకపోయింది.

పాణిగ్రాహి బండిమీద రావడం దూరంనుంచే వినిపించింది. పరశురామ్‌కి అసహనంగా వుంది. తండ్రి కావాలి తమకి.

అతను వస్తూనే 'హాయ్', అన్నాడు. పొద్దుటి అలజడి లేదు ఇప్పుడు. రిలాక్స్ ఫీలింగ్స్. వస్తూనే స్నానం చేసి 'టీ' కప్పుల్తో కొడుకు దగ్గరకి వచ్చి "పద ఆరుబయట గార్డెన్‌లో కూర్చుందాం" అన్నాడు.

అతని వెనుకే తన 'టీ' కప్పుతో పరశురామ్ కూడా వెళ్ళాడు. బయట చెయిర్‌లో కూర్చున్నాక పాణిగ్రాహి చెప్పడం మొదలు పెట్టాడు. "నా పెళ్ళాం మరొకడిని పెళ్ళి చేసుకుంది''

షాక్ తగిలినట్లయింది పరశురామ్‌కు. ఆ మాట వినడంలో రకరకాల బేధాలు. ఈ వాక్యం అతన్ని కుదిపింది.

"చాలు... నేను ఆ పరిస్థితినుంచి వచ్చేశాను. మంచి పని చేశాను. నామీద నాకు అసహ్యం. పిల్లలకి తల్లి దగ్గరే చేరువ. అది లోక సహజం. నన్ను పిల్లలు కూడా నిర్లక్ష్యం చేస్తున్నారన్న రంపపుకోత. తల్లిలేదు తండ్రి ముందేలేడు. తోడబుట్టిన వాళ్ళులేరు. నాదైన ఇంట్లో నేనే అపరిచితుడిని. నరకం వేరేలేదు.

"చిన్నపిల్లవాడి పూరీ గద్దతన్నుకుపోయినప్పుడు వాడు చూసే చూపులు నావి. పూరీ పోయింది. గద్ద అందదు కొడదామంటే, ఓసారి చచ్చిపోవాలనుకున్నాను. మరీ పిరికితనం... బాగుండదేమో అనిపించింది. అదృష్టమో, కాకతాళీయమో ఇక్కడికి ట్రాన్స్‌ఫర్ అయింది. వచ్చేశాను అనుభవం జీవితాన్ని నిలబెడుతుంది. మార్కెటింగ్ చేయడం ప్రారంభించాను ఏ కంపెనీ ప్రొడక్ట్ ఎలా సేల్ చేయాలో తెలిసిపోయాక బతకడం సులభం అయిపోయింది''





పరశురామ్ వింటున్నాడు "కాళ్ళూ చేతులూ విరగ్గొట్టి నీళ్ళల్లో పడేస్తే ఈతరానివాడు కూడా ఈదే ప్రయత్నం చేస్తాడు. నా విషయంలో అదే జరిగింది. నేను దర్జాగా బతకాలి. ఆ దర్జాకోసం కష్టపడ్డాను. ఇప్పుడు 'సమస్తం' వున్నాయి''

"మీరు ఇవన్నీ మీ దగ్గరే వుంచుకోండి. కానీ నాతో రండి. మీకోసం మేము ముగ్గురం వున్నాం"

నవ్వాడు పాణిగ్రాహి. సరదాగా తేలికగా! "ఒద్దురా రామూ? నాకు చాలాహాయిగా వుంది. నేను ఏకపత్నీవ్రతుడిని మాత్రంకాదు. ఐ లవ్ ద లైఫ్... ఐ ఎన్‌జాయ్ ద లైఫ్. నాకీ జీవితం యిష్టం... అనుభవించేందుకే పుట్టాను''

పరశురామ్‌కి మనసు దెబ్బతిన్నట్లయింది. "అంతదూరం నుంచి గంపెడు ఆశతో మీరెక్కడున్నారో తెలుసుకుని రావడంలో నా ప్రేమలో నిజాయితీ కనిపించడంలేదా డాడ్''

"ఒద్దు'' భోరుమన్నాడు పాణిగ్రాహి. "నేన్నమ్మను. శ్రీమహాలక్ష్మి అంటే నాకు ప్రాణంరా... ఆమె విసిగిపోయివుండచ్చు. కానీ నా ప్రేమే నన్ను దగాచేసింది. మళ్ళీ మళ్ళీ ప్రేమించడం దగాపడ్డం నాకు రాదు. హాయిగా వున్నా్రనా నేనిక్కడ. ఆ రొంపిలోకి మళ్ళీ రాను. హాయిగా వున్నాను'' ఏడుస్తున్నాడు. పరశురామ్ తండ్రిని కౌగలించుకున్నాడు. అతనికీ దుఃఖంగానే వుంది. అయినా తమాయించుకునే ప్రయత్నంచేస్తున్నాడు.

"రండి డాడ్ మాకు మీరు కావాలి''

"ప్లీజ్ అడగద్దు. ఎప్పుడైనా గుర్తుచేసుకోండి. అదీ మీ యిష్టమే. నేను ఏకాకిని అనాథని అయినా నాదైన సామ్రాజ్యంలో సామ్రాట్టుని... పరశురామ్ నువ్వు అతిథివి. ఈ రెండు పూటలూ... అంతే నువ్వు అటు వెళ్ళిపోగానే నేను నా జీవితంలోకి యధావిధిగా పైసా ఫేఖో తమాషాదేఖో''

పరశురామ్ చేయి ముందుకు చాపి "పోనీ మీకు విసుగు వచ్చినప్పుడు మన

ఇంటికి అంటే నేను వుండే ఇంటికి వస్తానని ప్రమాణం చేయండి డాడ్' అన్నాడు.

ముక్కూ, కళ్ళూ వర్షధారలౌతుంటే లుంగీతో తుడిచేసుకుంటూ భళ్ళున నవ్వాడు. "దేవదాసుని పార్వతి ఇలాగే అడుగుతుంది''

"ప్లీజ్ డాడ్. మన కథ యిది. అలా ముడిపెట్టకండి''

పాణిగ్రాహి ఆ చేతిని అందుకుని ముద్దుపెట్టుకుని "వదిలేయ్ నన్ను- రాలేను. రాను కూడా'' అన్నాడు.

"మాకు మీరు కావాలి డాడ్'

పాణిగ్రాహి రెండు చేతులూ పైకెత్తి దండంపెట్టాడు. "ఏమాత్రం దెబ్బతగిలినా భరించలేను. సారీ''

పరశురామ్ తండ్రి పక్కనే పడుకున్నాడు ఆరాత్రి. త్వరగా తెల్లవారిపోయింది.

పరశురామ్ బయలుదేరుతూ తండ్రివైపు దీనంగా చూశాడు. అతను కొడుకు భుజంమీద చేయివేసి తట్టాడు. కారు బయలుదేరింది. పాణిగ్రాహి మిగిలిపోయాడు.

★ ★ ★

శ్రీమహాలక్ష్మి అద్దంముందు తీరికగా కూర్చుంది. డ్రెసింగ్ టేబిల్ మంచి డిజైన్‌లో ఆమెకోసమే చేయించాడు పూర్ణచంద్రరావు.

చెంపలపక్క తెల్లబడుతోంది.

వెనకనుంచి ఆమె భుజంమీద చేయి వేసి హెయిర్ డ్రై డబ్బా ఆమె ముందు పెట్టాడు పూర్ణచంద్రరావు. ఆ చేతిని గట్టిగా పట్టుకుని మెడతిప్పి 'ఇప్పుడు యిది దేనికీ ఇంకా టైమ్ వుంది. మీ జుట్టంత ముగ్గుబుట్ట కాలేదు'' అంది నవ్వి.

పూర్ణచంద్రరావు ఆమెని దగ్గరికి తీసుకుని "సారీ నీ వయసు నలభైఐదు దగ్గర ఆగిపోయిందని చెప్పిన సంగతి మరిచిపోయాను'' అన్నాడు.

ఆదివారం అయినా విశ్రాంతి వుండదు. శ్రీమహాలక్ష్మి అక్కడినుంచి లేచి హాల్లోకి వచ్చింది. ఆమె వెనుకే పూర్ణచంద్రరావు కూడా వచ్చి కూర్చున్నాడు.

ఆ పిల్లలకి పెళ్ళిళ్ళు అయ్యాయి.

మనవలు కూడా పుట్టారు.

"ఆమె''కి శ్రీమహాలక్ష్మి గురించి తెలుసుకోవాలన్న కోరికలేదు. శ్రీమహాలక్ష్మి కూడా ఈ విషయంలో నిశ్శబ్దంగా వుంటుంది.

మెట్లమీద శబ్దం అరవింద్ బూట్లవే. అతని నడక తల్లికీ, తండ్రికీ తెలుసు. ఇప్పుడది వేగంగావుంది.

వస్తూనే "నాన్నగారూ! మంచి జాబ్ వచ్చింది. ఇదిగోమ్మా ఆర్డర్' అన్నాడు అరవింద్.

"ఇవాళ ఆదివారం కద"

"కొన్ని పనులు అయేవరకూ చెప్పకూడదని సెంటిమెంట్. మా ఫ్రెండ్ అడ్రస్‌కి వచ్చిందిది''

పూర్ణచంద్రరావు చేయి ముందుకు చాపాడు. "కంగ్రాట్సు. ఐ లౌ యూ మై సన్' అన్నాడు. తను నీరుపోసి పెంచిన మొక్క ఏపుగా పెరిగింది. పక్కనే వచ్చి కూర్చుని చెప్పాడు అరవింద్.

"బుధవారం మెడ్రాసు వెళ్ళాలి''

"అలాగే కానీ..." అన్నాడు అతను.

శ్రీమహాలక్ష్మి గుండె బేజారైంది. అయినా నిలదొక్కుకుంది. ఇప్పుడు చందమామ కథలు వినే తీరికలేదు అరవింద్‌కి. బిజీ. తనే బిజీ. వాడు యింకా బిజీ. పూర్ణచంద్రరావు చెప్పనే అఖ్ఖర్లేదు.

భోజనాలయాక పూర్ణచంద్రరావు కొడుకుని పిలిచి "నీక్కావలసిన డబ్బు తీసుకువెళ్ళు. నెలరోజులు వుండేందుకూ తినేందుకూ సమస్తం కావాలి. మంచి బట్టలూ, షూ కొనుక్కో. ఇబ్బంది అయితే ఫోన్ చేయి''

"అలాగే నాన్నగారూ''

"నువ్వు ఒక్కడివే వెడుతున్నావా''

"మేము ముగ్గురం వెడుతున్నాం. వెంకటేష్, అరుణ్ కూడా వస్తున్నారు''

"ముగ్గురికీ మెడ్రాసేనా?"

"అవును నాన్నగారూ''

పూర్ణచంద్రరావు పడుకునేముందు శ్రీమహాలక్ష్మి ఆ మంచంమీదే పక్కనే కూర్చుని "అందరూ వెళ్ళిపోతున్నారు'' అంది.

"ఇట్స్ నాచురల్' తను కళ్ళు మూసుకున్నాడు.

"ఇక సంపాదన చాలు అనిపిస్తోంది. ఈ జంజాటంనుంచి విముక్తి కావాలని వుందండి''

"అలాగే ఏర్పాట్లు చేసుకుందాం" అన్నాడు అతను.

ఆమె అతని పక్కన చోటు చేసుకుంది.



"'హేపీ న్యూయియర్' చెబుతున్నారు పిల్లలూ, స్నేహితులూ. పూర్ణచంద్రరావు ఇక్కడే వున్నాడు.

"అమ్మా నువ్వు బాగున్నావుకదా'' పరశురామ్.

"అమ్మా! ఎలా వున్నావు?" వైష్ణవి.

"అమ్మా కులాసాయేనా?" అరవింద్.

"నాన్నగారెలా వున్నారు'' వరుసగా టేప్ ఆన్ చేసినట్లు. ప్రతి వారం రోజులకీ, పండగలకీ, పుట్టిన రోజులకీ, పెళ్ళిరోజులకీ ఎప్పుడూ ఇవే డైలాగులు.

"అమ్మా మీరు మా ఇంటికి వచ్చి మాతో వుండండమ్మా'' అనే శ్రీమహాలక్ష్మి ఆశించిన ఆ పిలుపు మాత్రం వినిపించదు.

"మేము వస్తున్నాం"

"చాలా సంతోషం"

"రెండు మూడు రోజులకన్నా ఎక్కువ వుండలేం అమ్మా''

"సరేనమ్మా''

"టైమ్ సేవ్ అవుతుందని ఫ్లైన్‌లో వస్తున్నాం"

"మంచిది''

రొటీన్ డైలాగ్స్.

పూర్ణచంద్రరావు అక్కడికి వెళ్ళినప్పుడు పిల్లలతో మనవలతో గడిపి వస్తుంటాడు. ఆ ఇంటి గురించి అతను చెప్పకపోయినా ఆ ఆహ్లాదం అతని మొహంలో కనిపిస్తుంది.

ఆయనకి సాంఘిక వెలి లేదు.

శ్రీమహాలక్ష్మి చాలా ఏళ్లనుంచి పూర్ణచంద్రరావుని ఓవరం ఇవ్వండి ప్లీజ్ అంటూండేది.

"కోరుకో' అనేవాడు అతను నాటకీయంగా.

అది ఇప్పుడు నెరవేరింది.

పూర్ణచంద్రరావు కూనిరాగం తీయడం అంటే పట్టపగలు చుక్కలు పొడిచాయన్నంత వింతమాట.

"ఏయ్ శ్రీమహాలక్ష్మి! ఇలారా!!"

పిలుపులో కూడా మార్పు.

"చెప్పండి''

"చెప్పేందుకు ఏమీలేదు. నువ్వు నాకు

అందిస్తే నేను సర్దేస్తాను''

శ్రీమహాలక్ష్మి అతను పురమాయిస్తున్న వస్తువులన్నీ ముందు గదిలో వేస్తోంది.

అతను సూట్‌కేస్ పెద్దది తీసుకుని అందులో తనవీ, భార్యవీ బట్టల్ని మడతలు పెట్టి పొందికగా అమరుస్తున్నాడు. ఆమెదీ తనదీ రెండు కిట్‌లులేవు. ఒకే కిట్‌లో తను క్షవరం చేసుకునే సామాను అటు ఆమె అలంకరణ సామానూ సర్దాడు. అతను వేటినీ రెండుగా విభజించడు. ఆమె అతనివైపు ఆరాధనగా చూస్తోంది.

అతను నవ్వి ఓ చిన్న మొట్టికాయ వేశాడు.

"మన పరిచయం అయిన కొత్తల్లో, పెళ్లైన కొత్తల్లో చండశాసనులు మీరు. హిట్లర్ మీలా వుంటాడనిపించేది. ఒంటిమీద చేయివేస్తేనే కస్సూ, బుస్సూమనే మీలో ఇంత మార్పు..."

"నీకీ సంగతి తెలుసా?"

"తెలీదు'' అమాయకంగా అంది.

"గొంగళీ పురుగు సీతాకోకచిలుక అయినట్లు మనిషి కూడా అన్ని రూపాంతరాలూ చెందాల్సిందే''

"నాకు ఎవరైనా పిలిచి భోజనం పెడితే బాగుండును అనిపిస్తుందండీ. ఎవరికి వారే వాళ్ల చట్రాల్లో బిగుసుకుపోయారు''

"అదిగో అదే వద్దు అనేది. ఎవరో ఎందుకు పెట్టడం నేను లేనా?"

"సంఘంలో నాకే ఎందుకీ వెలి?"

"ఛీ!" అతను ఆమెని పొదివిపట్టుకుని "నిన్ను కాదన్న సంఘాన్ని నువ్వే వెలివేయి'' అని ఆమె బుగ్గమీద ముద్దుపెట్టుకున్నాడు. శ్రీమహాలక్ష్మి కళ్లు సజలాలయాయి.

అతని పనిని పక్కని తోసేసి ఒళ్లోపడుకుంది.

ఆమె మొహాన్ని రెండు చేతుల్తో పట్టుకుని "అప్పటికీ ఇప్పటికీ మార్పులేదు. అదే శ్రీమహాలక్ష్మి. మా ఇంటి శ్రీమహాలక్ష్మివి నువ్వు'' మరోసారి తనివితీరా ముద్దుపెట్టుకున్నాడు.

అక్కడ సెక్స్‌లేదు. ఆవేశంలేదు. ఆనందంవుంది. జీవిత పరమావధి వుంది. ఆమె అతని ఒళ్లో మొహం దాచుకుంది. తీయని ఆలంబన. విసిగివేసారిపోయిన తర్వాత లభించే విశ్రాంతి.

"చాలాఏళ్లు ఆలస్యం చేశారు. ఎక్కడికి పోయారు అన్నాళ్లు. నాకు ముగ్గురు పిల్లలు పుట్టి వాళ్లు పెద్దవాళ్లయ్యాకనా రావడం! చాలా తప్పుచేశారండీ''

"ఆమాటే నేనూ అనాలనుకున్నాను శ్రీమహాలక్ష్మి'' అతనామె జుట్టు నిమురుతూండిపోయాడు.

శ్రీమహాలక్ష్మి మాటలు గునగునమంటున్నాయి. నడకే కాదు మాటలు కూడా గునగునమంటాయి. ఆమె అతని ఒళ్లో వుందికదా అందుకు. ఆ శబ్ద తరంగాలు అలా వక్రీకరణం చెంది వినిపిస్తాయి.

"నివురు కప్పిన నిప్పు అంటే మీరే'

"ఇంకా?"

"మీరు కళారాధకులు, సంగీత ప్రియులు, మనసున్న మనిషి ఏది కాదని? సమస్తం మీరే... భగవంతుడు ఎలా వుంటాడో నాకు తెలీదు. నా భగవంతుడు ఇలా సాక్షాత్కారం ఇస్తున్నాడని నేను అనుకుంటున్నాను. నేనంటూ అడిగితే ప్రాణం కూడా యిస్తారని క్రమంగా తెలుసుకున్నాను''

"నన్ను వదిలి నువ్వు పోలేవుకనుక"

"ఉద్వేగంతో కూడా ఏడుపు వస్తుంది. ఈ ఏడుపు మధురంగా వుంటుంది కదండీ'' తల పక్కకి తిప్పి నవ్వింది.

పూర్ణచంద్రరావు ఆ తర్వాత ఆమెని విమానంలోనూ అలాగే దగ్గరకి తీసుకున్నాడు. ఎవరి చూపులూ తమమీదకు సోకని, ఎవరి నిష్ఠూరాలూ విననక్కర్లేని చోట కొత్త జీవితానికి అలా నాంది పలికారిద్దరూ!



# ‘బాధ్యత’ పై సమీక్షలు

జనవరి చతురలో ప్రచురితమైన హెూతాపద్మినీదేవి రచన
‘బాధ్యత’పై మాకందిన ఉత్తమ సమీక్షలు.



## ఈనాటి సమస్యే...

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

హెూతా పద్మినిదేవి ఈ నవలద్వారా నేటి సమాజంలో ఒకే ‘ఆడబిడ్డ’గల తల్లుల వృద్ధాప్య జీవితానికి సరికొత్త మార్గాన్ని సూచించారు. “అత్తమామలకు ఒక్క కూతురవు అదృష్ట యోగం పడితే...” అని ఇల్లరికపుటల్లుడు ఉల్లాసంగా అత్తింట్లో గడపటం, ఏ మాత్రం ఆక్షేపణ లేకుండా, కొడుకు లేని లోటు కన్పించనంతగా అత్తవారితో కలిసి జీవించడమనేది అరుదయిపోయిందని, దాదాపు ఆరోజులు అంతరించాయని ఈ నవలలో చెప్పకనే చెప్పడం జరిగింది.

పెచ్చుమీరుతున్న స్వార్థం, మరుగునపడుతున్న మానవత్వం చివరకు రక్త సంబంధాలను సయితం కలుషిత పరుస్తున్నాయని తల్లి అన్నపూర్ణమ్మపట్ల నీరజ ధోరణి, అత్త పార్వతమ్మను తప్పించుకు తిరిగిన అల్లుడు భాస్కర్ ప్రవర్తన తెలియపరుస్తున్నాయి. ఉమ, పల్లవి, నీరజ ఈ ముగ్గురమ్మాయిల మధ్య వున్న ఆర్థిక తారతమ్యాన్ని పక్కన పెడితే వారు తమ భర్తలకు తమ కన్నతల్లి బాధ్యతను చేపట్టవల్సిందేనని నిర్దేశించలేకపోవడమనేది నేటి మన వైవాహిక వ్యవస్థలో స్త్రీ యొక్క అసహాయ స్థితిని, అభద్రతాభావాన్ని చాటిచెపుతుంది.

ఏరికోరి ఉమను చేపట్టి ఆదర్శప్రాయుడన్పించుకున్న భాస్కర్ మొదట అత్తగారిపట్ల అనుచితంగా ప్రవర్తించినా చివరకు తన తప్పు తెలుసుకుని ఆమెను తన ఇంటికి ఆహ్వానించడం బావుంది. కాని పార్వతమ్మ స్వాభిమానం కాపాడుకోవడం పేరుతో “జబ్బు” కల్పించడం, అల్లుడి అండ చేరే అవసరం వుండదని, కేవలం ఒక అనాథ ప్రేత సంస్కారం తనకు జరగదన్న తృప్తి





మాత్రమే ఆమెకు మిగిలిందన్న ముగింపు అసమంజసంగా తోచింది.

నీరజలా నిలువెల్లా స్వార్థంతో కన్నతల్లిపట్ల పరాయిదానిలా ప్రవర్తించే కూతుళ్ళు ఎవరికైనా బుద్ధొచ్చేలా, 'కీలెరిగి వాతపెట్టినట్లు' అన్నపూర్ణమ్మ తీసుకున్న నిర్ణయం ఆదర్శంగా నిలుస్తుంది. పల్లవిలో ఆవేదనతో మొదలైన ఆలోచన, అరుణ్ తన వారిపై చూపుతున్న మమతానురాగాలు, భార్యపట్ల, అత్తగారిపట్ల ప్రదర్శిస్తున్న ఛీత్కారం, అతని నియంతృత్వ ధోరణిపై నిరశనగా కొనసాగి, చివరకు అతడి పురుషాహంకారాన్ని తృణీకరించి తనదైన పరిష్కారాన్ని వెతుక్కునేలా చేసింది. నేటి ఆధునిక స్త్రీకి ప్రతీకగా ఆమె తీసుకున్న నిర్ణయం అభినందించదగినది. అందుకు ప్రతిస్పందనగా అరుణ్‌లో పశ్చాత్తాప ధోరణి కనబరిస్తే బావుండేది.

కథనం బాగా సాగి, నవల అర్థాంతరంగా ముగిసినట్లు అన్పించింది. రచయిత్రి ఒక సమస్యాత్మక అంశాన్ని చక్కగా విపులీకరించి తనదైన పరిష్కారాన్ని సూచించినందుకు అభినందనీయురాలు.

-జె. కృష్ణవేణి
హైదరాబాద్-500 029.

## ఆశామార్గం

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

ఒక్కరు లేక ఇద్దరు అన్నది నేటి నినాదం. ఆ ఒక్కరూ అమ్మాయైతే, తల్లిదండ్రుల్లో తల్లి ఒక్కతే మిగిలితే, ఆమె ఎక్కడ మనుగడ సాగించాలి, ఆమె వంటరితనాన్ని దూరంచేసే ప్రక్రియ ఏది? అని ప్రశ్నించి అల్లుళ్ళ బాధ్యతను గుర్తుచేసింది 'బాధ్యత' నవల.

ఉమ తన తల్లి ఒంటరితనాన్ని దూరం చేయటానికి పడ్డ బాధ, గత్యంతరంలేక పరిస్థితులతో రాజీపడి తల్లిని ఆదుకోలేని ఆమె నిస్సహాయత హృద్యంగా ఉంది. పరిస్థితులు చేయిదాటిపోయిన తరువాత భాస్కర్‌లాంటి వ్యక్తులు మారటంవలన ఉపయోగంలేదు.

పల్లవి భర్తలాంటి మేకవన్నె పులులకు పెళ్ళి అనవసరం. ఎందుకంటే అటువంటివారికి పెళ్ళి అనేది ఓ ప్రహసనమే కానీ, దానివలన కొత్తగా కలిగే బాధ్యతలు, తన జీవితాన్ని పంచుకోవటానికి వచ్చిన వ్యక్తిని గౌరవించటం వంటి ప్రాథమిక విషయాలు కూడా తెలియవు. తెలిసినా అహంతో పాటించరు. అందుకే అటువంటివారు పెళ్ళి చేసుకున్నా, విడిపోవటమొక్కటే పరిష్కార మార్గమవుతుంది.

నీరజలాంటి మనస్తత్వం కలిగిన వాళ్ళు ఆడైనా, మగైనా తల్లిదండ్రులకు సమస్యే. కేవలం కొడుకులు మాత్రమే తల్లిదండ్రులను ఆస్తికోసం రాబందుల్లా పీక్కుతింటారు అన్న అపోహను తొలగించడానికి ఈ పాత్ర ఒక ఉదాహరణ.

పల్లవి, ఉమలు పరిస్థితులకు తల ఒగ్గినా చివరకు ఒకరకంగా విజయాన్నే సాధించారు.

అనాథశరణాలయాలస్థానే ఇప్పుడు వృద్ధాప్యంలో అనాథలవుతున్న వారికోసం ఓల్డేజ్ హోమ్‌లు పుట్టుకొస్తున్నాయి. అన్నపూర్ణమ్మ, మంగమ్మ లాంటివారికి అవే ఆశ్రయం అనుకుంటే బాధ కల్గుతుంది. కానీ కొడుకులే తల్లిదండ్రులను భారమనుకుంటున్న ఈ రోజుల్లో అల్లుళ్ళు అత్తవారి బాధ్యతను తీసుకోవటానికి ముందుకురాగల అవకాశాలు చాలా తక్కువ. కనుక వారు ఓల్డేజ్ హోమ్‌లోనైనా ఒకరికొకరు తోడునీడగా ఉండి ఒంటరితనాన్ని దూరంచేసుకోగలిగితే, ముదిమి వారికి దుఃఖాన్ని కల్గించదు. గత్యంతరంలేని ప్రస్తుత పరిస్థితుల్లో అదొక్కటే ఆశామార్గం, కనీసం ఆ వయోవృద్ధులకు మనశ్శాంతి దొరికే ప్రదేశం.

-బోయలకుంట్ల శ్రీదేవి
తిరుపతి-517 501.

## సజీవ ఆవిష్కరణ

(మూడవ బహుమతి రూ: 50/- పొందిన సమీక్ష)

"**అ**పుత్రస్య గతిర్నాస్తి" అని బలంగా విశ్వసించే సమాజంలో కూతుళ్ళు మాత్రమే ఉన్న తల్లిదండ్రులు వృద్ధాప్యంలో ఎదుర్కొనే సమస్యలనూ, సంఘర్షణలనూ, వారిపట్ల కూతురు-అల్లుళ్ల ప్రవర్తననూ కళ్లముందు సజీవంగా ఆవిష్కరించిన నవల- 'బాధ్యత'.

రచయిత్రి విభిన్న పాత్రల మనస్తత్వాలను చాలా సహజంగా, హృద్యంగా, సమగ్రంగా చిత్రించారు. పార్వతమ్మ, అరుంధతి, అన్నపూర్ణమ్మలు కూతురు మాత్రమే ఉన్న కుటుంబాలకు ప్రతినిధులు. కూతురి పెళ్ళి అయిపోయిన తరువాత జీవనతీరాల అంచుల్లో వారు పొందిన అనుభవాలే ఈ నవల! ఎన్ని కష్టాలు కలిగినాసరే వారు ఆత్మాభిమానాన్ని నిలబెట్టుకోవడం- కంటనీరు తెప్పించినా, ఆ పాత్రలపై గౌరవం కలుగుతుంది. అలాగే పరంధామయ్య, మురళీధరరావు పాత్రలు ఆసాంతం చాలా హుందాగా, పెద్దరికంతో కనిపిస్తాయి.

ఇంట్లో ఒద్దికగా ఉన్న అమ్మాయిలు పైచదువుల కోసం ఇంటికి దూరంగా హాస్టల్‌లో ఉండి చదువుకొనేటప్పుడు వారి ప్రవర్తనలో ఏర్పడే మార్పులను, భేషజాలను నీరజ పాత్ర చక్కగా ప్రతిఫలించింది. టీనేజిలో స్త్రీ పురుషుల మధ్య స్నేహానికి, ప్రేమకు గల విభజనరేఖ చాలా పలుచగా ఉంటుంది. అయితే ఎలాంటి ఆకర్షణకు చలించకుండా బాధ్యతగా ప్రవర్తించిన పల్లవి పాత్ర ఈ కాలపు అమ్మాయిలందరికీ ఆదర్శపాత్రం. ప్రతి సంఘటనలోనూ వ్యక్తమయ్యే ఉమ ఆత్మాభిమానం, పల్లవి ఆత్మీయత పాఠకులను ముగ్ధుల్ని చేస్తాయి.

నిరంతరమూ ఒకరకమైన శాడిజంతో రగిలిపోతూ అపార్థాలు సృష్టించే పాత్ర రుక్మిణి. అయితే చివర్లో భాస్కర్ తన తప్పు తెలుసుకొని పరివర్తన చెందడం ఊరట కలిగించింది. అన్నపూర్ణమ్మగారు వృద్ధుల శరణాలయాన్ని ప్రారంభించడం సమస్యకు ఒక కోణంలో పరిష్కారమని సూచించినా, పిల్లలుండీ లేనట్లయిన తల్లిదండ్రులను చూస్తే ఆవేదన కలుగకమానదు. పెరిగిపోతోన్న ఆర్థిక అవసరాలతో పరిసరాలే కాకుండా మనసులు కూడా ఇరుకుగా మారిపోతోన్న ఈ రోజుల్లో కుటుంబ వ్యవస్థ రూపురేఖలు కూడా మారడం సహజం. అయినా, భార్య తల్లిదండ్రులు కూడా తన తల్లిదండ్రుల వంటి వారేనని గుర్తించి, ఆదరించగలిగే సంస్కారం ప్రతి మగవాడూ అలవరచుకొన్నరోజున ఈ నవల ప్రయోజనం నెరవేరినట్లే.

సున్నితమైన శైలితో, సునిశితమైన సంభాషణలతో, సహజమైన వాతావరణంతో సంక్లిష్టమైన సమస్యను కూడా ఆసక్తికరమైన కథాంశంగా మలచిన రచయిత్రి అభినందనీయురాలు. ఒక మంచి నవల చదివిన అనుభూతిని కలిగించిన 'చతుర'కు కృతజ్ఞతలు.

-డాక్టర్ దర్భా సత్యనారాయణమూర్తి,
హైదరాబాద్-500 029

## వార్ధక్యం పునర్జన్మే!

(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

**అం**దరూ వుండీ ఎవరూ లేని దిక్కుమాలిన వాళ్ళుగా మిగిలిపోతున్న వారి జాబితాలో చేరిపోతున్న వృద్ధుల సమస్యను సున్నితంగా, హృద్యంగా చిత్రీకరించడమే కాకుండా, నవల ప్రధాన పరమార్థమైన పరిష్కారాన్ని అభినందనీయస్థాయిలో చూపిన రచయిత్రి హెూతా పద్మినీదేవికి హ్యాట్సాఫ్!

నవలలో మిగిలిన పాత్రలన్నీ ఒక ఎత్తు





యితే అన్నపూర్ణమ్మ, ఆమె కూతురు నీరజ పాత్రలే నవలకు అసలు సిసలు లక్ష్యాలు.

సమాజం వర్తమాన పరిణామక్రమంలో నశించిపోతున్న మానవసంబంధాలపై రచయిత్రి సంధించిన పలు ప్రశ్నల శరాలకు ఈ తరం యువజనం దగ్గర సమాధానం దొరక లేదన్నది నిర్వివాదాంశం. రెక్కలు ముక్కలు చేసుకుని 'కని' పెంచినవారిని కనిపించవద్దని చెప్పేంత హేయంగా చెప్పగల బిడ్డలున్న ఏ తల్లయినా, తండ్రయినా అవసరమైతే ఏం చేయాలో అన్నపూర్ణమ్మ చెప్పి చూపించింది. సామాజిక ప్రయోజనాన్ని ప్రధానాంశంగా తీసుకున్నప్పటికీ, ఫ్యామిలీ డ్రామాకోసం సృజించిన మిగిలిన పాత్రలూ తమ పరిధి మేరకు నవలలో మనల్ని పలకరిస్తూనే వుండడం రచయిత్రి శైలి పదును తేలిందనటానికి నిదర్శనం.

వార్ధక్యమంటే పనికిరానిదనుకుని భావించేవారికి చెంపపెట్టులా తగిలే పరిష్కారాన్ని చాలా హృద్యంగా, సున్నితంగా అర్థమయంగా పదునుగా చూపించగలిగిన రచయిత్రి కథనా వైదుష్యానికి మరోసారి అభినందనలు!

-బి. సరిత,
విశాఖపట్నం - 530 016

## సందేశాత్మకం

***(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)***

**హెూతా** పద్మినీదేవిగారు తమ నవల 'బాధ్యత' ద్వారా మగవాళ్ళు అత్తమామల బాధ్యతను స్వీకరించే సంప్రదాయంలేని మన వ్యవస్థలోని లోపాన్ని, ఏకైక పుత్రికా సంతానం గల తల్లితండ్రుల మనోవేదన, అభద్రతా భావం, వానికి తోడు ఆర్థికసమస్యలు తోడైతే ఎదుర్కొనే కష్టాలు మొదలైనవన్నీ చక్కగా విశ్లేషించారు.

పాత్రల చిత్రీకరణలో కొంత మూసధోరణి ఉన్నా, ప్రధాన పాత్రలయిన ముగ్గురు అమ్మాయిల ఉమ, పల్లవి, నీరజల భర్త తరుపువారు సంకుచిత తత్వం గలవారుగా, భర్తలు పురుషాహంకారం గలవారిగానో లేక భార్యను నిర్లక్ష్యం చేసేవారిగా అత్తగార్లను గౌరవించనివారుగా మలిచారు. ఈ నేపథ్యంలోని కొన్ని సన్నివేశాలు ఇప్పటికాలంలోని పరిస్థితులకు తగినట్లుగా అనిపించవు.

పాత్రల స్వభావాన్ని వివరించడంలో కొంత అస్థిరత కనిపిస్తుంది. భాస్కర్‌ను మొదట్లో ఆదర్శాలకోసం కట్నం తీసుకోకుండా పెళ్ళి చేసుకునేవాడుగా పరిచయంచేసి చివరకు అత్తగారి విషయంలో పిసినారిగా, కనీసం స్కూటర్ కిందపడ్డ అత్తగారికి చికిత్స చేయించడంలో కూడా డబ్బుకు వెనుకాడినట్లు చూపించడం కొంత వింతగా అనిపిస్తుంది.

గౌతమ్, అతని తల్లి కూడా మొదట డబ్బుమనుషులుగా కాక ఆస్తిపరులుగా, కట్నకానుకలు అక్కరలేనివారుగా పరిచయమయి చివరకు నీరజతో పెళ్ళి తరువాత స్వార్థపరులుగా, డబ్బుమనుషులుగా కనిపిస్తారు.

అయితే ఈ నవలను మరోకోణంలో చూస్తే తమ బంధువులకే అత్యధిక ప్రాధాన్యతను ఇచ్చి భార్య తరుపువారంటే చులకన గల కొంతమంది భర్తల స్వభావానికి అద్దం పడుతుంది. భార్య తల్లిదండ్రులను కూడా తమవారుగా భావించి ఆదరించాల్సిన ఆవశ్యకతను గుర్తుచేస్తుంది.

నవల ముగింపులో ఆర్థిక స్వేచ్ఛగల పల్లవి, అన్నపూర్ణమ్మలు చివరికి స్వతంత్రంగా జీవించాలన్న మంచి నిర్ణయాలు తీసుకోవడం, భాస్కర్ మారడంలో కొంత నాటకీయత కనిపించినా సందేశాత్మకంగా ఉంటుంది.

-కె. హరీష్,
ముంబై.



# రచయితలకు మనవి



* 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు వుంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
* **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
* **అవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే అయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
* ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
* సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
* **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**

# చతుర కతలు

## అభినందన సభ

ఓ తెలుగు నిర్మాత ఒరియాకథని, బెంగాలీ దర్శకుడితో హిందీలో తీశాడు- అవార్డుల కోసం. అది హైదరాబాద్‌లో రిలీజ్ అయింది. యథావిధిగా, తెలుగు నిర్మాతల సాంప్ర



దాయం ప్రకారం ఆ సినిమా అభినందన సభని ఏర్పాటు చేశారు. ఆనవాయితీగా చిత్రనిర్మాణంమీద అవగాహన లేని రచయిత్రులని మాట్లాడటానికి పిలిచారు.

ఓ అయిదు నక్షత్రాల హోటల్లో నాలుగో తారీకున ముగ్గురు రచయిత్రులు ఆ సినిమా మీద తమ అభిప్రాయాలని మైక్‌ముందు పలికారు.

అంతదాకా సదరు తెలుగు నిర్మాత తీసిన చిత్రాలన్నీ ఒక ఎత్తయితే ఇదొక్కటి ఒక ఎత్తని, అది చూసి పరవశించిపోయానని, దీన్ని తెలుగులో తీస్తే తెలుగు ప్రేక్షకులు కూడా ఆ ఆనందాన్ని పంచుకుంటారని, కనీసం తెలుగులోకి డబ్ చేసైనా విడుదల చేయాలని, తెలుగు ప్రేక్షకుల తరపున కోరుతున్నానని మొదటి రచయిత్రి వక్కాణించారు.

రెండో రచయిత్రి 'ఆహా! ఏమి ఆ కథ! ఏమి ఆ పాత్రపోషణ?! ఏమి ఆ కెమేరా పనితనం!!! ఏమేమి ఆ దర్శకత్వపు మెళకువలు? షడ్రషోపేతమైన విందారగించిన భావన కలిగెనుకదా?' అని తెలుగుక్లాసు తీసుకున్నారు.

ఇక మూడో రచయిత్రి మాత్రం తక్కువ తిందా?

"ఆ సినిమా అంతా ఒక ఎత్తు, పొలంగట్టున హీరో కొడుకు గడ్డిపువ్వు కోసిన షాట్ ఒక ఎత్తు. ఆ ఒక్కషాట్ కోసం ఆ సినిమాని ఇంకోసారి చూడాలనుకుంటున్నాను. దర్శకుడుగారికి అలాంటి కోణం ఎలా స్ఫురించిందో తెలుసుకోవాలనివుంది'' అంది.

వెంటనే బెంగాలీ దర్శకుడికీ విషయం



చతుర... 125

ఇంగ్లీష్‌లో వివరిస్తే ఆయన లేచి మైక్ అందుకుని ఒక్క ముక్కలో జవాబు చెప్పాడు.

“కెమేరాని ఒక్క అంగుళం లెఫ్ట్‌కి పెడితే, అక్కడున్న టి.వి. ఫ్యాక్టరీ కన్పబడుతుంది. ఒక్క అంగుళం కుడివైపుకి పెడితే ఎయిర్ పోర్ట్ కనిపిస్తుంది ఈ రెండూ చిత్రకథా సమయానికి చెందినవి కావు కాబట్టి ఆ షాట్‌ని అలా తప్పనిసరిగా తీయాల్సివచ్చింది’’

–డి.పద్మజ

---

## కల్తీ...కల్తీ...కల్తీ...

సుబ్బారావు ఓ ఫైన్ మార్నింగ్ పేపరు చదువుతూ తాగుతూన్న కాఫీని తుపుక్కున ఉమ్మి వేశాడు. పేపరును కూడా విసిరికొట్టాడు.



అతని చర్యకి అతని తల్లిదండ్రులు, చెల్లెళ్ళు విస్తుపోయారు.

ఓ అరగంట తరువాత అతనికి బెదురుగా టిఫిన్ పెడితే మొహం పక్కకి తిప్పుకొని తన అయిష్టతను ప్రకటించాడు. మధ్యాహ్నం భయంభయంగా అతన్ని భోజనం చేయమని అడిగితే... అతను విసురుగా జోళ్ళు వేసుకుని బయటికి వెళ్ళిపోయాడు.

రాత్రికూడా సుబ్బారావుతో ఇదే తంతు కొనసాగటంతో అతని కుటుంబసభ్యులు అతని విపరీత ప్రవర్తనగురించి తర్జనభర్జనలో పడ్డారు. ఉదయం పేపరు చదవటంతోనే అతను ఈ చర్యలకి ఒడిగట్టాడు కాబట్టి ఆ పేపరులోనే ఏదో తిరకాసు ఉండి ఉంటుందని వాళ్లకి అర్థం అయింది.

దాంతో పేపరులోని అక్షరం అక్షరాన్ని వాళ్ళంతా కలిసి భూతద్దంపెట్టి మరీ శోధించగా అందులో బాక్సు కట్టి ఉన్న చిన్నవార్త అతని విపరీత ప్రవర్తనకి కారణం ఏమిటో స్పష్టపరిచింది.

ఆవార్త ఏమిటంటే... ‘ప్రపంచంలో ప్రతి ఏటా కల్తీమూలంగా కొన్నివేలమంది చనిపోతున్నారు. ఏయే దేశాలలో ఎంతంతమంది చనిపోతున్నారు అనే లెక్కలూ, గణాంకాలూ.

“ఓస్! ఇంతేకదా...” రేపటికి ఈ విషయాన్ని మరిచిపోయి సుబ్బారావు మామూలుగా ప్రవర్తిస్తాడు అని అతని కుటుంబసభ్యులు

ఊపిరి పీల్చుకున్నారు.

కానీ సుబ్బారావు లేచీ లేవగానే "మనం తినే తిండి కల్తీ మాట్లాడే మాట కల్తీ... పీల్చేగాలీ కల్తీ" అని స్టేట్‌మెంట్ ఇచ్చి తన నిరాహారదీక్షను కంటిన్యూ చేశాడు.

ఈ తరువాత రోజుకూడా ఇదే కొనసాగి అతను నీరసపడిపోవడం... చివరికి స్పృహతప్పటం కూడా జరిగింది. దాంతో అతన్ని హాస్పిటల్‌కి మోసుకొని వెళ్ళి సెలైన్ ఎక్కించారు.

యిరుగు పొరుగువారి సలహాపై... సుబ్బారావుని అందరూ కలిసి మెల్లగా ఒప్పించి ఒక సైకియాట్రిస్టు దగ్గరికి తీసుకుని వెళ్ళారు.

సైకియాట్రిస్టు అతనితో ఓ అరగంట ముచ్చటించి "వెరీ సింపుల్ కేస్! మీ అబ్బాయి 'కల్తీ మేనియా' అనే వ్యాధితో బాధపడుతున్నాడు. ఈ ఇంజక్షన్ తీసుకొని రండి" అని కాగితంమీద రాసి సుబ్బారావు తండ్రికి ఇచ్చాడు.

సుబ్బారావు తండ్రి ఆదరా బాదరాగా వెళ్ళి ఇంజక్షన్‌ను, డిస్పోజబుల్ సిరంజిని పట్టుకుని వచ్చాడు.

డాక్టరు ఆ ఇంజక్షన్‌ను సుబ్బారావుకి చేయబోతుండగా అతను విదిలించుకుని అరిచాడు "ఈ ఇంజక్షన్‌లోని మందు కూడా కల్తీయే అయ్యుంటుంది. ఎందుకూ దండగ. పైగా ప్రమాదం కూడా"

–రవిచక్రవర్తి

---

# లేట్ క్యాట్

హైవేస్ డిపార్ట్‌మెంటులో అసిస్టెంటుగా పని చేస్తున్నాడు సుబ్బారావు. అతని ఆఫీసు హైద్రాబాద్‌లో వుంది. ఇల్లు మాత్రం ఆఫీసుకి ఇరవై కిలోమీటర్ల దూరంలో వుంది. విజయవాడ హైవేలో వున్న ఓ గ్రామంలో సొంత ఇల్లుంది అతనికి. పట్నంలో కాపురం పెడితే వచ్చే జీతమంతా ఇంటి అద్దెకే జమ అవుతుందని, దూరమైనా రోజూ స్వగ్రామం నుంచి స్కూటర్‌మీద ఆఫీసుకి వెళ్లి వస్తూంటాడు. రోజూ ఆఫీసుకి లేటుగా వస్తుంటాడు.

అటెండెన్సులో పంక్చ్యువాలిటీ లేకపోవడంతో సెక్షన్ హెడ్‌కి హెడ్‌ఏక్‌గా తయారయాడు సుబ్బారావు. నయానాభయానా చెప్పి చూసినా ఇంప్రూవ్‌మెంటు లేకపోయేసరికి, తన పై అధికారికి ఫిర్యాదు చేశాడు.

అసిస్టెంట్ ఇంజనీరు సుబ్బారావుని పిలిచి రోజూ ఆఫీసుకి లేటుగా వస్తున్నందుకు తలవాచేలా చీవాట్లు పెట్టాడు. డిసిప్లినరీ యాక్షన్ తీసుకుంటానని బెదిరించాడు.

తిట్లన్నీ మౌనంగా తిన్నాడు సుబ్బారావు. ఆ తరువాత మెల్లగా నోరు విప్పాడు, "మీ ఆదేశాలను పాటించడం వల్లే నేను రోజూ ఆఫీసుకి లేటవుతున్నాను" అన్నాడు చల్లగా.

ఎ.ఇ. తెల్లబోయి, "వాడ్డూయూ మీన్?" అన్నాడు.

"ఎస్సార్. హైవేస్ డిపార్టుమెంటు మనది. హైవేని ఉపయోగించే ప్రయాణీకుల కోసం దారి పొడవునా ఎన్నో సూచనలను, హెచ్చరికలను చేసింది మన డిపార్టుమెంటు. వాటిని ప్రయాణీకులందరూ పాటించి తీరాలన్నదే మన ధ్యేయం. ఔనా సార్?" అడిగాడు సుబ్బారావు వినయంగా.

"సో వాట్?"

"ఆ హెచ్చరికల్లో ఒకటి ఆల్వేస్ బీ మిస్టర్ లేట్, రేదర్‌దేన్ బీయింగ్ లేట్ మిస్టర్... ఔనా?" అడిగాడు సుబ్బారావు.

"అయితే?" విసుగ్గా అన్నాడు ఎ.ఇ.

"అదేసార్! నేను ఆఫీసుకి వచ్చేది హైవే మీద నుంచేనన్న విషయం మీకు తెలుసు.



ఆఫీసుకి ఆలస్యమవుతోందన్న కారణంగా నేను మీ హెచ్చరికను పాటించకుండా వేగంగా స్కూటర్ డ్రయివ్ చేసి లేట్ మిస్టర్ నయిపోయాననుకోండి, అప్పుడు మీ నిబంధనలను నేను వుల్లంఘించినట్లు కాదూ? అందువల్ల ఏ డిపార్టుమెంటులో వర్కు చేస్తున్నానో ఆ డిపార్టుమెంటుకే తలవంపులు తెచ్చిన వాణ్ణికానూ?"

"ఆc...!?"

"క్రమశిక్షణ నా ప్రాణంసార్! ఆఫీసులోనైనా, హైవేలోనయినా మీ ఆదేశాల్ని పాటించడం నా విధి. అందుకే సార్! నేను హైవే మీద నిదానంగా డ్రయివ్ చేసుకుంటూ వస్తాను'' వివరించాడు సుబ్బారావు అమాయకంగా ముఖంపెట్టి. "మీ ఆదేశాల్ని పాటించడమే నా తప్పయితే తీసుకోండి సార్, నా మీద డిసిప్లినరీ యాక్షను''

అతని లాజిక్ వినడంతో హైవే మీద బ్రేక్‌నెక్ స్పీడులో వెళుతున్నట్లు బుర్ర గిర్రున తిరిగిపోయింది ఎ.ఇ.కి.

**-తిరుమలశ్రీ**

---

## ఘరానా దొంగ

"ఏంట్రా, ఏమిటా హడావుడి? ఎందుకంత టెన్షన్‌గా ఉన్నావ్?"

"చోరీ ఘు...ఘు...ఘరానా చోరీ''

"ఆగాగు... ముందు నువ్విలా వచ్చి కూర్చో. అలుపార్చుకో. ఈ మంచినీళ్లు తాగు''

"..."

"ఆc... ఇప్పుడు చెప్పు. చోరీ ఏమిటి? ఘరానా ఏమిటి? ఎప్పుడు, ఎక్కడ, ఎలా జరిగింది?"

"మా ఇంట్లోనే. భయంకరమైన దొంగతనం జరిగింది''

"అయ్యో పాపం! ఎలా జరిగింది?"

"నేనూ, మా ఆవిడ బజారుకెళ్లి వచ్చేసరికి మా ఇంటి తాళం పగలగొట్టి ఉంది. మాకు వణుకు పుట్టింది. తలుపులు తెరిచి, లోపలికెళ్లాం. బీరువా తలుపు బార్లా తెరిచి ఉంది''

"బంగారం పోయిందా?"

"లేదు''

"బట్టలు పోయాయా?"

"ఊహూc.. అమెరికాలో ఉంటున్న





మిత్రుడు పంపిన అపురూపమైన కానుక బీరువాలోనే ఉంది''

"అది పోయిందా?"

"లేదు''

"మరి?"

"ఫ్రిజ్జూ, కూలరూ, మిక్సీ..."

"అవి పోయాయా?"

"లేదు. టీవీ..."

"ఓహో టీవీ పోయిందా?"

"అది పోతే ఏడవటమెందుకు?"

"మరింకేం పోయింది?"

పిల్లినెత్తుకెళ్లి ఉంటాడు''

"అంత ధైర్యం ఎవడికుంటుంది?"

"మరేం పోయిందిరా బాబూ?"

"డైనింగ్ టేబుల్ మీద అన్నమూ, కూరా అలాగే ఉన్నాయ్. సాంబారు గిన్నె అలాగే ఉంది''

"పిడతలో మజ్జిగ అలాగే ఉన్నాయ్. కుండలో నీళ్లు అలాగే ఉన్నాయ్. బిందెకు పడ్డ బెజ్జం అలాగే ఉంది. గాబులో కుడితి అలాగే ఉంది. గాడిదగుడ్డు అలాగే ఉంది''

"నోనో... అసలు మా ఇంట్లో గాడిదే



లేదు''

"మధ్య గదిలో బ్రహ్మాండమైన పుస్తకాలున్నాయి''

"అవి కాస్తా దొంగార్పణమా?"

"లేదు... భద్రంగా ఉన్నాయి''

"ఒరే ఒరే! నీక్కోపముంటే ఒకేసారి చంపెయ్''

"అక్కణ్ణుంచీ వంటగదిలోకి వెళ్లాం"

"వంటపాత్రలన్నీ హుష్‌కాకా?"

"స్టీలు సామాను, డబ్బాలు, పెట్టెలు- అన్నీ సర్దినవి సర్దినట్లే ఉన్నాయ్. పంచదార, కాఫీపొడి, చింతపండు అన్నీ అలాగే ఉన్నాయ్''

"ఆఁ.. అర్థమైంది. మీరు పెంచుకునే

"ఒరే నీ కాళ్లు పట్టుకుంటారా. చచ్చి మీ ఆవిడ కడుపున పుడతారా. ఇలా హింసించటం మానేసి ఏం పోయిందో చెప్పరా''

కాస్త తక్కువలో దొరుకుతున్నాయని నిన్న నీ దగ్గర అప్పుచేసి కొన్న అయిదు కిలోల ఉల్లిపాయలు పోయినైరా''

"?...! ?...!"

-మువ్వా వెంకటరామిరెడ్డి



# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA.

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **VASUNDHARA PUBLICATIONS** 6–3–570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 082. |

**I, RAMOJI RAO,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/– RAMOJI RAO**
Publisher

Date: March 1, 1999

---

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331250.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78